# ఉపోద్ఘాతము.



ప్రాచీన [illegible] మహాకవుల [illegible] ఉత్తమభావాలు నైతిక [illegible] జీవిత ప్రవంతి [illegible] దో చిత్రించ ప్రయత్నించాను. ఈనాటక [illegible] చిరకాలమునుంచి నిర్బంధవైధవ్యమున్నూ, మధుమాంస నిషేధమున్నూ, అనుశ్రుతంగా ఆచరింపబడుతూన్న కులాలలో అప్పుడప్పుడు స్త్రీపునర్వివాహములు జరుగుతుండడమూ, మధు మాంససేవన మనుమతించడమున్నూ ప్రత్యక్షంగా కనుపిస్తుంది. మనసంఘచరిత్ర వ్రాయబూనుకొన్న వారికి అలా పురాతనాచా రాల ఉన్మూలనముతోపాటు, మనుష్యునిలో అంతర్గతంగానున్న సాత్విక ప్రవృత్తి ప్రకోపించి పరిణామములు సంఘటించడం కూడా కద్దు.

మానవునిలో అంతర్గతంగానున్న యీ మూలప్రకృతికి నాగరికత పైపూతలు పెట్టుతుంది. ఆపైపూతలే, ఉంచరా అయోచిత పూతలైతే అంతస్తత్వమును కూడా మార్చగలవు. కాబట్టి నేను పురాతనకాలంలో నిర్బంధవైధవ్యమున్నూ, మధు మాంసనిషేధ ప్రభావమున్నూ మనవారు ఆచరిస్తున్నారని నమ్మదగిన కారణాలు లేకపోయినా, సన్న్యాసాంతరం [illegible] మధ్యకాలంలో వచ్చిన నిర్బంధవైధవ్యా వ్యాచారములు మన ఉత్తమకులము లలో పాతుకుపోయి ఇప్పుడు ప్రబలప్రయత్నంచేతగాని పెల్ల గించడానికి సాధ్యంకాకున్నవి.

ఈ స్త్రీపునర్వివాహములమీద వైముఖ్యంమాత్రం ఇంకా కొన్నిశతాబ్దులదాకా వదలకపోవచ్చును. కాని అట్టి నిర్బంధ

వైధవ్యము క్రూరకర్మమనీ, న్యాయం కాదనీ, ధర్మం కాదనీ బోధిస్తూ ఉండగా ఉండగా అది యేనాటికైనా పూర్తిగా అంతరింపవచ్చును. శాకాహారం, మధునిషేధము మాత్రం అంత సులభంగా వదలిపోయేవి కావు. ఎందువల్లనంటే భోగాసక్తి, ఆవశ్యకతా తప్ప మధుమాంససేవనాని కితరకారణాలు కనుపించవు. మధుమాంసనిషేధం నీతివిరుద్ధమని చెప్పనులేము. వానిని సేవించడంవల్ల శరీరానికేమో మేలగుతుందనేమాట కూడా సంశయాస్పదంగానే ఉంది.

సర్వసమ్మతమై, పరిపాటియైన ఆచారముల ఔచిత్యమును వ్యక్తులు విచారించకుండానే వాటిని అవలంబించుతారు. కాని చిరకాలాగతమైన ఆచారములను క్రొత్తభావాలు వచ్చి మూలమట్టంగా కదలించివేస్తున్నప్పుడు మాత్రం ప్రతివ్యక్తిన్నీ తన కర్తవ్యమునుగూర్చి దీర్ఘంగా విచారించక తప్పదు. అప్పుడే తండ్రిబిడ్డలకు, ఆలిమగళ్లకు, అన్నదమ్ములకు మధ్య భేదభావాలు పుట్టుతవి. వెనుక అమెరికాదేశీయులకు అంతఃకలహాలు వచ్చినప్పుడలాగే తటస్థించింది. తాత్కాలికంగా ఈవిభేదములు వాంఛనీయంగా కనుపించవుగాని మానవసంఘం ముందుకుసాగిపోవాలి అంటే ఇటువంటివి రాక తప్పదు. మానవసంఘమనే మద్దెల శ్రుతిచేయాలంటే ఈబిగింపులు సమ్మెటపోట్లు అవసరం.

ఈగ్రంథముల పరిష్కరణమునందు నాకు తోడ్పడిన మిత్రులు డాక్టరు వైద్యనాథస్వామి, ప్రొఫెసరు సూర్యనారాయణశాస్త్రిగారలను సంతోషంగా స్మరిస్తున్నాను.

**ఏ. యస్. పి. అయ్యరు.**

# ఇందలి పాత్రలు

---

| | |
|---|---|
| 1. శ్రీనివాసులు | సాహుకారిగుమాస్తా |
| 2. మంగళ | ఆతనిభార్య |
| 3. సీత | ఆతనికూతురు |
| 4. వెంకటప్పయ్య | సీతభర్త |
| 5. అండాళమ్మ | వెంకటప్ప |
| 6. రాజగోపాలం | శ్రీనివాసులు పెద్దయల్లుడు |
| 7. రత్నయ్య | శ్రీనివాసులు యజమాని |
| 8. అచ్యుతం | పారసీకదేశంలో పనిచేయుచున్న బ్రాహ్మణుడు |
| 9. విశ్వనాథం | వెంకటప్పయ్యస్నేహితుడు |

---

# సీత పెండ్లి

---

## అంకము. 1.

[కృష్ణగిరిలో వీధికి పడమరగా ఒక చిన్న మేడ. క్రింది అంతస్తులో మూడుగదులు, ఒకహాలు, ఒకవసారా, వంటయిల్లు. మిద్దెమీద ఒక్కటే పెద్దగది. ఇంటివెనుక కూరలపాదు లున్నవి. హాలుకు రెండుగుమ్మములు కలవు. కుడివైపుగదిలో కొకటి. వెనుకనున్న వంటయింటి కొకటి.

పాలకుత్రిమార్గమునుండి శ్రీనివాసులు ఇంటికివచ్చి హాలులో ప్రవేశించును. మంగళ తలదువ్వుకోవడం ముగించి ప్రసన్నముఖంతో ఎదురు వచ్చును. శ్రీనివాసులుకు నలుబదియారేళ్లవయస్సుంటుంది కాని ఏపుగా తెగపెరిగిన కుఱ్ఱవానివలె కనబడతాడు. మంగళ నలుబదిరెండేండ్లప్రాయాలు. ఆమె ముఖలక్షణాలలో దృఢశీలము గడుసుదనము కనుపిస్తున్నవి. సమయము. ఉదయం గం 11 లు.]

**మంగళ**—విన్నారా? మన సీతకు సంబంధం కుదిర్చాను.

**శ్రీనివాసులు**—ఎలాగూ! చెప్పవు? పెండ్లికొడు కెవరు?

**మంగ**—శివపురపువారి అబ్బాయి వెంకటప్పయ్య.

**శ్రీని**—అబ్బా యేమిటి, నలభైయేళ్లవాణ్ణిపట్టుకొని? నీకేమైనా మతిపోయిందా యేమిటి? మన అమ్మాయికి వడసారం పద్ధాలుగేండ్లు గదా! రెండోపెళ్లివాడికి ఎట్లా కట్టిపెట్టుతావు? పైగా వాడికి క్షయరోగమని చెప్పుకుంటారు.

**మంగ**—ఈగాలివార్తల కేమిలెండి. నిక్షేపంలాంటి ముప్పయ్యే ళ్లవాణ్ణిపట్టుకొని క్షయరోగమంటే యెవరైనా నవ్విపోతారు. కాకపోతే కొంచెం ఉబ్బసం వున్నదేమోకాని క్షయరోగం మాట సుతరామూ నిజంకాదు. ఏముంది పాడులోకం! ఇట్లాగే లేనిపోని వార్తలు పుట్టించి కాస్త వుంటే గంపెడు చేస్తారు! ఉఱిమిందంటే మెఱిసిందంటారు. కొంచెం ఎవడైనా కర్కంచాలక దగ్గితే చప్పున క్షయరోగ మని పేరుపెట్టేస్తారు. ఒంటిమీద కాస్త బొల్లిమచ్చ కన బడితే చాలు, కుష్ఠు అనేస్తారు. చూపు ఒక్కరవ్వ తగ్గితే కళ్లే కనబడవుట అంటారు. ఈజాడ్యమంతా లోకులదృష్టిలోనే వుందికాని వేఱేమీలేదు. మనసీతకయినా పద్ధాలుగేళ్లు వెళ్లినవికాని చిన్నపిల్లకాదు గదా! కాకపోతే వెంగుకు రెండోపెళ్లే అనండి. మఱి మనమిచ్చేముష్టి అయిదువందల కట్నానికి మొదటి పెళ్లివాడు ఎట్లా వస్తాడు చెప్పండి!

**శ్రీని**—ఓహో! పెండ్లికొడుక్కు కట్నంకూడా ఉందన్నమాట!

**మంగ**—మీదంతా చోద్యమండీ! ఈరోజుల్లో మనవైపు బ్రాహ్మల్లో కట్నంలేకుండా పిల్లను చేసుకొనేవాళ్లెవళ్లు చెప్పండి! రెండోపెళ్లివాళ్లకే బోలెడు కట్నాలిస్తామని ఆడపిల్లల్ని తీసికెళ్లి కాళ్లమీద పడేస్తూ వుంటేను!

**శ్రీని**—వెంగుకు కూడా ఇతరత్రా సంబంధాలు వస్తున్నవా?

**మంగ**—రాకేమి! ఇంకా రెండు సంబంధాలు వచ్చి కూచు న్నాయి మనకు పోటీగా. మనపిల్ల అందంగా ఉందని వీళ్లు మనసంబంధం నిశ్చయించుకున్నారు.

శ్రీని—ఇంతకు కాలమిట్లా కాలిపోతూవుంది. కాకపోతే నిక్షేపంలాంటి మనసీతకు రూపం తక్కువనా, చదువు తక్కువనా? ప్రతిక్లాసూ ఫస్టుగా పరీక్షవుతూవుంది. సంగీతంలో బంగారపు పదకం గూడా సంపాదించింది గదా, అటువంటి దాన్ని రెండోపెళ్లివాడికి, అందులో రోగిష్టివాడికి ఎందుకు ముడిపెట్టవలసి వస్తుంది! ఈ అవలక్షణాలకు తోడు వెంగుకు ఆస్తికూడా సున్న. పిల్లదానిగతి యేమికావా లనుకున్నావు. నీకెట్లా తోచలేదంటా!

మంగ—ఆమాటకొస్తే నన్ను చేసుకున్నప్పుడు మీకేమి ఆస్తి వుంధి? మాగతి యేమికావాలి చెప్పండి?

శ్రీని—అదిగో! ఇందులో నాప్రస్తావన తెస్తా వెందుకు? అయినా, చూస్తున్నానుగా, నీవైఖరంతా బొత్తుగా మారిపోతూవుంది. అయిదేళ్లనాడు నామీద డిక్రీ అయిన వంద రూపాయిలు నువ్వు తీర్చడమే మొదలు. రాజగోపాలానికీ నీకు లోకువై పోయినాను. మళ్లా యేడాదికి రెండో వాయిదా డెబ్భైయైదురూపాయలు కట్టిన దగ్గరనుంచీ బొత్తిగా చెడ్డది.

మంగ—చెడక ఏమవుతుందనుకున్నారు! పెళ్లాం బిడ్డలు గల సంసారికి ముండ లెందుకు? ఆముండలదగ్గర డబ్బుతీసుకున్నట్టుగా సాక్షిసంతకాలతో అబద్ధపు పత్రాలు వ్రాయడ మెందుకు? నేను చెమటలోడ్చి, పిడకలుచేసి అమ్మీ, పాలమ్మీ, ఊరగాయలమ్మీ దమ్మిడీ, దమ్మిడీచొప్పున సంపాదించిన కష్టార్జితమంతా మీ దుర్వృత్తికోసం ఆముండల మొగానపెట్టి

మీకు జయిలు తప్పించడం ఎందుకు వచ్చిందీ! ఇంతకు జైలు తప్పించడం దోషం నాదీ.

శ్రీని—ఎవడికోసం? నామీద నేమి దయ తలచి తప్పించావా? మొగుడు జైలులోబడితే నీకే అపకీర్తి అని తప్పించావు. అక్కడికి నీవేమో మహా విఱగబడుతున్నట్లు చెప్పుతావు. నేను మాత్రం కష్టపడడం లేదా? సంపాదించడం లేదా?

మంగ—అబ్బో! మీసంపాదన అంతా యింతానా? మహా చేస్తున్నా రెట్లాగయితే నేమి పాలకోడేటి రత్తయ్యగారి దగ్గఱ గుమాస్తాగిరి. దినాలకొలది అవ్వాల్లో పడివుండి చాకిరీ చెయ్యడమేకాని సంపాదన వంటవ్వూటింటికీ తమలపాకులకే చాలదు. కాకపోతే అప్పాల్లో పని అనేపేరుతో అక్కడ చెడుముండలతో తిరగడమొకటి కనిపిస్తూవుంది. ఈచెడు త్రిప్పటకోసము ఆరత్తయ్యగారి జమాఖర్చులెక్కలలో ఏమి పూర్ణంపెడుతున్నారో ఏమో! ఆదొంగపత్రాలనాటినుంచి నా కిదొక భయం కూడా పట్టుకుంది.

శ్రీని—(కోపంతో) ఆ! ఆ! ఏమన్నావు!

మంగ—నవ్వుతూ అన్నాను. కోప్పడకండి. మీవల్ల మోస పోవడానికి రత్తయ్య ఏమీ తెలివితక్కువవాడు కాడని నే నెఱక్కపోలేదు.

శ్రీని—అయ్యో! నీవెఱక్కేమి! సర్వమూ ఎఱుగుదువు!

మంగ—ఇరవై యేళ్లనుంచి మీతో కాపురంచేస్తూ మీస్వభావం ఆమాత్ర మెఱగనూ!

్రని—ఒకొ్కక్కళ్ల దశ్టే తెలిసిపోతుంది. ఒకొ్కక్కళ్ల స్వభావం నూరేళ్లకైనా గ్రాహ్యంకాదు

మంగ—(దగ్గరగావెళ్లి) నిజం చెప్పండి. మీస్వభావంలో నాకు గ్రాహ్యంకాని దేమున్నదో!

శ్రీని—ఆడిక్రీలు నీకు తెలియకుండా వచ్చినవా, లేదా?

మంగ—డిక్రీలు వచ్చినమాట నిజమేకాని, వాటిమూలకారణం నాకు తెలియంది కాదు. మీనడతంతా నాకు తెలుసు. అయ్య గారి చంచలస్వభావం ఎవ్వరూ ఎఱుగరనికాబోలు! మీకు ఎదుట నున్నదే పెళ్లికూతురు. మొగం చాటయితే మీకు జగమే చాటవుతుంది. కొత్తదానిముఖం కనపడితే చాలు, రూప మక్కఱలేదు, కుల మక్కఱలేదు. సాని, సంసారి అనే విచక్షణక్కఱలేదు. దానివలలో చిక్కడమే. ఇంత పచ్చిపాప మెక్కడా లేదు.

శ్రీని—ఎక్కడా లేకేమి! కాకపోతే నీకు విడ్డూరంగావుందిగాని

మంగ—చాల్లెండి. సంసారన్నవాడికి నీతివుండాలా, లేదా?

శ్రీని—ఉండవలసిందే. కాని శాస్త్రాలు వేరు. అనుభవం వేరు. మగవాడు తుమ్మెదవంటివాడు. తుమ్మెద ఒక్కపువ్వునే అంటి పెట్టుకు వుంటుందా? కొత్తకొత్తకొమ్మన సామెత నీవు విన లేదూ?

మంగ—ఈమాటలకేమిగాని, నేనొక్కటి అడుగుతా చెప్పండి. ఈస్త్రీలందఱిమీదా మీకు నిజంగా ప్రీతి వుందా, లేక వట్టి కామాంధకారంచేతనా?

శ్రీని—ఆ రెంటికీ భేదమేమిటో నాకు తెలియలేదు.

మంగ—కామమనేది వట్టి భోగాసక్తి. సులభంగా స్వసుఖం సంపాదించాలనే కోరిక. స్వసుఖం కోరనిదీ, ప్రేమించినవాళ్ల కోసం ప్రాణమైనా యిచ్చేదీ ప్రీతి. అది దివ్యమైనదీ, పవిత్రమైనదీని.

శ్రీని—ఓహో! అలాగయితే అటువంటి ప్రీతి నా కేస్త్రీయందునా లేదు.

మంగ—(చిఱునవ్వుతో) సరేకాని నామాటో? నాయందు కూడ తుచ్ఛకామమేనా?

శ్రీని—అది కామం కాదు. ప్రీతి కాదు. దాంపత్యధర్మం.

మంగ—(క్రోధంగా) అనగా, ప్రాతపడిపోవడంవల్ల, కామం కూడా నశించి వట్టి వాలాయమయిందన్నమాట. పో నియ్యండికాని, మఱెవ్వరిమీాద మీాకు ఎన్నడు ప్రేమ అనేదే కలగలేదా!

శ్రీని—లేకేమి? మనపిల్లలమీాదా, అందులోను సీతమీాద నాకెంతో ప్రీతి. అందువల్లనే నీవు కుదిర్చినసంబంధం నాకు నచ్చలేదన్నాను.

మంగ—నచ్చలేదనటమేకాని అంతకన్న మంచిసంబంధ మేమైనా కుదిర్చారా? మఱే! మీాకు ఇంటిమీాదా, పిల్లలమీాదా ధ్యాస వుంటేగా!

శ్రీని—ఉంటేమాత్రం ఈపెళ్లికొడుకుల గిరాకీరోజుల్లో అంత సులభంగా సంబంధాలు ఎట్లా కుదురుతవీ? మొదలు సంబంధం వెదకి తేవడానికి నాకు తీరికేదీ!

**మంగ**—అవును, మీకామూండలతోనే సరిపోయె. పాపం! కూతురువిషయంలో శ్రద్ధచేసే తీరికెక్కడిదీ! వయసువచ్చిన పిల్లను పెండ్లిచేయకుండా ఇంట్లో పెట్టుకొని ఈ అప్రతిష్ట నేను మోయలేను. ఏమైనా సరే, పిల్లను వెంగుకిచ్చి ముడి వేయడం తప్ప నాకు వేఱేమార్గం కనుపడలేదు.

**శ్రీని**—నాకుమాత్రం ఈసంబంధం ఇష్టంలేదు. పిమ్మట నీయిష్టం. నీపట్టు ఎవరు మాన్పగలరు?

**మంగ**—మీకిష్టంలేకపోతే కన్యాదానం ఎవరు చేస్తారు?

**శ్రీని**—నేనే చేస్తాను. తప్పుతుందా మఱి? బుద్ధిపూర్వకంగా మాత్రం చేయను.

**మంగ**—ఇస్. ఊరుకోనండి. అమ్మాయి వస్తూవుంది. (అందమైన నీలవర్ణపుచీర కట్టుకొని, మల్లెపూవులు ముడిచినజడతో, పదునాలుగేండ్ల చక్కనిపిల్ల, సీత ప్రవేశించును.)

**సీత**—నాన్న ఎప్పుడో వచ్చాడే! అదేమిటి! నాన్నా! ఏదో ఖేదంగా వున్నారు! నేను నిన్న నేర్చుకున్న పాట పాడి వినిపించనా?

**శ్రీని**—ఏదీ! పాడమ్మా!

**సీత**—(పాడుచున్నది).

హరిరిహ విహరతి సరసవసంతే
నృత్యతి యువతిజనేన సమం సఖి,
లలితలవంగలతాపరిశీలనకోమలమలయసమీరే
అలికులనికరకరంబితకోకిలకూజితకుంజకుటీరే ॥హరి॥

**శ్రీని**—బాగు బాగు - అమ్మాయి! నీవీపాట ఎచట నేర్చుకొంటివే ?

**సీత**—గంగమ్మభర్త పంపిన గీతగోవిందములోది నాన్నా! అమ్మ నాకు కొనిపెట్టిన యీచీర బాగున్నదా ?

**శ్రీని**—బాగుంది తల్లీ! నీవెచటికి వెళ్లితివి ?

**సీత**—లలిత పెండ్లికి పేరంటము వెళ్లివచ్చాను.

**శ్రీని**—లలితనా సివిలు సర్వీసు ఉద్యోగికి కాదూ, ఇచ్చారు ?

**సీత**—అవును. ఆయనగారు సీమనుంచివచ్చి ఏడాదైనా కాలేదు. నాన్నా! ఆయన యెంతమంచివాడనుకున్నారు! సీమకు వెళ్లి వచ్చాడన్నమాటేకాని ఆయనలో ఆభేదమేమీ కనుపించదు. లలితకు అన్నివిధాల ఆయన తగినభర్త. లలిత ఆయనతో సుఖపడుతుంది అటువంటి భర్తకొఱకు లలిత ఏమి నోములు నోచినదో! నాన్నా! మీరేదో వ్యాకులంగా ఉన్నారు. కారణం చెప్పరూ ?

**శ్రీని**—మరేమీ లేదుకాని, అమ్మా! మఱి పదిహేనురోజుల్లో నీకు కూడా వివాహం జరుగుతుంది, విన్నావా ?

[సీతకు ఆశ్చర్యము కుతూహలము కలుగుతుంది.]

**మంగ**—అవును తల్లీ! శివపురపువారి వెంకటప్పయ్యకు నిశ్చయించారు. శుద్ధదశమికి లగ్నం.

**సీత**—(విస్మయముతో) ఏమిటీ! ముసలి అండాళ్లమ్మకొడుకేనటే అమా!

మంగ—అవును తల్లీ! అతనికి పడసారం ముప్పైఅయిదేండ్లు. తల్లికూడా చాలా మంచిది నువ్వు అన్నివిధాలా సుఖపడతావు. (కంఠస్వరం మార్చి) అమ్మాయీ! నీకు పెండ్లిఈడు దాటిపోతూవున్నది. ఇక ఆపడానికి వీలులేదు. ఉన్నంతలో మంచిసంబంధమే నిశ్చయించాను. అయిశ్వర్యాల కెక్కడికి? ఏదో మనకు తగిన సంబంధం వస్తుంది కాని నోయలేని బఱువు లెత్తుకోలేము గదా! లలితతండ్రి ఐశ్వర్యవంతుడు గనుక పెద్దసంబంధం వచ్చింది. నాచిట్టితల్లి లలితకంటె అన్నిటా ఉత్తమురాలైనప్పటికీ పెద్దపెద్దకట్నాలు నేనెక్కడ తేగలను! ఈకాలపు కుఱ్ఱవాళ్లకు డబ్బురంధేకాని, పిల్ల తెలివితేటలు అందచందాలు అక్కఱలేదు.

శ్రీని—అమ్మాయీ! నీయభిప్రాయ మేమిటే?

మంగ—సరి బాగుంది. దాని అభిప్రాయం మట్టుకు ఇంకోవిధంగా ఎలా ఉంటుంది? జ్ఞానం వచ్చిన పిల్ల దానికి మాత్రం మనస్థితి గతులు తెలియవా? అయినా, మనం నిశ్చయించిన సంబంధం చేసుకుంటుందిగాని దాన్ని అడిగితే యేమిచెప్తుతుందీ? మీరు పెండ్లిప్రయత్నాలు వేగిరం చెయ్యండి. సీతా! వంటింట్లోకి వెళ్లి నువ్వు పాలుకాచమ్మా! (సీత నిశ్శబ్దంగా, సవిచారంగా లోనికి వెళ్లును) (మంగళ భర్తతో) ఈకడసారిపిల్లభారం కూడా నాకీ శుద్ధదశమితో తీరిపోతుంది. నాకింక నిశ్చింత. ఈపాడిపశువులూ, యీపిడకలుచెయ్యడం, యీచాకిరీ యీ బాధంతా నేనింకపడలేను.

శ్రీని—ఏమిటే! పాలు, పచ్చళ్లు, పిడకలవ్యాపారం చప్పగా మానుకుంటావా?

**మంగ**—చప్పగా మానుకోకపోయినా చాలమట్టుకు తగ్గిస్తాను. కొంచెం బరువు దించుకుంటే ఊపిరాడుతుంది. కాస్త కులాసాగా కాలక్షేపం చేస్తాను. కాపరానికి వచ్చింది మొదలు కాసేపు తీరికిగా కూర్చోడం, ఇష్టమొచ్చినంతసేపు స్వేచ్ఛగా నిద్రపోవడం ఎటువంటిదో యెఱుగను గదా. అమ్మయ్య! తీరికకు మొగమువాచిపోయితినట్లా!

**శ్రీని**—అట్లా దారికిరా, ఇక నేమి! నాకు మల్లే నీకు కూడా కాస్తనిద్ర, కొంచెం బద్ధకించడం కావాలన్న మాట. నీవేమో పింగళివారిపీక వనుకున్నా సుమా నేను!

**మంగ**—కూర్చుంటే జరగదు గనుక అవసరంకొద్దీ అట్లా కనుపిస్తాను గాని పింగళివారిపీకు లెవ్వరూ కారు. ఇక లేవండి. భోజనంవేళ మించింది. భోంచేసి రాజగోపాలముకు, రంగడికి, చుట్టాలకూ శుభలేఖలు వ్రాయాలి. సీతపెళ్లంటే వాళ్లకు ప్రాణాలు లేచి వస్తవి.

**శ్రీని**—ఊహూం.

**మంగ**—ఇక మీ ఆలోచనలు కట్టిపెట్టి లేవండి భోజనానికి.

(నిష్క్రమింతురు)

(తెర పడును)

---

## అంకము.

[పిమ్మట ఒకనెలకు శ్రీనివాసులు ఇంట్లో మధ్యాహ్నం రెండుగంటలవేళ. రంగము ఆచావడియే. శ్రీనివాసులు మంగళ కూర్చుండి ప్రవేశింతురు.]

**మంగ**—(లెక్కలపుస్తకాలు చూస్తూ తలయెత్తి) ఐదువందలు కట్నానికి, ఖర్చులు రెండువందలయ్యాభై, మొత్తం ఏడు వందలయ్యాభై అయినవి యీ పెళ్ళికి.

**శ్రీని**—పెండ్లికొడుక్కు ఆస్తీ, ఉద్యోగమూ లేవు. పైగా తలమునిగే ఋణాలు.

**మంగ**—తీరా పెళ్ళినాడు తెలిసింది అప్పులసంగతి. మనమిచ్చిన కట్నంతో ఋణాలు సర్దుకుంటాడు లెండి.

**శ్రీని**—ఎక్కడ సర్దుకోవడం! కొన్ని తీర్చాడు. ఇంకా కొన్ని ఉన్నవి.

**మంగ**—పోనిద్దురూ! పెధవ అప్పులకు ఆందోళన యేమిటి? డబ్బు వస్తూపోతూ వుంటుందిగాని ఎవరికీ శాశ్వతంగాదు కదా! ఎవరో కొద్దిమందితప్ప అప్పులులేనివారెవరు? వారుమట్టుకు ఎల్లకాలం అప్పులేకుండా వుంటారా?

**శ్రీని**—నిజమేకాని; బొత్తిగా సంపాదనలేనివాళ్లుంటూ వుండరు.

**మంగ**—ప్రస్తుతమీ ఉబ్బసంవల్ల అల్లుడు కష్టపుపని చేయలేకుండా ఉన్నాడుగాని,—

**శ్రీని**—కష్టపుపనా? అసలొకటి పదిహేను నిమిషాలుపాటు తిన్నగా కూర్చో గలిగితేనా? కాసేపు నుంచున్నా

కూస్తున్నా దగ్గుతెర, పిల్లికూతలునాయె. చివరకు బంకలు సాగుతూ పారబెట్టి చెక్కితేగాని వదలిపోని కళ్లె యింతపడు తుంది. ఈ మాయదారిరోగం వాడికి కట్టి పిల్లగొంతు కోసి నందుకు నాకడుపు తరుక్కుపోతూవుంది. నీకెట్లా దొరికిందో ఈసుబంధం!

**మంగ**—రోగమింత ముదిరిందని నాకు మాత్ర మేమి తెలుసును? ఏదో కానేపు మాట్లాడివచ్చినదానికి ఋణాలసంగతి మాత్ర మెట్లా తెలుస్తుంది? ఆస్తిలేకపోయినా పిల్లడు మంచివాడు గదా అనుకున్నానుగాని ఋణాలున్నవని తెలియలేదు.

**శ్రీని**—ఆస్తిలేనివాడికి అప్పులుంటవని వేఱే ఒకరుచెప్పాలా? ఖాళీప్రదేశాన్ని ఆక్రమించడం ప్రకృతిలక్షణం. ఆస్తులు కాళీచేసినచోట నప్పు లాక్రమించుకొంటాయి. వేడిగాలి పైకిలేచిపోతే ఆచోటున చల్లగాలి ప్రవేశిస్తుందని స్కూళ్లల్లో చెపుతారు వినలేదూ! ఇంతమాత్రం ఆలోచిం చకపోతివి.

**మంగ**—కార్యం మించితేగాని జ్ఞానం కలగదు. పెళ్లికిముందే వెంగుకు ఆస్తిలేదని ఎఱిగివున్న మీరైనా ఒక్కమాట మాత్రం అనకపోతిరి, అప్పులుంటాయని. అప్పులున్నమాట నిశ్చయమైనతరువాత ఇప్పుడు ఖాళీలు, ఆక్రమించడాలు అని ధర్మపన్నాలుచెప్పి ఏమిప్రయోజనం?

**శ్రీని**—పిచ్చిదానా! నేను నీమీద నేరమెంచుతున్నా నను కోకు. ఇంతగా ముంచుకువచ్చిన వ్యాధి కూడా తెలుసుకో లేకపోతివని వగస్తున్నాను.

**మంగ**—నేనైనా ఒక్కసారే గాదుటండీ చూచినది! నేను

చూచినప్పుడు దగ్గుతెర రాకపోయె; అండాళ్లమ్మ "వద్దో కొంచెం ఉబ్బసమనీ, నిమ్మళించుతున్నదనీ నమ్మించెను.

శ్రీని—అండాళ్లమ్మ నమ్మించక ఏంచేస్తుందనుకున్నావు? 'ఇదుగో! వలపన్నుతున్నాను. జాగ్రతసుమా' అని యీగతో చెప్పుతుందా సాలీడు! తెలివిగలదాన్ని, జాగ్రత్తగలదాన్ని అంటావు మళ్లా, యీమాత్రం తెలుసుకోలేకపోతివి పన్నాగం. నీ తెలివంతా పరోపదేశానికేగాని స్వంతానికి పనికి రాదని స్పష్టమయింది.

మంగ—మగవారూ, తెలివిగలవారూ, మీరువెళ్లి చూచి రాకపోయినారా? నేను వద్దన్నానా! మరే, అల్లుణ్ణి స్వయంగా చూచుకోవాలన్నసంగతి మీకు పట్టితేగా!

శ్రీని—చూచిరావడానికి నాకెక్కడ తీరిందే!

మంగ—తీరదు, తీరదు, ఎందుకు తీరుతుంది? రత్నయ్యగారి వ్యవహారాలకు తీరుతుంది. నలపుకత్తెలను చక్కబెట్టడానికి తీరుతుంది. కన్నకూతురుకు కాబోయే వరుణ్ణి ఒక్కసారి చూచిరావడానికి తీరదు.

శ్రీని—పోనీ, చూచిరమ్మని నీవు చెప్పనైన చెప్పావా? ఎలాగో తీరిక చేసుకునేవాణ్ణి.

మంగ—చూచిరమ్మని నేను చెప్పాలా, పరాయివాడికిచెప్పినట్టు! కన్నతండ్రికామాత్రం పట్టనక్కరలేదూ? బిడ్డల్ని కనడం మట్టుకే పూచీ అనుకుంటారు. అసలు పూచీ కనడంతోటే ప్రారంభిస్తుందని ఎఱుగరు.

శ్రీని—నీ తెలివి నమ్మి బాధ్యతంతా నీకే వదలిపెట్టాను.

**మంగ**—నా తెలివి ఇలా తెల్లవారింది, ఇకనేమి? ఒక్కసారి పిల్లణ్ణిచూడడం మీకు ధర్మమని తోచకపోయెను.

**శ్రీని**—బుద్ధిహీనుణ్ణి. ఇప్పుడు నస్తాయిస్తున్నాను. ఎన్నడూ పొరబడ్డమనిషివు కావు గదా అని నీమీద అతి విశ్వాసం పెట్టుకొని కొంపతీసుకున్నాను.

**మంగ**—పొరబాటు ఎవరికైనా వస్తుంది ఎప్పుడో ఒకప్పుడు. సీతమ్మతల్లికి మొగుణ్ణి కుదర్చడంలో నాకూ పొరబాటువచ్చి పడ్డది. పూర్వజన్మాలలో ఎన్నిపాపాలు చేసుకున్నానో, చేతులారా కూతురుగొంతుక కోసాను. వాళ్లు నన్ను నమ్మించి గోతిలో తోసారు.

**శ్రీని**—విన్నావు కాదూ!

'వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమానభంగమందు
చకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చు' అన్నధర్మం.

**మంగ**—ఈ ధర్మాలు నాకు చెప్పకండి, వొళ్లు మండుకు వస్తుంది.

**శ్రీని**—ప్రపంచంలో జరుగుతున్న సంగతి చెప్పాను. అంతే.

**మంగ**—రోగ మింత ముదిరినమాటైనా కాస్త సూచించింది కాదు అండాళ్లమ్మ.

**శ్రీని**—అండాళ్లమ్మ నీకు మల్లే వెఱ్ఱిది కాదు. ఆమాటచెప్పితే నువ్వు పిల్లనివ్వకనే పోదువు. నిజం చెప్పి ఈ సంబంధం చెడ గొట్టుకొంటే అండాళ్లమ్మకు కొనాపెట్టనిదాసీది, ఆరోగిష్టి వాడికి పరిచారిక ఎట్లావస్తుంది? అప్పులెట్లాతీరుతవి? పాత

అప్పు తీర్చకపోతే క్రొత్త అప్పు లెట్లాపుట్టుతవి? వెంగుకు పథ్యపానా లెట్లా జరుగుతవి?

**మంగ**—అస లతనికి తిన్నగా వైద్యం జరుగుతూ వున్నదా?

**శ్రీని**—పేదవాళ్లకు వైద్య మెట్లాజరుగుతుందనుకున్నావు? ఊరికే వైద్యం చేయడానికి వైద్యులేమి భూతదయాపరులు కారు. అందులో సమర్థులైనవైద్యు లసలే కారు. మొన్న డాక్టరు సుబ్బన్న చూచావు కాదూ? ఆర్జి రాలనుకొని టించరైడనువేసి విశాలాక్షికళ్లుపోగొట్టినాడు. అటువంటి డాక్టర్లయితే భూభారం తగ్గించడానికి మందు లూరికే ఇస్తారేమో కాని సమర్థులైనవాళ్లు ఒక్కనాటికి ఉచితవైద్యం చెయ్యరు.

**మంగ**—మఱి మంచివైద్యుణ్ణి చూడకపోతే ఆవుబ్బున మెట్లా తగ్గుతుంది?

**శ్రీని**—మంచివైద్యుడై తేమాత్రం తగ్గించగలడా అనిసందేహం.

**మంగ**—అయ్యో: నాబిడ్డా! ఎంత పాపిష్ఠిదాన్నే నేను. నేను మంచి చేయబోతే దైవము ఓర్వలేకపోయెనే తల్లీ! (అని యేడ్చును)

**శ్రీని**—ఎందుకేడుస్తావు? ఊరుకో, గతించినదానికి వగచి యేమి ప్రయోజనం? ఎంత యేడ్చినా సీత వెంగుకు పెళ్లాము కాకుండా తప్పించగలవా ఇప్పుడు? కానున్నది కాకమానదు. ఊరుకో సీతవచ్చే వేళయింది. దానియెదుట కంట నీరుబెట్టితివా, దానిగుండె పగిలిపోతుంది. ఆజమాఖర్చు లెక్కలు చూచి నిలువ తేల్చుదాము పద. (నిష్క్రమింతురు)

తెర పడును.

# అంకము. 3.

---

[పిమ్మట నొకనెలకు. ఉదయం పదిగంటలవేళ. శివపురములో రెండిండ్లమధ్య మురికిగానున్న ఒక పూరిల్లు. ఇంటి పైరెల్లు పాతపడి కుళ్లియున్నది. ఇంటిముందు వీధిలోకి ఒక వసారా. దానివెనుక రెండుగదులు, ఒక చావడి, వంటగదిన్నీ. చావడిలో వెలుతురు, గాలి లేదు. నేల ఎగుడుదిగుడుగానుండి కసవుతో నిండియున్నది. నేలపై ప్రక్కమీద నలుబదియేండ్ల వెంగు క్షయగ్రస్తుడై పడియుండెను. తల నరసియున్నది. అప్పుడే దగ్గుతెర వచ్చి తగ్గినది. 'ఆయాసపడుచు రొప్పుచున్నాడు. మొగమున విరక్తిభావము కన్పించుచున్నది. తల్లియైన అండాళ్లమ్మ అరవైరెండేండ్ల బలహీనురాలు ప్రక్కపై కూర్చున్నది.]

**వెంగు**—అమ్మా! జబ్బు నెమ్మదించేదాకా ఆగమంటే వినక అన్యాయంగా సీతను నాకు ముడిపెట్టావు. డాక్టరు ఇక అట్టే రోజులు బ్రదుకనంటున్నాడు.

**అండా**—డాక్టరామాట ఎప్పుడన్నాడు? నీకెవరు చెప్పారు?

**వెంగు**—నిన్న ఆయనముఖమే చెప్పింది ఆమాట. అదిగాక నీవు అవతలగదిలోకి తీసికెళ్లి ఆయనను నెమ్మదిగా అడుగుతూ వుంటే నేను లేచివచ్చి తలుపుదగ్గర పొంచుండి ఆయన చెప్పినమాటలు విని మళ్లా వచ్చి పడుకున్నాను.

**అండా**—ఎందుకట్లా చేసావు నాయనా!

**వెంగు**—ఆయన నోటితో ఏమి చెప్పుతాడోనని నిజంతెలుసుకునేదాకా ఆగలేకపోయినాను.

**అండా**—తెలుసుకున్నందువల్ల నీకేమి ప్రయోజనం కలిగింది బాబూ!

**వెంగు**—సీతను పెండ్లిచేసుకొని అన్యాయంగా దానిగొంతు కోశానని తెలుసుకున్నాను. నాకిష్టం లేకుండా యీపెండ్లి ఎందుకు చేసావు అమ్మా నీవు?

**అండా**—మనవంశానికల్లా నిలిచివున్న అంకురం నీవొక్కడవు పెండ్లిచేసుకొని సంతానం కనకపోతే నీతోనే అంతరించి పోదటరా నాయనా! నేను పెద్దదాన్ని అయిపోయినాను. ఇన్నాళ్లవలె నీకు వంటచేసిపెట్టలేను. ఉపచారం చెయ్య లేను. కనుక గుణవంతురాలు, తెలివిమంతురాలు అయిన కోడలు వస్తుందని ఆశపడ్డాను. అదిగాక, సీజబ్బు కుదరక పోతుందనే అపనమ్మకం నాకు నాడు నేడూ కూడా లేదు. డాక్టర్లమాటకేమి, వారూ పొరపడుతారు. అయితే, నేనొకమాట అడుగుతాను చెప్పు. నీకు సీతనుగురించేకాని, అయ్యో అమ్మ పెద్దదయింది గదా! ఈవృద్ధాప్యంలో దాని గతి యేమౌతుందో అనేవిచారం లేదూ! నీకు.

**వెంగు**—లేకేమి కాని, సీత చిన్నపిల్లగదా అమ్మా!

**అండా**—అయితే చిన్నవాళ్లు కష్టపడకూడదనీ, పెద్దముండలు కష్టాలుపడవలసిందేననా నీ ఊహ? పిచ్చితండ్రీ! కన్నుకాలు దృఢంగావుండి ఇంత తిని తిరిగే చిన్నవాళ్లకొఱ కెందుకు విచారపడాలి చెప్పు? ఈపెద్దతనంలో సీత నాకింత చేయూత కావడం తప్పా?

**వెంగు**—డాక్టర్లమాటలే నిజమైతే సీత నీదగ్గర ఎందుకుంటుందే అమ్మా!

**అండా**—ఎక్కడుంటుంది మఱి ?

**వెంగు**—దానిపుట్టినింట నుంటుంది. లేదా, అక్కగారియింట్లో నుంటుంది.

**అండా**—ఆసంగతి నీకెట్లా తెలుసు ?

**వెంగు**—అట్లా ఊహిస్తున్నాను.

**అండా**—ఇకనేమి ? డాక్టర్లకీడుమాట నిజమైనప్పటికీ నేను దిక్కుమాలినదాన నవుతాగాని సీత సుఖమే పడుతుంది. దానికోఱకిక విచారించకు. పడుకో.

(వంటయింటిలోనికి వెళ్లును)

**వెంగు**—(తనలో) మా అమ్మ నామీద అపేక్షకొద్దీ సీతను కష్టాలపాలుజేసింది. నామూలాన యీపాప మొడిగట్టింది. నేనూ, నా ఆలోచన మంటగలిపి, ఆమెహితోక్తులకు లోగి పోయి, పిఱికిపందనై ఈపెళ్లికి సమ్మతించాను. మా అమ్మ అనునయానికి నాస్వార్థచింత కూడా తోడయింది. సీతను చూచిందిమొదలు, దాన్ని పెండ్లిచేసుకోవాలనే కోరిక నిలుపలేక, ఈరోగం కుదురక పోతుందా అనే భ్రాంతిలో పడ్డాను. మందభాగ్యుణ్ణి పాపకర్ముడ నైపోయినాను (వెక్కి వెక్కి యేడ్చును. ఏడ్చుచే దగ్గుతెర వస్తుంది. పిమ్మట యింతో కళ్లె పడి, చాలివచ్చి, నిట్టూరుస్తూ ప్రక్కమీద బడి కొట్టు కుంటూ ఉంటాడు)

(విశ్వనాథం అనే స్కూలు మాస్టరు 33 ఏండ్ల దృఢ కాయుడు ప్రవేశించును)

**విశ్వ**—ఏమి వెంగూ! నానాటికి తీసి కట్టవుతున్నావు.

**వెంగు**—ఏమి చేయను ? ఆయుర్వేద, యూనానీ, ఆలోపతి, సిద్ధ, హోమోపతీ అన్ని మందులు అయినవి. దేనివల్ల రహితమయ్యేటట్టు లేదు. ప్రతిమందూ కొంచెం గుణమిచ్చినట్లుండడం, మళ్లా యథాస్థితికి రావడం (మరల దగ్గును).

**విశ్వ**—ఆయాసపడకు, దగ్గు వస్తుంది. నాల్గునెలలపాటు మదనపల్లి వెళ్లివుంటే తగ్గుతుందని నా ఊహ.

**వెంగు**—ఏమో. నాకేమీ తోచడం లేదు. మదనపల్లిమాట ఎంత నిజమో పరీక్షించడానికి నాకు డబ్బులేదు. అక్కడవున్నాళ్లో కులాసాగావుండి,ఇంటికి రాగానే తిరగబెట్టుతుందంటారు. డాక్టరు నిన్న చెప్పినదాన్ని బట్టి చూస్తే ఇక ఆట్టే రోజులు జీవించేటట్లు కనుపించదు. చచ్చినచావు బ్రదికిన బ్రదుకు కాకుండా ఇలా పడివుండేకంటె నాకు చావే మేలని పిస్తూవుంది.

**విశ్వ**—అలా ఎందుకనుకుంటావు, నిక్షేపంలాగ నిన్నగాక మొన్న పెళ్లిచేసుకున్నవాడవు, పదికాలాలపాటు బ్రతికి సుఖపడ గోరాలిగాని.

**వెంగు**—నిజమే. దానికొఱకు తప్పితే నాకు వేఱే బ్రదుకు అపేక్ష లేదు. నేను గుటుక్కుమంటే, ఆచిన్నదానిగతి యేమవుతుందో అని తలచుకుంటే కంపంపుట్టుతూవుంది. ఏమిచేయను? దానికర్మం, నాకర్మం ఇట్లా కాలింది (దగ్గుతెర వచ్చును.)

**విశ్వ**—నెమ్మదిగా పడుకో. ఆయాసపడకు. మళ్లా ఇంకోసారి కన

పడతాను. (వెలుపలికి వెళ్ళగానే, వెంగు ఇంటివైపు వచ్చు చున్న శ్రీనివాసులు ఎదురుపడి, నాలుగడుగు లావలకు తీసుకొని వెళ్లెను.)

శ్రీని—ఎట్లా వున్నాడు వెంగు ?

**విశ్వ**—స్థితి ఏమీ బాగుండ లేదు. రోజుల్లోకి వచ్చినట్లుతోస్తుంది. మాయదారిరోగంవాడికి, చూస్తూ చూస్తూ,పిల్లనెట్లా ఇచ్చావో నువ్వు.

శ్రీని—తీరా, పెండ్లి రేపన్నదాకా వ్యాధి ఇంత ఉదృతంలో వున్నసంగతి తెలిసింది కాదు. అప్పటి కప్పుడే కార్యం మించి పోయింది. అప్పుడేమిచేయను ?

**విశ్వ**—కార్యం మించడమేమిటి! ఇటువంటి పెళ్లి ఆపితీరవలసిందే కాని.

శ్రీని—నిజమే కాని, లోకులేమంటారు ?

**విశ్వ**—పిల్లదాని బ్రతుకు ఏట గలిసి పోతూవుంటే లోకులతో ఏమిపని నీకు ?

శ్రీని—బహుజనక్షేమంకోసం ఒక్కళ్లను బలియివ్వడం ఆచారమయింది మనసంఘంలో, ఏమిచెయ్యను ?

**విశ్వ**—అవు గాక. ఇందులో బహుజనక్షేమం ఏమి వుంది ? సీత గొంతుకోస్తే సంఘానికేమి క్షేమం కలిగింది చెప్పూ! నిష్కారణంగా, దారుణకర్మ చేయడం తప్ప.

ని—ఇక నిప్పుడేమి చేయమంటావు నన్ను ? అదిచెప్పు.

**విశ్వ**—ఇప్పుడింకా చేసేదేమున్నది? చేతనైతే వెంగును మదనపల్లికి పంపిచూడు. వ్యాధి కుదురుతుందేమో.

**శ్రీని**—డబ్బెక్కడ తెచ్చేది? మాది పేదసంసారం, మాకంటె అన్యాయం వెంగుది. మదనపల్లివైద్యం మనకందుబాటులోది కాదు. దానిమాట చెప్పకు.

**విశ్వ**—అయితే ఈశ్వరధ్యానమే మార్గం. ఇదిగో! మీయాబిడ వస్తున్నదే!

(మంగళ వీధివెంట ప్రవేశించును)

**మంగ**—(భర్తతో) ఇవ్వాళ్ల ఎలావుంది వెంగుకు?

**శ్రీని**—నేనింకా చూడలేదు. ఏమీ బాగులేదని విశ్వనాథం చెప్పుతున్నాడు.

**మంగ**—అయ్యో! (విశ్వనాథముతో) మామూలు స్థితికంటె కూడా చెడినదా యేమండీ!

**విశ్వ**—అవును. చెడింది.

**మంగ**—అయ్యో! (కంట నీరుపెట్టుతూ) ఏమిచేతును నేను?

**విశ్వ**—ఈశ్వరధ్యానం చెయ్యండి.

**మంగ**—నిజం. సీతగ్రహగతులు తిన్నగావుంటే శుభమే కలుగుతుంది.

**విశ్వ**—(తనలో) గ్రహాలమీద ఏమి పెట్టినమ్మకం వీళ్లకు! వరుణ్ణికుదర్చడంలో కాసంతజాగ్రత్త ఉన్నట్టయితే ఈగ్రహబాధా, ఈదుఃఖభారము లేకపోయేది గదా (ప్రకాశము) అవును.

**మంగ**—(భర్తతో) వెంగు నొకసారి చూచి వద్దాము రండి.

**విశ్వ**—నాకు బడివేళయింది. వస్తాను (ఇంటికి వెళ్లిపోవును) (శ్రీనివాసులు, మంగళయు వెంగుఇంటిలో ప్రవేశించగా, వెంగు దగ్గుతూ, ఆయాసపడుతూవుంటే శ్రీనివాసులు ఆతని తలపట్టుకొనును. ఇంతలో అండాళ్లమ్మ గిన్నెలో జావపట్టుకొని ప్రవేశించును.)

**అండా**—(మంగళా శ్రీనివాసులతో) రండి, రండి! ఎంతసే పయింది వచ్చి?

**మంగ**—ఇప్పుడే వస్తున్నాము.

**అండా**—నేను వంటయింట్లో జావకాస్తూ వుండడంవల్ల చూడ లేదు మీరు రావడం (నొచ్చుకొనును.)

**మంగ**—ఫరవాలేదు. మీరు నొచ్చుకోకండి. ఇప్పుడు మరియ్యా దలవిచార మెవరికి? వెంగు జబ్బునుగూర్చి విచారమేకాని.

**అండా**—ఏమి చేయనమ్మా! నిర్భాగ్యురాల్ని (ఏడ్చును) చేతనైనమట్టుకు ఎన్నిమందులో ఇప్పించాను. బిడ్డ మింగిన మందులు తలుచుకొంటే ఆశ్చర్యం కలుగుతుంది. మందులు మార్చడమేకాని గుణంమార్పు కనబడదాయెను.

**మంగ**—రోజూకంటె కూడా స్థితి చెడ్డట్టు వుంది ఇవ్వాళ్ల!

**అండా**—అవునమ్మా! ఒకటిరెండుసార్లు సీతను చూడాలని కూడా అంటున్నాడు.

**మంగ**—దానికేమి? అలాగే చూడవచ్చు. త్రోవలో రాజేశ్వరమ్మగారింట్లో స్నేహితురాలితో మాట్లాడుతూ వుంటే నేను

ముందు వచ్చాను. వెళ్లి తీసుకువస్తాను. అదికూడా చూడాలనే అంటున్నది.

**అండా**—(కొంచెం తెలివితో) అలాగా!

**మంగ**—అవును. (వెలుపలికి వెళ్లును.)

**వెంగు**—(శ్రీనివాసులుతో) నన్నీస్థితిలో చూడవలసి వచ్చింది దానికి. (అని యేడ్చుచుండగా దగ్గుతెర వచ్చును)

**అండా**—పడుకో నాయనా! ఆయాసపడకు. ఏంచేస్తాము. మన కర్మ మిలా వుంది.

**వెంగు**—(దగ్గుతెర తగ్గిన పిమ్మట) ఇక నేను ఊరికే పడివుండలేను. ఎంతకాలం పడి వున్నా గుణం కనిపించదు. ఇలా బ్రదికి నన్నాళ్లూ ఊరికే పడి వుండడం కంటె చావు మేలు.

**అండా**—ఇది కొంచెం త్రాగు. (వెంగు రెండుగరిటెలు త్రాగే టప్పటికి దగ్గుతెర వచ్చి త్రాగింది కొంచెమూ వెళ్లిపోతుంది. చాలివచ్చి పండుకొనును. మంగళ సీతతో ప్రవేశించును. ఆడోకినపదార్థమూ, రోగిస్థితీ చూచి సీత అప్రయత్నంగా అసహ్యభావం ప్రకటించును.)

**మంగ**—(శ్రీనివాసులుతో) ఏమిటి? స్థితి ఇందాకటికంటె కూడా చెడినట్టులుందే!

**వెంగు**—(సీతను చూచి, ఇంచుక తెలివి వచ్చి, అండాళ్లమ్మతో) అమ్మా! ఇక్కడ బాగుచేసేదాకా, కోడల్ని లోపలికి తీసి కెళ్లవే, ఇదంతా అసహ్యంగా వుంటుంది దానికి. అయ్యో! నాకీదిక్కుమాలిన వ్యాధిచెర ఒక్కగంటయినా విడువదేమి చేతును? (మరల దగ్గుతెర వచ్చును.)

**మంగ**—(తనలో) సీతనిచట ఆక్టేసేపుంచితే దానికి భర్తమీాద తీరని అసహ్యం పుట్టుతుంది. ఇక తీసికెళ్లడం మంచిది (ప్రకాశం) కదలకుండా విశ్రాంతిగా పండుకోనివ్వండి. మేము వెళ్లివస్తాము. కొంచెం సుగుణమిచ్చిన తరువాత ఇంకో సారి సీతను తీసుకవస్తాను. సీతా! నీభర్తకు మ్రొక్కు తల్లీ! (సీత మ్రొక్కును.)

**వెంగు**—(సీతశిరముపై చేయి చాపి) సౌభాగ్యవతివికా! నీవు. (దీవించుచుండగా అండాళ్లమ్మ చేతిలోవున్న కంచుపళ్లెం క్రిందబడి చప్పుడవుతుంది. ఆయపశకునానికి అందరు ఉలికి పడి చూతురు. సీత భయపడి కంట నీరు పెట్టుకొనును.)

**వెంగు**—ఎందుకేడుస్తావు. ఏడవకు. భగవంతుడికి నీయం దను గ్రహముంటే వ్యాధి నెమ్మదించి నేను జీవిస్తాను. (అతనిపై ఒకబల్లి పడి పరుగెత్తి పోవును. మళ్లా ఈ అపశకునానికి అం దఱూ తెల్లబోవుదురు. మంగళ, శ్రీనివాసులు సీతను తీసుకు వెళ్లిపోతారు. వెంగు మరల పండుకొనును. అండాళ్లమ్మ స్థలము బాగుచేయుచుండును.)

(తెర పడును).

---

## అంకము. 4.

---

[తరువాత 15 రోజులకు కృష్ణగిరిలో శ్రీనివాసులు ఇంట్లో. శ్రీనివాసులు సవిచారంగా, నీరసంగా వీధిగుమ్మముగుండా ఇంట్లో ప్రవేశించును. క్రింది చావట్లోకి వెళ్లకుండా మేడమీదికే వెళ్లి, డస్సినవానివలె, విరక్తునివలె పండుకొనును. ఆస్థితిలో పైకివెళ్లిన భర్తను చూచి మంగళకూడా తొందరగా మీదికి వెళ్లును.]

**మంగ**—ఏమిటి, ఆలా ఉన్నారు? వంట్లో బాగుండ లేదా?

**శ్రీని**—మరేమీ లేదు. నాకు గుండెదిటవు చెడింది.

**మంగ**—ఎన్నడు లేని యీ అధైర్య మెందువల్ల? డిక్రీ బాకీలకు వారంట్లు వచ్చినప్పుడుకూడా ధైర్యం చెడని మీకు నేడీ నిస్పృహ యేమిటి?

**శ్రీని**—అప్పటికింకా ఆశ పూర్తిగా భగ్నంకాలేదు.

**మంగ**—ఏమిటీ విపరీతపుమాటలు! మీమనసులో విచారమేమిటో స్పష్టంగా చెప్పుదురూ!

**శ్రీని**—ఇంకా ఏమి చెప్పమంటావు? నేను నేటితో పరమదరిద్రుడనై పోయినాను. నేనుకావడమే కాకుండా, నిన్ను, పిల్లలను, తలదాచుకొనే చోటులేని నిర్భాగ్యులను, అనాథులను చేశాను.

**మంగ**—తలదాచుకొనేచోటు లేకపోవడమేమిటి? ఏభాగ్య భోగ్యాలు లేకపోయినా యీయిల్లు ఎక్కడికి పోతుంది?

శ్రీని—ఇల్లు కూడా దాటిపోయింది మనచేతుల్లోనుంచి.

మంగ—ఆఁ! ఏమిటీ?

శ్రీని—ఈ యిల్లు, ఆస్థలము కూడా విక్రయించేశాను. వాళ్లు వస్తున్నారు స్వాధీనం చేసుకోడానికి.

మంగ—నాకేమీ అర్థం కావడంలేదు. ఎవరికి విక్రయించారు? ఎందుకు విక్రయించారు?

శ్రీని—రత్తయ్యగారికి.

మంగ—ఎంత ఖరీదుకు అమ్మారు?

శ్రీని—ఖరీదు లేదు, గడ్డలు లేదు.

మంగ—ఖరీదు లేదూ! మీకేమైన మతి పోయిందా!

శ్రీని—పోయినా బాగుండును. మీరు, నేను కూడా బ్రతికి పోదుము.

మంగ—అబ్బా! ఏమి జరిగిందో తిన్నగా చెప్పుదురూ, వేపుకు తినక. వాళ్లదగ్గర ఏమైన అప్పుచేసారా?

శ్రీని—లేదు. వాళ్లను మోసగించి, తప్పులెక్కలురాసి, వాళ్ల సొమ్ము తినివేశాను. రత్తయ్యకొడుకు మంచిలెక్కవాడు. పట్నంలో పరీక్షలిచ్చి వచ్చాడు. అతఁడు లెక్కలు పరిశీలించి మోసం పట్టుకున్నాడు. అంతా బైటబడింది నిన్న. మొత్తమంతా రెండువేలు నేను కాజేసినట్లు లెక్కతేలింది. వెంటనే యీ యిల్లు ఆ స్థలం వ్రాసి యిమ్మని నిర్బంధించారు. వ్రాయకపోతే కేసుపెట్టుతామన్నారు. విధిలేక క్రయం వ్రాసి నిన్ననే రిజిస్టరుచేయించి యిచ్చేదాకా విడువలేదు.

(మంగళ నిశ్చేష్టయై, గ్రుడ్లు వప్పగించిచూచుచు కూర్చున్నది.)

శ్రీని—నిర్భాగ్యుణ్ణి నాకు చావైనా వచ్చింది కాదు.

మంగ—ఈకష్టములన్నీ చూడమని దైవము నాకీ మొండి ఆయువు పోసాడు. ఇంతకు, ఆసొమ్మంతా ఏయేట గలిపారు?

శ్రీని—నేను నోటితో చెప్పడమెందుకూ? నీవిదివరకే అంటూ వస్తివిగా.

మంగ—అయ్యో! దైవమా! నేను మాటవరసకన్నానుగాని ఇంతపని చేస్తారనుకున్నానా? ఇన్నియేళ్లువచ్చి ఆపాడు ముండల కింతసొమ్ము ధారపోస్తారనుకున్నానా?

శ్రీని—ఏమిచేయను, నాకర్మం. ఆమాయముండలకు బలియై పోయినాను.

మంగ—అయ్యో, నాయిల్లుగూడా వాళ్లకు హోమంచేయాలా? నాబిడ్డలు, నేను ఇక యేచెట్టుకింద తలదాచుకొందుము? నాబిడ్డల్లారా! బజారుముండలకోసం మీనాయన కటికవాడై మిమ్ములను బజారుపాలుచేసెగదర్రా!

శ్రీని—పాపిష్ఠివాణ్ణి నేను చచ్చైనా పోతినికాను మీరు సుఖపడేవాళ్లు. ఇట్లా సర్వనాశనమౌతుందని నిన్నటివఱకు తెలిసిందికాదు. ఈదుర్వృత్తిలో దిగకుండానే ఉండాలికాని దిగిన తఱవాత వెనక్కిరావడం ఎవరిశక్యము. ప్రవాహంలోబడి కొట్టుకుపోయే నాతోగూడ పెళ్లాంబిడ్డలను గంగపాలుచేసాను.

మంగ—గంగపాలుచేయక మీరెప్పుడు మమ్మును గట్టెక్కిస్తారనుకున్నాను! ఎంతసేపూ మీవంధే మీకుగాని పెళ్లాం

బిడ్డ లేమైపోతారో అనే ఆలోచన మీకెన్నడైనా పట్టిందా! ఇంటికి యెన్నడు ఒక్కచిల్లిగవ్వైనా తెచ్చినపాపాన పోక పోయినా, నాకష్టార్జితంతో కొనుక్కున్నయిల్లు మంటగలిపారు. ఏళ్లకొలది పడ్డ నాకష్టమంతా క్షణంలో బూడిదపాలు చేసి, నా ఆశలన్నీ మట్టిపాలుచేసి దిక్కుమాలిన పక్షిని చేశారు. ఇక నే నీ అనాథబ్రతుకు బ్రతికేకంటె నూతిలోపడి యీ ఆరడిబ్రతుక్కి స్వస్తి చెప్పితే మీకూ బరువు తీరుతుంది. కత్తయ్యకొడుకు తెలివిమంతుడు ఈయింటితోపాటు నాశవాన్నికూడా కొనుక్కు సంపాదించినట్టవుతుంది.

శ్రీని—ఎందుకట్లా ఆవేశపడి మనస్సు చెడగొట్టుకొంటావు. ఈశ్వరుణ్ణి నమ్ముకొంటే ఏదోదారి కనబడకపోదు.

మంగ—తనబాగు తానెఱగనివాణ్ణి యీశ్వరుడుమాత్ర మెట్లా బాగుచేస్తాడు? కత్తయ్యగారు అద్దె అడగకుండా మన ఘటాలైనా యీయింట్లో వెళ్లిపోనిస్తాడా?

శ్రీని—నేను ఈమాటే చెప్పి ప్రాధేయపడ్డాను. మనస్సు కరిగిందికాదు. ఇల్లు వెంటనే ఖాళీచేయవలసిందని పట్టు పట్టారు. ఈపాటికి వారు వస్తూనే వుండాలి. (తలుపుకొట్టిన చప్పుడు) అదుగో, వారే! వెళ్లు, తలుపు తియ్యి. నువ్వ కూడా అడిగి చూడు, మనసు కరుగుతుందేమో (మంగళ క్రిందికి వెళ్లి తలుపు తీయగా విశ్వనాథం ప్రవేశించును.)

విశ్వ—(కన్నీటితో) శ్రీనివాసులింట్లోవున్నాడా? ఈదుర్వార్త నానోట చెప్పవలసి వచ్చింది. వెంగు కాలంచేసాడు.

**మంగ**—అయ్యో! (మూర్ఛపోగా, విశ్వనాథం శ్రీనివాసు లును కేకవేయగా ఆతడు వచ్చి మంగళకు శైత్యోపచార ములు చేయును)

**శ్రీని**—విశ్వనాథం! ఏమిటిది?

**విశ్వ**—వెంగు కాలంచేసాడు. ఈప్రొద్దుట విపరీతంగా దగ్గుతెర వచ్చి, ఊపిరాడక కొంచెంసేపు బాధపడి ప్రాణం విడిచాడు. ఈమాట చెప్పిపోదామని బైసికిలుమీద వచ్చాను.

**శ్రీని**—కొంప పోయింది. వెంగు పోయినాడు. సీత ముండ మోసింది. ఇంకేమున్నది? (ఈసందడి విని సీత ప్రవేశించును)

**సీత**—ఏమిటి నాన్నా!

**మంగ**—(కనులువిప్పి సీతను చూచి కన్నీటితో వెళ్లి కౌగలించు కొని) సీతా! సీతా! నీకెంత అవస్థ వచ్చిందే నాతల్లీ! ముక్కు పచ్చలారని నాబిడ్డను మూడేళ్లప్పుడే ముండ-(అర్థోక్తిలో సీత నేలపై కుప్పగూలును. ఆయవస్థ చూడలేక విశ్వనాథము బైసికిలెక్కి వెళ్లిపోవును.)

**మంగ**—నిక్షేపంవంటికొంపకు ఎన్నివడిచుట్లు తెచ్చిపెట్టావు దైవమా! ఈపాడుకొంప ఒక్కసారిగా మాతలలపై కూలి మమ్ముని భూదేవిగర్భంలో పూడ్చిపెట్టరాదూ (చన్నీరు తెచ్చి సీతపై చిలుకరింపగా, సీత తేరుకొంటుంది).

**సీత**—(ఏడ్చుచు) అయ్యో! నాదైవమా! నన్ను సౌభాగ్యవతివి కమ్మని దీవించి పదిహేనురోజులైనా కాలేదు. ఇంతలోనే నన్ను మృత్యువు తనపొట్ట బెట్టుకుందా?

గేయము.

ఆరెనా నాదివ్వె అర్థరాత్రి వేళ ! పాతెనా నాసుఖము పట్టపగలే !
ఈ నవవసంతమున, ఈ శరత్కాలముదుల, ఈముదుక చలివేళ
పడగూల్చుగాక నాయెడదపువు. నానంద
మిడనేర్చునే దైవమా ! ఎన్నటికి నిడనేర్చునే దైవమా ?

**శ్రీని**—(మంగళతో సగద్గదముగా) ఈసంబంధము వద్దు మొఱ్ఱో అని నేనెంత మొత్తుకొన్నా వినకపోతివి గదా !

**మంగ**—(ఏడ్చుచు) అయ్యో ! నన్ను కొట్టి, కోసి వినిపించక పోయినారా ! నిర్భాగ్యురాల్ని ! బిడ్డగొంతు చేతులారా కోసివేశాను.

**శ్రీని**—పరమఘాతుకుణ్ణి నేను బిడ్డలకు నిలువ నీడలేకుండా చేసాను. (అంతట కొందఱు మనుష్యులతో రత్తయ్య ప్రవేశించును. రత్తయ్య అరవైయేండ్లవాడు. ముఖమున కాఠిన్యము, జిత్తులమారితనము కన్పించుచుండును. గుమ్మములోకి వచ్చి ఇంటిలోనివారి స్థితిచూచి కళవళపడుచు గుమ్మములోనే నిల్చును.)

**రత్న**—శ్రీనివాసులూ ! మేము ఇల్లు స్వాధీనపరచుకోవడానికి వచ్చాము. ఇదంతా యేమిటి గొడవ ?

**మంగ**—(మంగళ ఆతని సమీపించి చుఱచుఱ చూస్తూ) ఇదంతా యేమిటో నేనుచెప్తాను విను, ఆశాపాతకుడా ! నాఅల్లుడు వెంగు ఈఉదయం కాలంచేసాడు. నామనుమరాలు సీత పెండ్లయి పదినెలలైనా ముగియకుండా, పదిహేనేళ్ల బాలవిధవయైనది.

రత్న—ఎంతకష్ట మెంతకష్టం!

మంగ—ఇంకావుంది, విను. నాభర్త కటికదుర్మార్గుడై నీచానికి పాల్పడి, నీసొమ్ము హరించి ముండలకు ధారపోసాడు. ఆ కథంతా ఎఱిగివున్న నువ్వు, నేను పిడకలమ్మీ, పాలమ్మీ, పచ్చడులమ్మీ సంపాదించిన కష్టార్జితంతో కొనుక్కున్న యీయిల్లు క్రయంవ్రాయించుకున్నావు సిగ్గులేక. ఇది చాలక ఆస్థలం కూడా వ్రాయించుకున్నావు. పవలనక, రాత్రనక, చిన్నతనంనుంచి, నీకు నానాచాకిరిచేసి, శరీరం నీకే అమ్ము కున్నవాణ్ణి, ఇవ్వాళ్ల నీకొడుకు పట్నంనుంచి పరీక్షలు పాసయి, దిగి, పుట్టెడు దుఃఖంలో వున్నవాణ్ణి పెళ్లాంబిడ్డ లతో ఇంటిబయటికి గెంటుతున్నాడు. సరా?

రత్న—అంత తొందరలేదు. పోనీ ఒక పక్షంరోజు లాగివస్తాము మళ్లా.

మంగ—మీారు పక్షంరోజు లాగి వచ్చినా ప్రయోజనంలేదు. నేనొక్కటే మాట చెప్పుతున్నాను. నే నీయిల్లువదలిపెట్టను.

రత్న—వదలిపెట్టకపోతే, వదిలేటట్టు చేస్తాము.

మంగ—నీతరంకాదు. నాస్త్రీధనంతో కొనుక్కొన్నయిల్లిది.

రత్న—దేనితో కొంటేనేమి? ఇల్లు నీభర్తపేరటనేవుంది.

మంగ—అది వట్టి బినామీా. పదిమంది కట్టిన యింట్లోవున్నావు. నిజం నువ్వుమాత్ర మెఱగవూ?

రత్న—కావచ్చును. కోర్టులో రుజువైనప్పటి మాటకదా.

**మంగ**—అదీ చూస్తాను. దీనికోసం నువ్వు మళ్లా ఖర్చుపెట్టి, ఎప్పటికో గెలుచుకొన్నప్పటి సంగతి కదా. మేము ఓడిపోతే భస్మమైపోతామంటావా! నిజమే. గెలిచి నువ్వుమాత్రం బాగుపడ్డావా కాకపోతే చూస్తాను.

**రత్న**—(కొంచెం మాలోచించి) ఇంతకు, నీవేమంటావో చెప్పు. సబబుగావుంటే ఆలోచిస్తాను.

**మంగ**—ముందు మాకొకపందరూపాయలు రొక్కమిచ్చి, ఈ ఇల్లు మాకు మూడేళ్లకద్దెకివ్వు. అద్దె ముట్టినట్టుగా ఖరారు నామా వ్రాసియివ్వు. అందుకుగాను నువ్వానివేశనస్థల మిప్పుడే స్వాధీనపరచుకో. ఈమూడేళ్లలోపలా నీకివ్వవలసిన రెండువేలు మేము తీర్చకపోతే, మూడేళ్లఅనంతరం ఈయిల్లు కూడా నేను విడుదలపత్రం వ్రాసియిచ్చి, నీస్వాధీనం చేస్తాను.

**రత్న**—నీషరతులలో సబబేమైనా వుందా?

**మంగ**—ఉంది. లేదు. నీకిష్టంకాకపోతే మానుకో! అంతేకాని నేనికమాట తిరగను. నేనేమీ సబబు తప్పి మాట్లాడలేదు. ఇంతకు తగ్గించడం నావల్లకాదు. పెద్దమనిషివి, ఒక చెంప నాకష్టాలు చూస్తూనే నువ్వు అలా అంటే నేను చెప్పవల సిందేముంటుంది? యోగ్యుడవై నా షరతులకు ఒప్పుకొంటావా, నాబిడ్డలు, నేను చిరకాలం నీపేరు చెప్పుకుంటాము. లేదా, కోర్టుకువెళ్లి వ్యాజ్యమాడి, నువ్వుగెలిచి, ఈయిల్లు స్వాధీనం చేసుకొన్నప్పటిసంగతి చూస్తాను.

**రత్న**—(ఒక్కక్షణ మాలోచించి) సరే, ఎందుకుగాని ఈపెద్ద

తనంలో నాకులాయిలాసాలూ, మిాశాపనార్థాలూనూ, నీయిష్టంచొప్పునే కానియ్య.

**మంగ**—శుభం, నాయనా! వెయ్యేళ్లు వర్ధిల్లు (అని చాలినచ్చి కూలబడును)

**రత్న**—(ఆశ్చర్యముతో) ఏమిటీచిత్రం! ఇందాకటినుంచి ఆడ పులికిమల్లే నన్నెదుర్కొన్నమనిషి, ఇంతలో గుడ్డలమూట వలె కూలబడ్డది!

**శ్రీని**—ఆడుదానికి బిడ్డలపై ప్రీతి అటువంటిది. నీవెప్పుడు కని కరం చూపావో అప్పుడు స్త్రీసహజమైన అబలత్వము వచ్చింది.

**రత్న**—పాపం! మిారు పడిచట్లు వచ్చిపడ్డవి. నేనింక వెళ్లి వస్తాను. దస్తు రేపు పంపుతాను.

**మంగ**—మావారికి పంపేయ సుమండీ! నాచేతి కిమ్మని చెప్పండి.

**రత్న**—అలాగే. (వెళ్లును)

**సీత**—అయ్యో! నాదైవమా! (ఏడ్చును.)

**మంగ**—లే అమ్మ! పైకి వెళ్లుదాము. కానేపు పండుకుందువు గాని. నాకు కడుపు చుమ్మలు చుట్టుతూవుంది. కాస్త నిదా నంగా ఆలోచించుకోవాలి. మన ప్రపంచమంతా శూన్యమై కూలిపోయింది. దానితోపాటు అణగారిపోవడమో, పోయిన వెంగుతోపాటు ఆచెడుముండలకు గూడా స్వస్తిచెప్పి మళ్లా ప్రజల్లో పడడమో.

(సీతతో మేడమిాదికి వెళ్లును. శ్రీనివాసులు అనుసరించును.)

(తెర)

# అంకము. 5.

[మళ్ళా ఒక సంవత్సరానికి. శ్రీనివాసు లింట్లో మధ్యాహ్నం 11 గంటలవేళ. భోజనాలైనవి. శ్రీనివాసులు, మంగళ చావిట్లో కూర్చుండి ఉన్నారు.]

శ్రీని—అయితే, నిన్నటి జమాకర్చులు చూచి లెక్క తేలుస్తా నంటివి. చూచావా ?

మంగ—చూచాను. అయిదువందల నాల్గురూపాయిల ఆర ణాల రెండబ్బులు నిలవ తేలింది.

శ్రీని—నయమే! మొత్తంమీద నీధైర్యము, ఆలోచనా, కృషీ అక్కఱకు వచ్చాయి.

మంగ—అంతా నాప్రయోజకత్వమంటే వప్పుకోను. నాపాలు పచ్చళ్లఅమ్మకంవల్ల వచ్చిందల్లా రెండువందల యిరవైరూపా యల పావలాకానిమట్టుకే. తక్కినదంతా మీకూరగాయల వ్యాపారంలో లాభించినదే.

శ్రీని—కావచ్చును. ఇదంతా నీచలవే. నీజాగ్రత్తవల్లనే నా బద్ధకం వదలింది.

మంగ—అది మాత్రం నిజం. ఎద్దుబండిమీద ఊరూరు తిరిగి, చింతపండు, కూరగాయలు, కొబ్బరికాయలు చవుకగాకొని, బస్తీచేరి, లాభాని కమ్మటం! ఈ తిప్పటతో ఇంకా బద్ధక మెక్కడుంటుంది? ఎలాగైతేనేమి మీరుకూడా ప్రయో

జకున్లైనారు. గుణం కుదిరింది మీ అమ్మకడుపు చల్లగా. అదిగో! పోస్టుమనిషి కాబోలు తలుపు తట్టుతున్నాడు. ఏవో ఉత్త రాలు తెచ్చినట్లున్నాడు. (శ్రీనివాసులు క్రిందికివెళ్ళి రెం డుత్తరాలు తెచ్చి, పోస్టుముద్రలు పరిశీలిస్తూ, ఒక ఉత్తరం విప్పి చూస్తున్నాడు.)

**మంగ**—ఎక్కడనుంచి వుత్తరం?

**శ్రీని**—ఒకటి రంగడిదగ్గరనుంచి. రెండోది రాజగోపాలం దగ్గర నుంచి.

**మంగ**—ఏమి వ్రాసాడు రంగడు?

**శ్రీని**—తనకై దురూపాయలు జీతం పెరిగిందనీ, నెలకో అయిదు రూపాయలు మనకు పంపుతాననీ వ్రాసాడు.

**మంగ**—మానాయన! మాబంగారుతండ్రి పంపినడబ్బంతా, వేరే నిలవచేసి వాడిపెండ్లినాటికి కావలసిన పాత్రసామా నంతా ఒక్కసారిగా కొంటాను. (శ్రీనివాసులు రెండో ఉత్తరం విప్పును.)

**మంగ**—రాజగోపాలం వుత్తరమేమని?

**శ్రీని**—(ఉత్తరం చదువుకొని ఆగ్రహంతో) ఏముందీ! మా మూలుపాళే వ్రాసాడు నీవేర. సీతకు మళ్లా పెళ్ళి చెయ్యా లంటాడు. ఎక్కడో సంబంధం విచారిస్తున్నాడట! వాడి వుద్దేశమేమనో నాకు తెలియకుండా వుంది. వాళ్లు వీళ్లకు మళ్లే సీత మారుమనువు చేసుకుంటుందని కాబోలు. అయినా నిక్షేపంవంటి బ్రాహ్మణకుటుంబాల కీ పాయ్యేకాలమేమి

టంటా! స్త్రీలకు పునర్వివాహం పనికిరాదని ధర్మశాస్త్రాలు ఘోషిస్తూ వుంటే, మనయింటి ఆడుపడుచు ధర్మవిరోధంగా మళ్లా పెళ్లాడుతుందా! మొదలు మనం సీతను రాజగోపాల మింటికి పంపడమే తప్పయింది. పసికాయ దానికేమి తెలుసు? ఇటుపంటి దుర్బుద్ధులు దానికి నూరిపోయడం తగునా తనకు?

**మంగ**—పుట్టెడుదుఃఖంలో మునిగి పిల్ల కృశిల్లుతూవుంటే, పోనీ కదాయని ఏడాదికిందట ఆమూయవారి మొగుడు చచ్చిన కొత్తలో పంపితిమి. మనకూ ఒక మనిషిభారం తగ్గినా తగ్గిందే, పిల్లకూడా అక్కడ కులాసాగా ఉంటుంది గదా, రాజగోపాలమయినా తనచెల్లెలివలె చూచుకుంటున్నాడు, గంగకిది చేదోడుగాను వుంటుందనుకున్నాను.

**శ్రీని**—అక్కడ కులాసాగా వుండడమూ, పిల్లలను సాకడం వల్లనే దానికీ ఈఆలోచనలు పుట్టుకు వచ్చినవి.

**మంగ**—సీతకు కూడా పెండ్లాడడ మిష్టమేనంటారా?

**శ్రీని**—ఏమో! రాజగోపాలం వ్రాయడం మట్టుకు గంగమన స్ఫూర్తిగా అంగీకరించిందనీ, సీతకు కూడా ఇష్టమేననీ వ్రాస్తాడు. ఇక వూరుకుంటే కార్యం మించి వచ్చేటట్టులుంది. వెంటనే వెళ్లి పిల్లదాన్ని తీసుక చక్కావస్తాను. అక్కడే వుంచితే, ఇంకాకొన్నాళ్లు కిట్లాగే వాళ్లు నూరి పోస్తూవుంటే దానిక్కూడా మనసు మారకమానదు. (కోపంతో) అయినా నీకు కూడా ఇది అంగీకారంగానే వున్నట్టుంది. లేకపోతే నీపేర ఇట్లా ఎందుకు వ్రాస్తాడు?

**మంగ**—ఇష్టమే ననుకోండి. తథాస్తు. ఏపాపము ఎఱుగనీ పసి కుంకకు దానికి పెళ్ళిచేస్తే మాత్రం తప్పేమిటి చెప్పండి ?

**శ్రీని**—సరి ! ఇకనేమి ? నువ్వు కూడా వర్ణసంకరుల్లో చేరావన్న మాట. పసికుంకేమిటి, పండుకుంకేమిటి ? పతివ్రతైన ఆడది మొగుడు చచ్చిన తరువాత తిరిగీ పెళ్ళాడడానికి కలలో నైనా వప్పుకుంటుందా ?

**మంగ**—నిజమే. మగవాడయితేగా! పెళ్ళాం బ్రతికి వుండగానే, పిల్లలతండ్రైన తరువాత కూడా, అన్యవాంఛతో తిరగ డానికి ? పాతివ్రత్యంకూడా దానికే విధించారుగాని, పత్నీ వ్రతం మగవాడికి విధించలేదు.

**శ్రీని**—ఈ సూటిపోటిమాటలు నన్ను గురించేనా ?

**మంగ**—మిమ్మ నొక్కరినే అన్న మాటేమిటి ? మగవాళ్ల అందర మాట చెప్పాను. ఏభై యేళ్లుకూడా వచ్చి తగుదునంటూ మగవాడు స్వేచ్ఛావిహారం చేయడమూ, తిరిగీ పెళ్ళికి సిద్ధ పడడమూ తగునుగాని, పదహారేళ్లపిల్ల మగని మొగ మెటు వంటిదో యెఱుగనిది మళ్ళా పెళ్ళాడితే తప్పా! దానిబ్రతు కేమి కావాలి ?

**శ్రీని**—అవును. మగవానికంటె ఉత్తమధర్మం పాలించాలి ఆడది అది ప్రపంచధర్మం.

**మంగ**—ఎందువల్లనో ?

**శ్రీని**—జాతిసాంకర్యం కలగకుండా వుండడానికి, బీజశుద్ధికిన్నీ. లేకపోతే సంఘం తలక్రిందులు కాదూ ?

మంగ—పోనీ, మీమాట నిజమేకాబట్టినా, అది మగవాని విషయంలో వర్తిస్తుంది కాని, పెళ్ళాడే బాలవిధవలపట్ల బీజసాంకర్య మెట్లా తటస్థించుతుంది? అరవైడెబ్భైయేళ్లమగ వాళ్లు నాలుగోసారి అయిదోసారి పెళ్ళిపీటలమీదికి సిద్ధపడ వచ్చుగాని, బాలవిధవలు మట్టుకు బ్రహ్మచర్యం పాలిస్తూ మ్రగ్గిపోవాలేమి ?

శ్రీని—సరే, నీతో నాకీవాద మెందుకుగాని, నేనొక్క సంగతి చెపుతా విను. నువ్వుకూడా రాజగోపాలంతో ఏకీభవించి పిల్లదాని మతి విరిచినాసరే, నేను మాత్రం ఈపెళ్ళికి వప్పుకోనని ముమ్మాటికి నమ్ము.

మంగ—మీరు వప్పుకోనేదేమిటి ? లా ప్రకారం అది పెళ్ళా డుతూఉంటే.

శ్రీని—ఎవరుచెప్పారు నీకీలాపాయింటు ?

మంగ—రాజగోపాలమే చెప్పాడు, కోర్టుమునసబీ చేస్తున్నవాడు అత నెఱగడూ ?

శ్రీని—సరే, ఇకనేమి ? సాధకబాధకాలన్నీ మీరంతా ఇదివఱకే ఆలోచించి నిశ్చయించుకున్నారన్నమాట.

మంగ—అవును. మూణ్ణెల్లక్రితం రాజగోపాలమింటికి వెళ్ళి నప్పుడు అతను చెప్పాడు. సీత నవయావనంలోవుందనీ, దాని వంటి కులాసాస్వభావంగలపిల్ల బ్రదుకంతా బ్రహ్మచర్యం అవలంబించడంకంటె, పెళ్ళాడి, బిడ్డలగని సంసారసుఖమను భవించడం న్యాయమనీ, మనరెండుప్రాణాలు గుటుక్కు మంటే అది అధోగతిపాలై దిక్కుమాలిన దౌతుందనీ నచ్చ.

చెప్పాడు. సీతస్వభావం ఎటిగివున్న నాకున్నూ అది మంచి మాటగానే తోచింది.

శ్రీని—సరే, నీవంతా ఆలోచించి నిశ్చయించుకున్న తరువాత ఇక నాపెత్తనమేమిటి బోడిపెత్తనం! ఇదివఱకు నామాట వినకుండానే, చావుకు సిద్ధమైన రోగిష్టివాడికిచ్చి చేసావు, ఇప్పుడూ నాసమ్మతి లేకుండానే మళ్ళా పెళ్ళిచేస్తున్నావు. కానీ, నీయిష్టమొచ్చినట్లే చెయ్యి. నువ్వు సర్వస్వతంత్రురాలవు

మంగ—మీారలా కోపం తెచ్చుకుంటేకాదు. మొదట నావల్ల తప్పు జరిగినమాట నిజమే. అప్పుడు మీామాట వినక వెంగుకిచ్చి చేయడంవల్లనే, ఇప్పుడు కూడా మీామాట తిరస్కరించవలసిన అవసరం కలుగుతూంది. మొదటిది తప్పేగాని ఇది మాత్రం తప్పుగాదు. ఆలోచించండి.

శ్రీని—కార్యం మించినతరువాత ఇప్పుడు తప్పని వప్పుకుని ప్రయోజనమేమిటి? తడిసిగాని గుడిసెకట్టడన్నట్టుగా నీకు ఒక్కొక్కటే అనుభవమైతేగాని తెలియదు. ఎప్పటికప్పుడు తప్పడుగువేయడం, నాలుక కరచుకోవడమున్నూ. ఈసారి అట్లాపనికిరాదు. నాయిష్టంలేకుండా పిల్లపెళ్ళిచేసావో, నేనింక నీకొంపలో అడుగుపెట్టను, అని తెలుసుకో.

మంగ—అబ్బా! చాల్లెండి! ఏమిటా అశుభంమాటలు. శుభమా అని కూతురుపెళ్ళి జరగబోతూ వుంటే కొంప వదలిపెట్టి లేచిపోవడం కర్మమేమి?

శ్రీని—నేను లేచిపోయినా సరేకాని నువ్వు ఈపెళ్ళి మానవన్నమాటేగా?

**మంగ**—మీరొకప్పుడు ఇంట్లోవుండి నన్ను సుఖపెట్టాలనుకుంటూ, ఇవ్వాళ లేచిపోతానంటే నేను విచారపడడానికి? కాకపోతే పిల్లలమీదైనా జాలి దలిచి వెళ్ళిపోకండని బ్రతిమాలుకుంటున్నాను. అందులోనూ, మనకష్టాలన్నీ తీరి, ఈఒడ్డ గట్టెక్కే సమయంలో, సుఖమనుభవించవలసిన దినాల్లో మీకీవిపరీతబుద్ధి కూడదు. మీరు మాకు సంపాదించిపెట్టిన ఈ రెండువేల ఋణము నిశ్శేషము కానివ్వండి. మళ్ళా మన యిల్లు అనుకోనేరోజులు వస్తున్నవి. నామాట వినండి.

**శ్రీని**—నేనింకా యీ ఇంట్లోవుండి నాకళ్ళయెదుట విధవ కూతురు పెళ్ళాడుతూ వుంటే చూచి ఆ అవమానం భరించలేను.

**మంగ**—ఇదివరకు జరిగిన డిక్రీలకంటె, దగానేరాలకంటె ఇది యెక్కువ అవమానమటే పోనిద్దురూ.

**శ్రీని**—లోకందృష్టిలో ఇదే ఎక్కువ అవమానం

**మంగ**—అవును. పెళ్ళాం బిడ్డలుగలసంసారి అవినీతిగా సంచరిస్తే ఈలోకానికి తప్పుగా తోచదు. స్వామిద్రోహంచేయడం ఈలోకానికి తప్పుకాదు. కాని ముక్కుపచ్చలారని నిర్భాగ్యురాలు మళ్ళా పెళ్ళాడితే ఈలోకం సహించలేదు. పోనిద్దురూ పాడులోకం.

**శ్రీని**—ఆసంగతి అలావుంచుగాని, సీతకూడా వివాహేచ్ఛ వున్నట్లు నీవెలా కనిపెట్టావో చెప్పు.

**మంగ**—వయసువచ్చినపిల్లకు కోరికవుండదండీ మరి? నిత్యమూ ఆశరీరం అలంకరించుకోవడమూ, గంగబిడ్డలను మాటి

మాటికీ ఔత్సుక్యంతో ముద్దుపెట్టుకోడమూ, గంగారాజ గోపాలమూ ఏకాంతంగా కూచున్నప్పుడు వాళ్ళవంక నీరునిండినకన్నులతో కుతూహలంగా చూస్తూవుండడమూ ఇవన్నీ యేమి తెలియజేస్తవి? బిడ్డ ఒకమాటు, 'అమ్మా! నాకడుపున ఒకనలుసైనా పుట్టుటకు నోచనైతినిగదా' అన్నది నాతో. రాజగోపాల మొకనాడు, 'కన్యలకంటె చాల విధవలే చక్కనిసంసారిణులుగా ఉంటున్నా' రని అన్నాడట దానితో.

ఇంకోరోజున అమ్మాయి,

'వనజాతాంబకుడేయుసాయకములకే వారింపగారాదు, నూ
తనబాల్యాధికయౌవనంబు మదికిన్ ధైర్యంబు రానీయ, దీ
యనురక్తిన్ మిముబోంట్లకుం దెలుప నాహా సిగ్గుమైకోదు, పా
వనవంశంబు స్వతంత్రమీయదు చెలీ! వాంఛల్ తుదల్ముట్టునే'

అనేపద్యం చదివి, గుక్కనీరు గుక్కుకుంటూ, 'అమ్మా! నాకు కూడా అటువంటి ఆవేదన యేదో కలుగుతున్నదే! నావాంఛ లీజన్మాన తుదముట్టవుగదా' అన్నది. అంతట్లో ధైర్యంతెచ్చుకొని,

'కలుగదే! నాపాలికలిమి సందేహింప
    కలిమిలేములు లేకకలుగువాడు
చూడదే! నాపాటు చూపుల జూడక
    చూచువారల కృపజూచువాడు,
లీలతో నామొరాలింపదే! మొరగుల
    మొర లెఱుంగుచు దన్ను మొరగువాడు
నాకడ్డపడరాదె! నలినసాధువులచే
    బడిన సాధులకడ్డపడెడివాడు'

అనేపద్యం చదువుకుని తన్నుదానే సముదాయించుకుంది.

శ్రీని—పాపం! బిడ్డ ఎంత కుమిలిపోతున్నదో! ధర్మవిరుద్ధమైన యీవివాహానికి చూస్తూ చూస్తూ ఎలా అంగీకరించను?

**మంగ**—బిడ్డకష్టం తలచుకోండి! పదిహేనేళ్లపసిగాయ, నవ యౌవనంలోవున్న మీముద్దులకూతురు, సంతోషలేశమైనా లేకుండా, జీవితమంతా దుఃఖభాగినినై ఎట్లా గడపగలదో ఆలోచించండి. బిడ్డ దుఃఖనరకకూపంలో కృశిస్తూవుంటే కన్నతండ్రి మీరు కాస్త చేయి అందించక చూస్తూ వూరుకుంటారా? ఎప్పుడో చావు తరవాత వచ్చేనరకం మాట యేమోగాని బిడ్డ ఇప్పుడే యమయాతన పడుతూ వుందే! దానిజీవిత మెట్లా తెల్లవారుతుంది చెప్పండి! మీరొకనాడు ఏమన్నారో జ్ఞాపకంతెచ్చుకోండి. నామీద ప్రీతిలేకపోయినా సీతంటే మీకు పంచప్రాణాలూ అని అన్నారు గదా! అటువంటిబిడ్డను చేతులారా మందభాగిన్ని చేస్తారా? బిడ్డమీద మీకుగలప్రీతిని చూపడానికి ఇంతకన్న తరుణ మేమి వస్తుంది? దానిసౌఖ్యంకోసం మీఆచారాలు కాస్త సళ్లు విడువకూడదా? నామాట వినండి. మీరిక మారుమాట చెప్పవద్దు. మిమ్ము బ్రతిమాలుకుంటాను. (కాళ్లపైబడును)

శ్రీని—(మనస్సుకరిగి) సరే, కానీ, ఏమవుతుందో. నాపెళ్లాంబిడ్డలకు లేని ఆచారాలు, లోకభీతి నాకు మాత్ర మెందుకు? అదీగాక, నీవు చెప్పినట్లు మన యిద్దరిప్రాణాలు గుటుక్కుమంటే దానిగతి ఏమి అవుతుందో! రంగడు దాన్ని మనం చూచినట్లు చూస్తాడని నమ్మకమేమిటిలే.

**మంగ**—చూ స్తేమట్టుకు వెయ్యిమంది తోబుట్టినవాళ్లైనా భర్త అవుతారా! తనయిల్లు తనబిడ్డలు అనేతృప్తికన్న అధిక సౌఖ్యం భగవంతుడు కూడా యివ్వలేడు.

**శ్రీని**—సరే, నేనడ్డంచెప్పనుగాని, ఎక్కడో దూరప్రాంతాన గుట్టుచప్పుడు గాకుండా కార్యం జరిగించివెయ్యి.

**మంగ**—(భర్తను కౌగిలించుకొని, ముద్దాడి) ఏది ఎలావున్నా పిల్లలంటే ప్రీతే దొరగారికి! ఇలాంటప్పుడు గతమంతా మరపువచ్చి ఎంతో ప్రీతి కలుగుతుంది నాకు. నాతప్పులు కూడా మఱచిపోతారు కాదూ ?

**శ్రీని**—పిచ్చిదానా! మఱచిపోవడానికి మనమేం తప్పులుచేసామటగాని, పిల్లకు అనుకూలమైనవరుడు లభించడం మాత్రం కష్టం సుమా!

**మంగ**—ఇక్కడికి మీఅడ్డంకి తీరింది గనక ఇక నాకావిషయమై ధైర్యమే. రాజగోపాలం సహాయంతో లోకమంతా గాలించైనా మంచి సంబంధం వెదికి ఏడాది తిరక్కముందే పిల్లకు పెళ్లిచేస్తానోలేదో చూడండి. తరం గడవడం కష్టంగాని, ఏడుగడవడం కష్టం కాదు.

**శ్రీని**—మన సీతవంటి విద్యాబుద్ధులుగల పిల్లకు సంబంధం దొరకడానికి ఏడాదికూడా అక్కరలేదు. సరే, నేనువెళ్లి ఆచింత పండు యాభైమళ్లూ ఖరీదుచేసి వస్తాను.

**మంగ**—వెళ్లి రండి. నాకు పనివేళ అయింది. (శ్రీనివాసులు వెలుపలికి వెళ్లును. మంగళ తలుపువేసి లోపలికి వెళ్లును.)

(తెర)

---

# అంకము. 6.

---

[పిదప తొమ్మిదిమాసాలకు, శ్రీనివాసులింట్లో సావిట్లో మంగళా. రాజగోపాలం కూర్చుని మాట్లాడుతున్నారు. రాజగోపాలం 35 ఏండ్లవాడు. ముఖంలో చురుకుదనం, జాగ్రత్త కనిపిస్తున్నవి. వేళ ఉదయం 9 గంటలు.]

**మంగ**—సంబంధం మనమనుకొన్నంత సులభంగా కుదిరేటట్టు లేదు.

**రాజ**—అవునండి! మనశాఖలో ఈపునర్వివాహాలింకా పరిపాటి కాలేదు. పడుచువాళ్లంతా స్త్రీపునర్వివాహం న్యాయమే నని, తమకు సమ్మతమేనని ధర్మనిర్ణయాలు చేస్తూవుంటారు. ఎప్పుడో ఎనభైయేళ్లక్రింద స్వజాతిమంత్రులతో యోచించి ఆ ఇంగ్లీషు గవర్నరుజనరలు చేసిన ధర్మనిర్ణయానికి వీరిసమ్మతి ఎందుకో! వీళ్లు క్రియావిహీనమైన యీపాడిమాటలు చెప్పకపోతే తామే విధవావివాహాలు చేసుకోడానికి సిద్ధపడ రాదూ! ఇతరులు చేసుకుంటూ వుంటే వీరు అంగీకరిస్తూ వుంటే ఎవరికేమి నిండుతుంది? 'అబ్బాయీ! నీవీబాలవిధ వను చేసుకుంటావా? ఈకన్నెను చేసుకుంటావా?' అని ఎదుటబెట్టి అడిగితే, వితంతువునే చేసుకుంటానని ముందుకు వచ్చే పడుచువాడొక్కడూ లేడు. సులభంగా క్షీరాన్నం లభిస్తూ వుంటే చద్ది అన్నం తినడాని కెవడు వప్పుకుంటాడు? ఎవడైన బుద్ధిపూర్వకంగా వితంతువును పెండ్లాడడానికి సిద్ధ పడేవాడుంటే వాడికి తలిదండ్రులు అడ్డపడతారు.

**మంగ**— మొదలు వాళ్లకు మనస్ఫూర్తిగా చేసుకోవాలని వుంటే ఈ అభ్యంతరాలు అడ్డుకుంటవటలెండి.

**రాజ**— ఆమాట చెప్పడం సులభమే కాని, సంఘాన్ని కులాన్ని శరించడం సామాన్యం కాదు. నిరంతరవిఘ్నాలవల్ల ఎటువంటి ఉత్సాహమైనా చల్లబడుతుంది. కష్టసుఖాల కాదుకునే బంధువర్గంతో సంబంధం త్రెంచుకోవడం కష్టం. శుభాశుభాలకు రావాలని కోరేది బంధువులనుగాని ఈసంఘుసంస్కర్తలను కాదు. సంఘుంయొక్క వెలి అనుభవించినవాళ్లకుగాని దానిలో వుండేకష్టం తెలియదు. ప్రతివాడూ తన కష్టసుఖాల నితరులు గ్రహించి తన్ను ఆదుకోవాలనే కోరుకుంటాడు. మనదేశంలో అలా ఆదుకొనేవాళ్లు బంధువర్గముగానే కనుబడుతారుగాని ఇతరులు కారు. ఇది మనసంఘం చేసుకున్న పాపమైతే కావచ్చునుగాని ఉన్న వాస్తవం మాత్ర మది

**మంగ**— పోనీ, మనం రెండో పెళ్లి వాళ్లను విచారిస్తే ?

**రాజ**— రెండో పెళ్లివాళ్లకు మాత్రం కన్యలు దొరక్కపోతేగా! అటువంటప్పుడు వాళ్లుమాత్రము చూస్తూ చూస్తూ వితంతు వివాహకష్టం నెత్తికి తెచ్చుకుంటూరా ? అదిన్నీ గాక, మొదటి పెళ్లివాళ్లకంటె రెండో పెళ్లివాళ్లు సంస్కారసుముఖులుగా వుంటారనీ, స్వలాభం విడనాడుతారనీ ఎందుకనుకోవాలి ?

**మంగ**— అలా చెప్పండి! కావచ్చునుగాని, సంఘుసంస్కారమంటూ చెవులు దిబ్బెళ్లుపడే యీరోజుల్లో కూడా ఏకొద్దిమందైనా బుద్ధిమంతులు వితంతువును పెండ్లాడేవాళ్లు దొరక్కపోతారా అని నా ఆశ సుమండీ!

**రాజ**—దొరక్కపోరుగాని అటువంటివాళ్లు ఎక్కడవున్నారా అనేదే ప్రశ్న.

**మంగ**—పోనీ, మనం పత్రికల్లో ప్రచురణ చేస్తేనో?

**రాజ**—అదీ చేసి చూచాను. ఈ ప్రచురణలకు సమాధాన మిచ్చేవాళ్లందఱూ సాధారణంగా మనకు నచ్చనివాళ్లుగా వుంటారు. నేను ప్రకటనలోనే తెలియజెప్పాననుకోండి, పిల్ల సామాన్యంగా చదువుకుందనీ, కట్నం మేమీ ఇవ్వమనీ ముప్ఫై అయిదేండ్లలోపు బ్రాహ్మలే పనికివస్తారనీ. ఇది చూచి అయిదుగురు మాత్రం నాపేర వ్రాసారు. అందులో ముప్ఫైయినాలుగేండ్లాయనఒకడు ఇదివఱ కొక పెండ్లాము, నలుగురు బిడ్డలు వున్నారట, రెండో పెళ్లాముగా స్వీకరిస్తాడట ఈపిల్లను. మొదటిభార్యతో తగాదా వచ్చిందట, ఆబిడను వదలివేస్తాడట! అటువంటివాడు మనకు పనికి రాడుగదా! ఇక రెండోఆయన వ్రాసిన సమాధానం చూస్తే పిచ్చివాడులాగా కనుపిస్తాడు. ఇండియాలో ఉన్న వితంతువుల నందఱినీ ఒక్కపెట్టున తనే పెళ్లాడేస్తాననీ, అంతటితో ఈచిక్కు విడిపోతుందనీ వ్రాస్తాడతను.

**మంగ**—బాగుంది! వెఱ్ఱిముండాకొడుకు!

**శ్రీని**—ఇక మూడో ఆయన కుష్ఠురోగి. నాలుగోవాడు ముప్పయి అయిదేళ్లముాగ, చెవిటిమొద్దు. అయిదోవాడొక బికారి. రైలుఖర్చులు పంపితే వచ్చి పెళ్ళిచేసుకుపోతాడట. 'తిరిగి వెళ్లడానికి మాదంపతు లుభయుల ఖర్చులు గూడా మీరేభరించా'లని కూడా వ్రాసాడు. వీరు తప్ప మఱెవ్వరూ కనపడ లేదు.

**మంగ**—కాబట్టి, మన ప్రయత్నాల కిప్పటికి గలిగినఫల మేమిటీ అంటే 'సీతకు రెండో పెళ్ళి చేస్తారట' అని నలుగురు చెప్పుకోవడంగా కనిపిస్తున్నది. కార్యసానుకూలం అయ్యేమార్గం మరోటి చూద్దురూ! అల్లుడుగారూ!

**రాజ**—మన ప్రయత్నం విడవకుండా వుండడమే మార్గం. కాకపోతే ఇదివఱకు వరుడికి ముప్ఫయి అయిదేళ్లుండాలన్నాము. ఇప్పుడు నలభై యేళ్లందాము. ఇదివఱకు మూడువేల కిమ్మతుగల ఆస్తియైనా, నెలకు యాభైరూపాయీల ఉద్యోగమైనా వుండాలన్నామనుకోండి, ఇపుడు రెండువేల ఆస్తియైనా ముప్పైరూపాయీల నౌకరీయైనా చాలునందాము. ఏమైనా పిల్లకు వరుడు కుదిరేదాకా నేను నిద్రపోనని నమ్మండి.

**మంగ**—నాయనా! రాజగోపాలం! నీపుణ్యమాయె, ఆస్తి విషయంలోమాత్ర మంతకు తగ్గించబోకు సుమా!

**రాజ**—సరే, మీయిష్టం చొప్పునే చేస్తాను. కాకపోతే మరి కొంచెం కష్టమవుతుంది కార్యసానుకూలము కావడం.

**మంగ**—అంత్యనిష్ఠూరంకన్న ఆదినిష్ఠూరం మేలన్నారు. తరువాత విచారించి ప్రయోజన ముండదు.

**రాజ**—నిన్ననే విశ్వనాథం పిల్లఫోటో తీసికెళ్లాడు. తన స్నేహితు డెవరో వున్నాడు, చూపిస్తానని. మళ్లా అయిపు లేదు.

**మంగ**—(చిఱునవ్వుతో) ఓహో! అదా కథ!

**రాజ**—ఏమి కథా?

**మంగ**—నిన్న ఉదయం సీత శివపురం చెఱువుకు స్నానానికి వెళ్లినపుడు, విశ్వనాథం ఎవరో క్రొత్తాయనకు తన్ను చూపించి ఏదో చెప్పాడనీ,విశ్వనాథం తన్ను కుశలప్రశ్నలు చేస్తూవుంటే ఆకొత్తకుఱ్ఱవాడు తన్ను నిపుణంగా పరిశీలిస్తూ నిలుచున్నాడనీ చెప్పింది లెండి. విశ్వనాథం సంకల్పం అమ్మాయి కూడా గ్రహించింది. అంతేకాదు, మనలోమాట, దానికక్కూడా ఆకుఱ్ఱవాడంటే ఇష్టమల్లేనే వుంది. అదిగో అమ్మాయి వస్తోవుంది.

స్నాతయైన సీత ప్రవేశించును.

**రాజ**—(మంగళతో) ఇవ్వాళ్ల ఉత్తరాలు రావాలి. పోస్టుమనిషి ఇంకా జాడలేదు. (వీధిగుమ్మము చెంతకు వెళ్ళి తొందరగా తిరిగివచ్చి) మామగారితో విశ్వనాథమున్నాడు, ఇంకెవరో కొత్తమనిషి వస్తున్నారు. ఇంతకు ముందు మన మనుకొన్నకుఱ్ఱవాడు కాడు గదా.

**మంగ**—(చప్పున వెళ్ళిచూచి ఒక్కడుగులో తిరిగివచ్చి) ఇంకా సందేహమా! పిల్లనడగడానికి వస్తున్నట్లున్నారు. (సీత సిగ్గుపడును) కుఱ్ఱవాడు మంచివాడే. వయస్సు 30 లోపుగా వుంటుంది. అందమైనవాడే. (సీత మరల సిగ్గిలును.) అమ్మాయి! లోపలికి వెళ్ళి తల దువ్వుకొని, కొత్తచీర కట్టుకొని, బొట్టుపెట్టుకోవే! అవసరమైతే నేను పిలుస్తాను. (సీత లోనికివెళ్ళును. విశ్వనాథం, శ్రీనివాసులు, అచ్యుతం ప్రవేశింతురు. రాజగోపాలము, వారు చిరిచాపలపై కూర్చుందురు. మంగళ కొంచెం దూరమున నిలిచి యుండును.)

శ్రీని—ఇదుగోనే వీరు విశ్వనాథంగారి స్నేహితులు శిష్యులున్నా. అచ్యుతంగారని వీరవాసరం కాపురస్థులు. వారిది చాలా గొప్పవంశం. వారిప్పుడు పారసీకదేశంలో ఒక నూనెకంపెనీలో పనిచేస్తూ నెలకు రెండువందలు తెచ్చుకొంటున్నారు. ఆదేశంవెళ్లి ఏడేళ్లయింది. పెళ్ళిచేసుకుందామని బుద్ధిపుట్టి ఎనిమిదినెలలు సెలవుతీసుకొని స్వదేశానికి వచ్చారట. అనుకూలమైన సంబంధంకోసం చూస్తున్నారు. అప్పుడే ఏడునెలలు గడచిపోయినవి. మన విశ్వనాథంగారు చెప్పారట మనపిల్లదానిసంగతి, మనస్థితిగతులున్నూ. పిల్లను కూడా వారు చూచారట. మనం సమ్మతిస్తే వెంటనే ముహూర్తనిశ్చయం చేసుకోవాలని వారితలంపు.

అచ్యు—(శ్రీనివాసులుతో) మీ అమ్మాయి యింట్లో వున్నదా అండి ?

శ్రీని—ఉన్నదండి. పిలుస్తాను. అమ్మాయి! సీతా! ఇట్లా ఒకసారి రా అమ్మా! ఫరవాలేదు, రా అమ్మ! సిగ్గుపడకు (సీత ఎఱ్ఱబనారసు చీరకట్టుకొని తలలో మల్లెపూలదండ తురుముకొని, నొసట కుంకుమబొట్టు పెట్టుకొని దేదీప్యమానంగా ప్రవేశించి తల్లిచెంత ముసిముసి నవ్వులతో మేలమాడు నించుకంత మౌగ్ధ్యముతో నిలుచును. సీతవంక అచ్యుతం సాభిలాషౌత్సుక్యములతో చూచును. వారి ఇరువుర చూపులు తారసిల్లును. రాజగోపాలం, మంగళ పరస్పరం చూపులతో హెచ్చరించుకొందురు.)

అచ్యు—(శ్రీనివాసులతో) నామనస్సులో కోరుకున్నపిల్ల నేటికి లభించినదండి! ఇక నాఅభ్యంతరమేమీలేదు (సీత తల

వాల్చును) మీఅమ్మాయికి కూడా అభ్యంతరమున్నట్లు తోచదు. (సీత మళీ తల వాల్చుకుంటుంది) ఇక మీరు సమ్మతించడమే అవశిష్టం. తొందరేమీం లేదు. ఆలోచించే చెప్పండి. పదిరోజు లాలస్యమైతే మళ్లా తంతి యిచ్చి ఒకనెల సెలవు తీసుకుంటాను.

**మంగ**—అక్కడ మనదేశస్థు లింకా ఎవరైనా వున్నారాండి ?

**అచ్యు**—ఆహా ! నేనుండేచోటనే ఇంకామనదేశస్థు లారుకుటుంబాలవా రున్నారండి. ఇద్దరు బంగాళీలు. ఒకాయనది సింధు. ఒకరు మహారాష్ట్రులు. ఇద్దరు ఉత్తరహిందూస్థానపు మహమ్మదీయులూనూ. మార్గం కూడా మునపటివలె కాదు. మన దేశానికీ అక్కడికీ రాధారీబోట్లు తిరుగుతూ వుంటవి. ప్రతిమూడేళ్లకు నాకు మూణ్ణెల్లు సెలవు కూడా లభిస్తూ వుంటుంది, దేశంవచ్చి చూచిపోవడానికి, దానికి.

**మంగ**—మూడేళ్లవఱకు దేశం వదలిపెట్టి కానిదేశాల్లో కొత్త ప్రజమధ్య బిక్కుబిక్కుమంటూ వుండడం కష్టమే! పిల్లదాని అభిప్రాయ మెట్లా వుందో మఱి!

**అచ్యు**—నిజమే. కనుక్కోవచ్చును. నాకు కొంత అలవాటే ననుకోండి. అయినప్పటికి ఇదివఱకు దారివేఱు; ఇప్పుడు సీతాసాహచర్యంవల్ల కలిగే కులాసా వేఱు. ఆమెకు సర్వవిధముల మనస్సు కానందం కలిగించే బాధ్యత నాది.

**సీత**—అమ్మా! పారసీకదేశమైతే మాత్రం భయమేమిటే? లలిత భర్తతో కూడా ఇంగ్లండులో వుంది కాదూ ? (అచ్యుతం సంతోషపారవశ్యం చెందును. సీత వంటయింటిలోనికి

వెళ్ళగా తలిదండ్రులు, బావగారు అనుసరింతురు. తక్కిన యిద్దఱు చావట్లోనే వుంటారు.)

**సీత**—అమ్మా! నేను కృతఘ్నురాల ననుకుంటావేమో! అలా కాదు. ఇచట ఈవైధవ్యమనుభవిస్తూ మనవూళ్లో, మన యింట్లో పడివుండేదానికంటె దూరదేశములోనైనా, ప్రీతిగలభర్తతో వుండడమే కులాసాగా వుంటుంది. ఇక్కడ నాకేమి సుఖమున్నది చెప్పు! వారైనా నన్ను ప్రీతితో చూస్తూ సుఖపెట్టుతారనే నాకు ధైర్యం. నన్ను క్షమించు.

**రాజ**—ఇందులో క్షమించుట కేముంది! నీమాట చాలా బాగున్నది.

**శ్రీని**—(సీతతో) తల్లీ! నీసుఖాని కడ్డంపడతామటే మేము? నీకష్టసుఖాలు ఆలోచించుకోగల వయసువచ్చిందికాని నీవేమీ చిన్నపిల్లవు కావుగదా! నీకిష్ట మెలావుంటే అలాగే చెయ్యమ్మా! చిరకాలం సౌభాగ్యవతివై వర్ధిల్లు నాచిట్టితల్లీ!

**మంగ**—అమ్మాయీ! నీకు శుభం. మీనాన్న చెప్పినమాట నిజం. నీనిశ్చయానికి నేనూ అడ్డు చెప్పను. ఎక్కడైనా నాతల్లి సుఖపడడమే నాకు కావలసింది.

(మళ్లా అందరు చావట్లోకి తిరిగి వస్తారు.)

**శ్రీని**—(అచ్యుతంతో) నాయనా! అచ్యుతం! మీకు శుభం. మాఅభ్యంతర మేమిలేదు.

**అచ్యు**—నన్ను నిజంగా ధన్యుణ్ణి చేసారన్నమాట. (సీతతో) ఇదిగో! నీకొఱకు చిన్నఉంగర మొకటి తెచ్చాను. (అని

ఉంగరమిచ్చును సీత లజ్జచే అనుమానించుచుండగా తల్లి కనుసైగ చేయును. అంతట సీత తన ఎడమచేతి వుంగరపువ్రేలి కాయుంగరం పెట్టుకుంటుంది. ఉంగర మా వ్రేలికి సరిగ్గా సరిపోతుంది)

**రాజ**—(అచ్యుతంతో) ఆమె సమ్మతించడం ముందుగానే నిశ్చయించుకొని సిద్ధంగా వచ్చినట్లున్నారు.

**అచ్యు**—అవును. అంగీకరించకపోతుందనే అధైర్యమేమీ నాకు లేదు. అందుకని నిన్న సాయంత్రమే ఉంగరం కొన్నాను.

**రాజ**—మీకు సరిగ్గా ఆవేలి ఆది ఎవరిచ్చారబ్బా!

**అచ్యు**—ప్రేమించినకంటికి ఇంకొకరు ఆది యివ్వాలా? (విశ్వనాథంతో) మీఋణ మెట్లా తీర్చుకొంటానో నేను?

**విశ్వ**—అబ్బాయీ! సీత, నువ్వు సుఖించడమే నాకు కావలసినది. మీరిద్దఱు దంపతులు కావడంకంటె నాకు వేఱే ఆనందమేమి లేదు. ఏమయ్యా! శ్రీనివాసులూ! మఱి. ముహూర్తమెప్పుడు?

**శ్రీని**—శుభస్య శీఘ్రమన్నారు. ఇంకా ఆలస్య మెందుకు? తొందరగానే నిశ్చయిద్దాము.

**అచ్యు**—నేనుకూడా ఈశుభవర్తమానం బొంబాయికి తెలియజెయ్యాలి. అచటనున్న మిత్రుడొక్కడు తప్ప నాకిక వేఱే రావలసినవారెవ్వరు లేరు. వివాహం బొంబాయిలోనే జరిగితే బాగుంటుందేమో ఆలోచించండి.

**శ్రీని**—అయితే మఱీ మంచిది.

**అచ్యు**—సరే. ఇవ్వాళ శుద్ధపంచమి. మఱి పది పదిహేను రోజుల కొక మంచి ముహూర్త మున్నదన్నారు.

**శ్రీని**—ఇకనేమి ? మీరు ముహూర్తాలు కూడా చూచుకొనే వచ్చారు. శుభం! కానివ్వండి.

**అచ్యు**—మఱి సెలవులయిపోవచ్చినవని నేను సర్వసిద్ధంగానే వున్నాను. నేడు నాజన్మకల్లా సుదినము. ఈఆనందం భరించ లేకుండా వున్నాను. బొంబాయికి తంతి ఇచ్చివస్తాను. సెలవు. (విశ్వనాథంతో కలసి వెళ్లును. సీత తల్లిని కౌగలించుకొని వెక్కి వెక్కి ఏడ్చును.)

**సీత**—అమ్మా! ఇవ్వాళ్ల ప్రొద్దున్నే లేచి భగవంతుణ్ణి ప్రార్థించాను. ఆసర్వేశ్వరుఁడు నాకుయ్యి ఆలించాడు.

**మంగ**—పిచ్చితల్లీ! ఏడువకు. మన అందఱప్రార్థనలు ఆలించ బట్టే ఫలించినవి.

**సీత**—

అగణితములైనట్టి అన్ని దినములలోను
ఒకటిబోలినదినం బొకటలేదు
ప్రాయంపు ప్రొద్దుకై వ్రాలి పోవకమున్ను
ఈయవే నాకొక్క-టేని సుదినము తండ్రి
స్వర్ణసుందరమైన చక్కన్ని సుదినమ్ము. ఈయవే నాకొక్క-.
సుదినముల్ గడచినా వదలకుండును స్మృతిని
హరియించువా రెవ్వ రాస్మృతి మనోజ్ఞతలు,
ప్రేమమంగళగీతికామధుర మ్మాచు
స్వర్ణసుందరమైన చక్కన్ని సుదినమ్ము. ఈయవే నాకొక్క-.

**రాజ**—ఈపాట ఎచ్చట నేర్చుకున్నావు సీతా!

**సీత**—మీరుపంపిన స్ట్రాండు మాగజైనులో పాటను నేను తెలుగుచేసాను బావా!

**రాజ**—ఆపాట నేను చూడనే లేదుసుమా! మాకు కోర్టులో వాజ్యాలాలు వఱవడి వ్రాయడంతోనే సరిపోతుంది కాలం. పద్యాలు పాటలు చదువుకొనే భాగ్య మెక్కడిది? నేటికి ఈశ్వరుడు నీయందనుగ్రహించి నీకు స్వర్ణసుందరమైన ఆసుదినం ఇచ్చినాడమ్మా!

**సీత**—అమ్మా! నే నీసంతోషం పట్టలేకుండా ఉన్నానే!

**మంగ**—మాఅందఱికి అలాగ్గే వుందే తల్లీ! ఏదీ కర్పూరం వెలిగించు! ఆస్వామి అనుగ్రహమును కొనియాడుకొందాము. ఆదయామయునకు ఆనందాశ్రువులకంటె మనమేమి అర్పింపగలము. (అని అందఱు కలసి ప్రార్థింతురు.)

నిదురింపగా మేము నిర్నిద్రుడై నీవు
జాలిమై మాదుగఃఖజాలము హరించేవు
కటికచీకటు లలముకాళరాత్రుల నీవు
విజ్ఞానకళికాళి వెలిగించెదవు తండ్రి. నిదురింపగా.

(తెర)

సమాప్తము.

---

# సంభాషణలో వచ్చు పాత్రలు.

| | |
|---|---|
| 1. రంగరాజు | ఒకబారిస్టరు |
| 2. సుభద్ర | ఆతనిభార్య |
| 3. నాగమ్మ | ఆతనితల్లి |
| 4. మంగమ్మ | ఆతనికూతురు |
| 5. సూరయ్య | ఆతనికొడుకు |
| 6. ఆనందస్వామి | ఒకసన్యాసి |

---

# ధర్మపథము.

[మదరాసులో రంగరాజుబంగాళాలో సాయంత్రం 3 గంటలవేళ. రంగరాజు పడకకుర్చీలో కూర్చుండి 'ఇల్లస్ట్రేటెడు న్యూస్ ఆఫ్ ఇండియా' చదువుకొనుచుండును. చెంతనున్న పేముకుర్చీలో సుభద్ర ఏదో అల్లుకొనుచుండును.]

**రంగరాజు**—అదిగో! మాయమ్మ ఏదో వార్త తీసుకవస్తున్నట్లుంది.

**సుభద్ర**—ఏవో, దేవుళ్లనో, దయ్యాలనో చెప్పుకొస్తుంది, ఆమెగారి కింకేమివార్త లుంటవి? ఆవూళ్లో దేవుడిమహిమవల్ల భక్తులరోగాలు కుదిరాయనో, మొక్కు చెల్లించని భక్తుణ్ణి ఈవూళ్లో దేవుడు నెత్తణిచాడనో, అక్కడ వూరికే పెరిగిపోతూన్న సంచిమెడమీద వాతలుపెట్టితే అదిమొదలు ఏళ్లేటా మెడనుంచి నెత్తురూ చీమూ కారుతూంటాయట అనో మొదలుపెట్టుతుంది. పూర్వాచారాలవిషయంలో ఆమెది అందెవేసినచేయి. మనమేదో కాస్త మాంసపుముక్క, సారాచుక్క పుచ్చుకొంటున్నందుకు ఎంత గోలచేస్తున్నదో చూడడంలేదూ మీరు? నానాటికి మీరు కూడా ఆమెగారి మాటలువిని ఆమెమతంలో దిగుతున్నట్టున్నారులెండి. మీకు బోధించడానికి ఎవళ్లెవళ్లో గోచిపాతరాయళ్లని తీసుకొచ్చి ప్రయోగిస్తున్నది. ఆబోధలన్నీ తలకెక్కి మీరు

క్లబ్బుకు తిన్నగా రావడం మానుకొన్నారుగదా. ఎప్పుడో తప్ప మధుమాంసాలు మూచూడడం లేదుగదా. ఇవ్వాళ్లయితేనేమి, రేపయితేనేమి మీరుకూడా ఆబిడగారితో పాటు కావడమే నిశ్చయం.

రంగ—తినబోతూ రుచులెందుకు, విందాం, ఏమి చెప్తుతుందో.

(నాగమ్మ ప్రవేశము. 52 ఏండ్ల విధవ. మడుగుదోవతి కట్టుకున్నది. పవిత్రమూర్తి.)

రంగ—ఏమిటమ్మా, విశేషాలు?

నాగ—ఆనందస్వాములవారిని మనయింటికి భిక్షకు పిలిచాను. దయచేస్తున్నారు.

సుభ—ఏమిభిక్షచేస్తారు సాములారికి?

నాగ—ఏవో, కలిగినంతలో పుష్పం, ఫలం యిచ్చి ఒకనమస్సు సమర్పించుకొంటాను.

సుభ—ఉహూం!

నాగ—నాయనా! ఆనందస్వాములవారు మంచి తెలిసినవాడు, మాటకారీనట. నీకు మల్లేనే ఇంగ్లీషు ధారాళంగా మాటలాడుతారట. మనపూర్వశాస్త్రాల్లోనూ, నేటి కొత్తశాస్త్రాల్లోనూకూడా మంచి అనుభవంగలవారు. ఆయనవల్ల నీ సందేహాలు తీర్చుకొని నువ్వు ఇంత ఆస్తిక్యబుద్ధికలిగి, ఈమధుమాంసాలు చప్పగా వర్జిస్తావని నాయాశ.

సుభ—సాములారు నవీనశాస్త్రాచారాలు తెలిసినవాడైతే మధుమాంసవర్జనం విషయంలో మొండిపట్టు ఒక్కనాటికీ పట్టరు.

మధునిషేధం మధునిషేధం అనడమేగాని అలా నిషేధించిన వారిలోనే నిగ్రహం తక్కువ. ఇక శాకాహారులు చేసే క్రూరకృత్యాలజోలికి మాంసాహారు లెన్నటికీపోరు. అయినా, మన కేమిటండీ! క్షత్రియుల కీమధుమాంసవర్జనం ఎక్కడ చెప్పివుంది? వర్ణాశ్రమధర్మాలు మానవలసిందని ఎంతటి మహానుభావులైనా బోధించరు. రాములవారు తిన్నారు కారా మాంసం? బలరాముడు మద్యం తాగలేదా? మన మెప్పుడో కాస్త చవిచూస్తే దోషమా! స్వాములవారు మాత్రం ఎలా కాదంటారు?

నాగ—ఈయన అందఱవంటివారు కారు. పూర్వాచారమైనా, దుష్టమైతే వదలవలసిందేనంటారు. నే చెప్పడ మెందుకు? అబ్బాయీ! నువ్వే మాట్లాడి చూస్తావుగా.

రంగ—సరే. నువ్వు భిక్షచేసినతరువాత వారి నిక్కడికి తీసుకురా. చూద్దాము.

నాగ—అంతకన్నానా! అదుగో! వారు రానే వచ్చారు.

(ముండితశిరస్కుడు, స్ఫురద్రూపి, కాషాయాంబరదండకమండలుధారి అయినస్వాములవారు 45 ఏండ్లవయస్సువారు ప్రవేశింతురు. స్వామిని చూడగనే సుభద్ర అభ్యంతరగృహంలోకి వెళ్లుతుంది. రంగరాజు కూడా లేచి తనగదిలోకి వెళ్లుతాడు. నాగమ్మ స్వామికి దండప్రణామంచేసి లోపలికి తీసుకువస్తుంది. దాది, మంగమ్మను సూరయ్యను తీసుకు అక్కడికి వచ్చివుంది. నాగమ్మ, స్వాములవారితో లోపలికి వెళ్లినతరువాత రంగరాజు మళ్లా వసారాలోకి వచ్చి తనకుర్చీలో కూర్చుంటాడు.)

నాగ—(స్వామికి పళ్లెంతో భిక్ష సమర్పించి) స్వామీ! ఈభిక్ష గ్రహించి అనుగ్రహించండి. (అని పిల్లలు, దాది, తాను దండప్రణామం చేస్తారు.)

ఆనం—నారాయణ! (అంటూ భిక్షను చేతితో అభిమంత్రించి కమండలువులో వేసుకొంటాడు.) నారాయణ.

నాగ—తమరు దయచేయడంవల్ల మేము ధన్యులమైనాము.

ఆనం—మనకు వసారాలో కనుపించిన స్ఫురద్రూపి, ఆకుఱ్ఱ వాడు మీకుమారుడా?

నాగ—చిత్తము.

ఆనం—ఆయనేనా లాయరుగారు. ఆచిన్నది మీకోడలేనా?

నాగ—చిత్తము.

ఆనం—(పిల్లలను చూపుచు) వీరు మనుమడూ, మనుమరా లూనా?

నాగ—చిత్తము.

ఆనం—(పిల్లలతో) మీపేరేమి బాబూ!

(మంగమ్మ, సూరయ్య తమపేళ్లు చెప్పుదురు.)

ఆనం—మంచిది. మీవయస్సో?

మంగ—నాకెనిమిదేళ్లు. మాసూరీడు కైదేళ్లు. మఱి మీరు తల నున్నగా చేసికొని, ఇటువంటిగుడ్డలు ఎందుకు కట్టు కున్నారో చెప్పరూ?

ఆనం—(మంగమ్మ వీపు తట్టుచు) నన్ను సన్న్యాసి అంటారు, తల్లీ! నీవెప్పుడు ఇటువంటిగుడ్డలు కట్టినవారిని చూడలేదూ?

మంగ—చూచాను కాని, వాళ్లంతా బిచ్చగాళ్లనుకొన్నాను.

నాగ—తప్పమ్మా! అట్లా అనరాదు. (మంగమ్మ భయపడి ఊరకుండును.)

ఆనం—(మంగమ్మ వీపు మరల తట్టుచు, నాగమ్మతో) కోప్పడకండి. ఆబిడ్డ తన మనసులో మాట ఉన్నదున్నట్లు అడిగింది. తప్పేమి? సత్యము నెప్పుడు అణచి పెట్టకూడదు. (మంగమ్మతో) తల్లీ! నేను కూడా బిచ్చగాడనే. చూడు మీ అవ్వ నాకు భిక్ష పెట్టింది. ఇదిగో నాజోలె. (కమండలువు చూపును.)

నాగ—స్వామీ! మా అబ్బాయి తమదర్శనం చేయాలన్నాడు.

ఆనం—ముఖ్యంగా. (అంటూ లేచును. పిల్లలను లోపలికి పంపి నాగమ్మ స్వామిని వసారాలోనికి కొనిపోవును. రంగరాజు ప్రత్యుత్థానంచేసి స్వామిని పేముకుర్చీలో కూర్చుండబెట్టును. నాగమ్మ లోపలికి వెళ్లిపోతుంది. రంగరాజు నమస్కారం, స్వామీ! (అని తనకుర్చీలో కూర్చుండును.)

ఆనం—నారాయణ.

రంగ—నేనొకసంవత్సరంనుంచి రామకృష్ణులవారి, వివేకానందులవారి గ్రంథములు చదువుతూంటే అనేక సంశయములు కలుగుతున్నవి. వానిని మీవల్ల తీర్చుకోవాలని కుతూహలం. ఎవటివారు అప్రియంగా వాదించినా మీరు సహించి సంశయనివారణం చేస్తారని విన్నాను.

**ఆనం**—బంగారం అగ్నిపుటంవల్ల పరిశుద్ధమైనట్లు, సత్యపదార్థం కూడా వాదప్రతివాదములవల్ల కాకలు దీఱి నిర్మలంగా ప్రకాశిస్తుందని నా అభిప్రాయం.

**రంగ**—బాగున్నది ఉపమానం. మఱి ప్రారంభిస్తాను. నేను విదేశములలో వుండి, అచటి మతములు విజ్ఞానములు, ఆచారములు, సంప్రదాయములు పరిశీలించినవాణ్ణి కావడంచేత మనపూర్వమతసంప్రదాయాదులను గూర్చి కొంచెం లాఘవంగా మాట్లాడడం నాకు అలవాటయింది. దానికి తమరు క్షమించాలి. బుద్ధిచేత విచారించి చూచేవాడికి, దేవుడున్నాడని నచ్చచెప్పటకేమైనా దాఖలా వున్నదా అని నా ప్రశ్న.

**ఆనం**—ప్రమాణబుద్ధిలేని నాస్తికుణ్ణి ఒప్పించడానికి ఏమీ దాఖలాలు లేవుగాని, దేవుణ్ణి ప్రత్యక్షంగా చూపలేకపోయినా, ఉన్నాడని అనుమానించడానికి తగిన కారణాలు అనేకంగా చెప్పవచ్చును. మనం బుద్ధితో ఆలోచించి చూస్తే ఒక్కవిషయం కనిపిస్తుంది. దేవుడున్నాడనేవారికీ, లేడనేవారికీ గూడా ముందు మనస్సులో దేవుడనే ఒకభావం ఉండి వుండాలి.ఆభావమే లేకపోతే వున్నాడనటం, లేడనటంకూడా సాధ్యంకాదు. 'దేవుడు లేడు' అనేవాణ్ణి మనం అడ్డుసవాళ్లు వేస్తే చివరకు, దైవపదార్థం తనకు తెలిసివున్నట్లు వప్పుకొంటాడు. మొదలు దేవుడంటే ఏమిటో తెలియకపోతే, ఉన్నాడనీ, లేడనీ ఎలా చెప్పగలుగుతాము? లేడనటంకంటె ఉన్నాడనటం చాలా సులభం. ఉన్నాడనే స్ఫురణ ఏమాత్రం లీలగావున్నా చప్పున ఉన్నాడని చెప్పవచ్చు. లేడనడానికి ఎంత నిశ్చయజ్ఞానము ఉండాలో ఆలోచించండి. కాబట్టి,

దేవుడు లేడు అని చెప్పడానికి ముందు దేవుడంటే ఏమిటో తెలిసివుండి అని అంగీకరించాలి. ఆలా తెలిసివుండడమే దేవుడున్నాడనేటందుకు దాఖలా.

రంగ—మీరు వట్టి మాటలతో మసి పూసి మారేడుకాయ చేస్తున్నారు. దేవుడున్నాడనేవారిమనస్సులో దేవుడంటే ఏమిభావముందో అది నాకు తెలిసివుండాలి అనేది తప్పు మన కిప్పు డేమిన్నీ రుజువుకాలేదు. భూతప్రేతాలు రాక్షసులు లేరని నేను అంటే ఆమాటవల్ల అవి అన్నీ వున్నాయని సిద్ధిస్తుందా? అవి ఉన్నాయని నేను ఒప్పుకొన్నట్లవుతుందా?

ఆనం—నేను మాటలతో గారడీ చేస్తున్నానని త్రోసివేస్తే కాదు. మీరు నిపుణంగా ఆలోచించండి. మనము, సాంత మనీ, అపూర్ణమనీ, సాపేక్షమనీ వ్యవహరిస్తున్నాము. అనంతము, పరిపూర్ణము, నిరపేక్షము అనేభావం మనమనస్సులో లేకపోతే ఆమాటల కర్థమే లేదు. అఖండమైన దొకటి లేకపోతే మనము ఖండమునెట్లా గుర్తిస్తాము చెప్పండి? ఇంకొకటి చూడండి. ఈవిశ్వము మనబుద్ధికి వేద్యమైనదిగా ఎంచుకొంటున్నాము. మనకు పరమాయువు నూరుసంవత్సరముల కంటె లేదు గదా. లక్షలకొలది సంవత్సరములనుంచి వుండి, లక్షలకొలది సంవత్సరము లింకా ఉండనున్న ఈగ్రహగోళముల రహస్యము మనకు తెలిసివుండాలంటే మనమనస్సులు ఆగోళములకంటె స్థిరతరములై ఉండి తీరాలి. ఈ అనంతమైన విశ్వము మనకంటె వేఱుకాదనీ, మనం దానిలో భాగమనీ, అది మనలో భాగమనీ, అది మనలోపల వెలుపల సర్వాత్మకమై వున్నదనీ మనకు సహజంగా ఒక భావం కలుగుతు

ఉంటుంది. అఖండము, అనంతము, పరిపూర్ణమునైన ఆపదార్థమే ఈశ్వరుడు. అవునాండి? ఇంకొక దాఖలా చూడండి! ఈజగత్తనే కార్యానికి ఒకకారణం ఉండి తీరాలి. చెట్టును బట్టి మనం విత్తనమును గ్రహిస్తాము. మనకు కనిపించే ఈజగత్తువల్ల కనుపించని కారణమునుకూడా అనుమానించి తీరాలి. ప్రతియంత్రానికి నిర్మాత, రక్షకుడు వుండాలి గదా! ఈ జగత్తనే అద్భుత యంత్రానికి కూడా సృష్టికర్త ఒకడు ఉండవద్దా? పోనీ, ఈజగత్తంతా మానవనిర్మితమా అంటే కాదాయె. కాబట్టి ఈజగత్స్రష్టయగు ఈశ్వరుడున్నాడని అంగీకరించాలి.

**రంగ**—అసలు సృష్టికర్త ఒకడు వుండితీరాలని మనమెందు కనుకోవాలి? అలా అనుకుంటే ఈశ్వరుణ్ణెవరు సృష్టించారు?

**ఆనం**—త్రికాలములయందు ఉండే ఈశ్వరునొకరు సృష్టించనక్కఱలేదు.

**రంగ**—అయితే ఈ జగత్తు కూడా త్రికాలములయందు ఉండేదేగనుక దీనికీ అక్కఱలేదు సృష్టికర్త.

**ఆనం**—జ్యోతిశ్శాస్త్రము ఒప్పుకొంటుందా, ఆమాట?

**రంగ**—నాకు తెలిసినంతలో, జ్యోతిశ్శాస్త్రము, మన చుట్టూ వున్న ఈయాకాశం అనంతమని బోధిస్తూవుంది. ఆయనంతాకాశంలో ఈనక్షత్రాలు అణువులవంటివి. మహాసముద్రంలో వుండే ద్వీపాలు ఆ సముద్రంతో పోలిస్తే ఎంత వుంటవి? కాబట్టి ఈగోళముల చుట్టూ నున్న శూన్యాకాశము అపరిమేయమని తోస్తుంది.

**ఆనం**—ఈజగద్యంత్రాన్ని నడిపే ఈశ్వరు డాకాన్యమంతట నిండి వున్నాడు. స్వయంభువు, స్వయంచోదకము అయిన యంత్ర మెచటనైనా కద్దా ?

**రంగ**—ఉండదు.

**ఆనం**—కాబట్టి ఈజగత్తుకంటె అతీతమైన మనస్సొకటి ఉండి దీన్ని నడపుతున్నదని యెంచడమే సబబుగా కనుపిస్తుంది. అందువల్ల అతీతవిషయములను ప్రస్తావించవలసి వస్తుంది. అతీంద్రియము నిత్యమునైన యీశ్వరపదార్థంచేతనే కాని మఱొకవిధంగా యీ ప్రపంచమును అర్థంచేసుకోలేము.

ఇక నేను చెప్పవచ్చే మూడో సబబేమిటంటే:—ఈ ప్రపంచకమును పరిశీలించి చూస్తే దీనికొక ప్రయోజన మున్నట్టు, ఇదియొక పరిణామం పొందుతూన్నట్టు కన్పిస్తుందే కాని గుడ్డెద్దు జొన్నను బడ్డట్టుగా కనిపించదు. జడమైన సృష్టినుండి క్రమంగా మనస్సు వికసించి మానవుడు ఆవిర్భవించడంచూస్తే దీనికింకా ఏదో పరిణామం, ఏదో క్రమం, ఏదో ఉద్దిష్టమైన ప్రయోజనం ఉండి వుండాలి. దాన్నే ఈశ్వరుడంటాము.

**రంగ**—పరిణామవాదానికి శాస్త్రత్వసిద్ధి వుంది. అది సర్వజనులు అంగీకరించేదే. మీరు దాన్ని సృష్టితో ముడిపెట్టుతున్నారు.

**ఆనం**—నేను చెప్పుతున్నది మీశుష్కపరిణామవాదాన్ని గుఱించి కాదు. అది లోపభూయిష్ఠమైన అతుకులబొంత. సరీసృపం, విహంగమెట్లా అయిందో, విహంగం చతుష్పాత్తు ఎట్లా అయిందో బోధించదు మీశాస్త్రము. కోతిలోనుంచి తద్భిన్నుడైన మానవు డెట్లా ఉద్భవించాడో చెప్పలేదు

మీాశాస్త్రం ఆలోపాన్ని సవరించి పూర్తిచేసేదేమిటో గ్రహించజాలక, సమాధానం దొరకనిఘట్టాల్లో అవసరపరిణామమంటూ దాటుకుపోయినారు. ఆమాట కర్థమే లేదు. ఆలోపమును సవరించే అవేద్యపదార్థమునకే ప్రకృతిశాస్త్రజ్ఞులు అలా పేరుపెట్టినారు.

ఇక నాలుగో సబబు వినండి. నేరగాండ్ర దగ్గఱనుంచి మానవులందరి మనస్సుల్లోను నీతి అనేభావంవొకటి వున్నది. మనకు గ్రాహ్యమైనంతవట్టు ఆనీతిపదార్థమును అనుసరించి దానికి కట్టుబడాలనే చూస్తున్నాము. మన మనస్సులలోని ఆధర్మప్రబోధమే దైవస్వరూపం. మహాత్ములైన ఋషులు కొందఱు పరమధర్మమును చేరాలనే ప్రయత్నంచేస్తున్నారు. వారంతా మానవోత్తములేగాని పామరజనం కారు. అట్టివారి ప్రయత్నములు అవివేకప్రయుక్తములు అని తోసివేయడానికి వల్లకాదు. ఆమహనీయుల పరమలక్ష్యం అనంతమునందు సిద్ధించేదేకాని యీాఇహమునందు సిద్ధించేదికాదు. కాబట్టి మనమనస్సులలోని ధర్మప్రబోధము, అవసరమైనదీ వివేకయుక్తమైనదీ అయినట్లయితే అదృశ్యజగత్తులో ఏస్వర్గంలోనో, కైలాసంలోనో, వైకుంఠంలోనే ఆపరమధర్మసిద్ధి కలుగుతుందని ఊహించాలి.

ఈసృష్టియందలి సౌందర్యమూ, ఐక్యమూ పరిశీలిస్తే ఈ కావ్యమును ఎవడో దివ్యుడైన కవి రచించినట్లు, ఈచిత్రమును ఎవడో దివ్యశిల్పి చిత్రించినట్లూ కన్పిస్తుంది. ఆశిల్పీ, ఆకవీ దైవమే నంటాను. ఇది ఐదవ కారణం.

వీటి అన్నిటికంటె ప్రకృష్టమైన ఆణివకారణ మేమి టంటే:—ఈ జగత్తులో ఉద్భవించిన రామకృష్ణాద్యవతార పురుషులు, మహమ్మదు, జోరాస్టరు, మోసెసు, క్రీస్తు మున్నగు మతకర్తలు, మొన్న మొన్న శ్రీరామకృష్ణుల వారు—అందరూ ఈశ్వరుడున్నాడని చెపుతున్నారు.

ఎన్ని చెప్పినా, కేవల మేధవల్ల ఎంత విచారించినా రుజువయ్యేది కాదు ఈశ్వరుని అస్తిత్వము. దానికి భక్తియే ఉత్తమమార్గము. మనస్సే సాక్షి. నేను నమ్ముతున్నాను అనేదే ప్రమాణము. మనం బుద్ధితో విచారించిచూస్తే, అట్టి నమ్మకము విరుద్ధమైనది కాదనీ, అది సంభావ్యమేననీ, ఇందు అనుభవవిరోధం లేదనీ మాత్రం తెలుస్తుంది. హంసలన్నీ వదలిపెట్టి పోయినా ఆసనస్సును విడువక కూర్చుంటుంది భక్తి అనే పరమహంస. సముద్రోదకంచేత సంధ్యారాగ దీప్తులు చల్లారినా భక్తిజ్యోతి చల్లారదు. మృత్యుదేవత కోరలను గూడా పెఱుకగల ఆభక్తిప్రభావం ఏమని చెప్పను! ఈశ్వరుడు సర్వశక్తుడు, సర్వస్వతంత్రుడు అని నమ్ముతుంది భక్తి. సాలీడు తనపొట్టలోనుంచి వచ్చిన తంతువులతో గూడు అల్లుకొని ఆగూటికంటె తాను వేఱై అవ్యయమై ఉన్నట్లుగా, ఈశ్వరుడు కూడా తనలోనుంచి వెడలిన యీసృష్టికంటె భిన్నుడై పూర్ణుడై వుంటాడని విశ్వసిస్తాడు భక్తుడు. ఈక్షరజగత్తులో అనంతరూపముల దాల్చిన ఈశ్వరుడు అక్షరుడు నిరాకారుడు అయివుంటాడు. మనము అనుకొనే గుణములకు దూరుడు పరమేశ్వరుడు. అణువులలో అణువతడు. మహత్తులలో అతడు మహత్తు

మురికిగుంటలో ప్రతిఫలించిన సూర్యునకు మురికి అంటనట్లే ఈశ్వరునకు గుణము లంటవు. అందఱిలోవున్న ఆపరమాత్మను ఎఱిగినవా రెందఱో లేరు. తాను నిత్యము తొక్కుతూవున్న తనపొలములో అడుగున వున్ననిధిని ఎఱుగని కాపువానివలె మనలోనున్న ఆపరమనిధానాన్ని తెలిసికోలేని పామరులం మనము. ఆపరమాత్మకు మనకుమధ్య పెద్ద అగాధముంది. ఆ అగాధం మీద కత్తివాయికంటె సన్నని వంతెన వుంది. ఆవంతెనమీదుగా చేరగలవాన్స్వామిని. స్వానుభూతిచే తప్ప బుద్ధిప్రమాణంచేత తెలియబడ డాపరమాత్మ. ఆజ్ఞానం, నీరిలో నీరువలె, గాలిలో గాలివలె, నిప్పులో నిప్పువలె ఆపరమజ్ఞానంలో లీనమై పోతుంది. లోపం మన జ్ఞానంలో వుందిగాని పరమాత్మలో లేదు. క్షేత్రగణితంలో చెప్పబడే బిందువువలెనే దేశకాలపాత్రములచే గాక పరమాత్మ నూహించలేము మనం.

**రంగ**—చిత్తము. తమ కట్టిజ్ఞానం కలిగినదా అండి?

**ఆనం**—కలుగకపోతే?

**రంగ**—మఱి తమరు నాకు ఈశ్వరతత్త్వ మెలా బోధింపగలరని సందేహం.

**ఆనం**—అదా సందేహము! రామకృష్ణులవారు చెప్పినట్లు—చీపురు మురికిగా ఉన్నా మురికిని తుడిచివేయ గలుగుతుంది.

**రంగ**—మఱి, వైజ్ఞానికులకు ఈశ్వరుడున్నట్లు, ఆత్మ అనేది ఉన్నట్లు ఎక్కడా దాఖలా దొరకలేదే?

**ఆనం**—వారికి దొరకక పోవచ్చును. మొదలు, జీవమనే పదార్థాన్ని వారు పట్టుకొన్నారా, నాకు చెప్పండి. ఇంకొక క్షణానికి ప్రాణి పోతుందనగాను, పోయిన ఒకక్షణానికి, శరీరతత్త్వంలో వారికి భేదమే గోచరించలేదు. అందుకని తన బిడ్డయో, పెండ్లామో పోయినపు డెంతటి వైజ్ఞానికు డైనా తృప్తిచెంది వూరకొంటాడా? కళ్లయెదుట నిర్జీవమై పడివున్న కళేబరాన్ని చూచి తనకొడుకే అని సంతోషించడ మెట్లా సాధ్యమౌతుంది? ఈవైజ్ఞానికుల పరిశోధన శాలల కందనిపదార్థము లెన్నో వున్నవి ఈభూమిలోను ఆకాశంమీదాను.

**రంగ**—అయితే మీరు జ్ఞానప్రచారం పనికిరాదంటారా?

**ఆనం**—ఒక్కనాటికి అనను. మతవిశ్వాసం కలవా రెవ్వరూ అట్లా అనరు. శ్రీకృష్ణభగవానులు 'ఈ విశ్వాసాన్ని జ్ఞానమే పవిత్రం చేస్తూవుంది' అన్నారు. మహమ్మదు తన అనుచరులను 'చీనా వెళ్లి జ్ఞానం సంపాదించుకోండి' అని ఆజ్ఞాపించాడు. బుద్ధదేవుడు కూడా నిర్మలజ్ఞానముయొక్క ఉత్కృష్టతను వేనోళ్ల పొగడారు. ఏసుదైవము, తనవారితో 'నాయనలారా! మీరంతా ఈశ్వరపదార్థములే నోయి. ఆసంగతి గ్రహించుకోండి' అన్నారు. ప్రాణికోటులు అన్నీ మృత్యువు పాలపడుతున్నవి. మృత్యువుకంటె సత్య మీజగత్తులో వేఱొకటి కన్పించదు. ఈవిషయం గ్రహించుకోలేక ఎందరో నాస్తికులై చెడుతున్నారు. ఆస్తికులనుకొనేవారిలోకూడా నిజమైన జ్ఞానం కలవారు చాలా కొద్దిమంది మాత్రమే. మేము గొప్పజ్ఞానుల మనుకొనేవారు కూడా మతములకు

ఆచారములకు దాసులై పరస్పరం తగవులాడుకొంటూ, ఇతరమతాలవారిని తమమతంలో కలపాలని తంటాలు పడుతూ, అందుకోసం అవసరమైతే రక్తపాతం కూడా చేస్తున్నారు. ఇంతకంటె అజ్ఞాన మేమైనా ఉంటుందా ?

రంగ—ఎందువల్ల ?

ఆనం—వీరందరూ, ఈశ్వరుడు సర్వశక్తుడనీ, సర్వజ్ఞుడనీ, సర్వమయుడనీ చెప్పనే చెపుతారు. ఈశ్వరుడు సంకల్పమాత్రం చేత ఎంతటికార్యమైనా చేయగలడనీ చెపుతారు. అటువంటి యీశ్వరు డిన్ని మతము లుండడానికి అంగీకరించినపుడు మధ్య వీరికెందు కీతగవులు ? తలచుకొంటే ఈశ్వరుడే చేస్తాడుగా జగత్తంతా ఏకమతంగా. కాబట్టి విశ్వంలో ఈభిన్నమతములూ వుండడం ఈశ్వరోద్దిష్టమని తెలుతూ వుంది. ఏకవర్ణమైన తివాచి, చిత్రవర్ణమైన తివాచి అంత ఇంపుగా వుండదు కంటికి. భిన్నభిన్నమతములనే రంగులతో వున్న తివాచీవంటిది ఈశ్వరునిమతం. ఈపృథగ్భావమును సహిస్తూవున్న ఆపరమేశ్వరునివిధానం మార్చడానికి ఈ అల్పజ్ఞులకు ఏమిపని ? వీరికేమి అర్హత వుంది ?

రంగ—అయితే యీ మతాలన్నిటికీ నిజమైనభేద మేమీ లేదంటారా ?

ఆనం—ఏమీ భేదం లేదు. శ్రీకృష్ణుడు, క్రీస్తు, బుద్ధుడు, కన్ఫ్యూసియసు, జొరాస్టరు, మోసెసు, మహమ్మదు మొదలైన మతకర్తలు ఏకత్ర కలసికొంటే పరస్పరం సంతోషంతో ఆలింగనసత్కారసంభావనలు చేసుకొంటారుగాని వారి అను

యాంయులకు మల్లే తలపట్లు పట్టుకొని పరస్పరం దుమ్మెత్తి పోసుకోరు.

**రంగ**—అయితే మనమంతా స్వమతాభిమానం లేకుండా సర్వ మతములను ఒక్కరీతిగా చూడవలె నంటావు ?

**ఆనం**—కాదు, సామాన్యులకు మతమనేది కన్నతల్లివంటిది. తన తల్లి అందంగాలేదని ఎవడూ తల్లిని విడనాడి అందంగావున్న ఇంకొకడితల్లిని ప్రేమించడు. తనతల్లిని ప్రేమిస్తున్న కారణం చేత ఎవ్వడూ ఇతరులతల్లులను ద్వేషించనక్కఅలేదు. నిందించ నక్కఅాలేదు. అలాగే అన్ని మతాలనూ గౌరవిస్తాడు. అన్ని మతాలనూ ఒక్కరీతిగా, చూడాలంటే సామాన్యులకు సాధ్యంకాదు. అందులో ఒక చిక్కుకూడా వుంది. అలా చూచేవాడి కేమతంమీదను విశ్వాసం కుదరక చివరకు మత హీనుడై భ్రష్టుడైపోతాడు. వెనుకటికి ప్లాటో అనేజ్ఞాని, ఆడవాళ్లనందఱినీ సమిష్టిసొత్తుచేసి, పిల్లలందరినీ మందికీ పుట్టిన పిల్లలుగా ఎంచుకోమన్నాడు. దానిమీద అరిస్టాటిలు, 'నిజమే, అటువంటిస్థితిలో, ఒకడికొకడు కొడుకు కావడం కంటె దూరపుజ్ఞాతి కావాలని కోరుకుంటాడు' అని చమత్క రించాడట. అలాగే సామాన్యగృహస్థులంతా తాము క్రిస్టియన్లమనో, హిందువులమనో, మహమ్మదీయులమనో చెప్పుకో గోరుతారుగాని అటువంటి మూకవుమ్మడి మతస్థ లుగా ఉండగోరరు. సుశిక్షితమైన సంస్కారంగల సన్యా సులకు మాత్రమే సర్వమతములను సమంగా చూడడం సాధ్యమవుతుంది.

రంగ—మఱి మనవాళ్లు మతాంతరవివాహ మంగీకరించక పోవడం, అన్యమతస్వీకారం చేసినవారిని అవిభక్తమైన తమ కుటుంబంలోనుంచి వెలిపెట్టడం న్యాయమేనా?

ఆనం—సామంగా అభ్యంతరంపెట్టడం న్యాయమేనంటాను. తమకులంయొక్క ఆచారములూ, సంప్రదాయములూ, ఆహారవిహారములూ సాంకర్యం చెందకుండా రక్షించుకోవడానికి వారలాచేయడం అవసరమవుతుంది. అంతమాత్రంచే ఇంకొక మతాన్ని, కులాన్ని ద్వేషిస్తున్నట్లు ఎంచుకోరాదు. ఎందువల్లనంటే:—కొబ్బరినూనె మంచిదే. నువ్వులనూనెయు మంచిదే. ఆరెంటినీ కలబోయ్యండి. రెంటిస్వరూపములు నాశనమౌతాయి. అలాగే మతానికీ మతానికీని. మహమ్మదీయ స్త్రీలకు, కొరాను,మతాంతరునితో వివాహం నిషేధిస్తూవుంది. క్రిస్టియనువనిత లన్యమతస్థులను పెండ్లాడుతూవుంటేమాన్పచూస్తారు సాధ్యమైతే. కాబట్టి ఈనిషేధాలు ఒక్కహిందువులమొఖానే వ్రాసిపెట్టి వున్నవని యెంచకండి. లోతు తక్కువపెట్టతే పఱుపు ఎక్కువవచ్చేమాట నిజమేకాని, చుట్టుప్రక్కల కసుమాలమంతా ఇంకిన లోతుతక్కువ నీటికంటె లోతున ఉండే నూతినీరే త్రాగడానికి యోగ్యంగా వుంటుంది. కాబట్టి వర్ణాంతరమతాంతరవివాహనిషేధం ఇతరమతద్వేషంగా తలపోయరాదు. ఎవరో ఒకర్ని పెళ్లికూతురు వరిస్తే తక్కిన మగవాళ్లందరిమీద ఆమెకు ద్వేషమని యెంచటం ఏమి సబబుగా వుంటుంది?

రంగ—చిత్తం. తమరు సగుణోపాసన మంచిదంటారా? నిర్గుణో

పాసన మంచిదంటారా? విగ్రహపూజనుగూర్చి మీఉద్దేశం సెలవీయండి.

ఆనం—ఇవన్నీ జ్ఞానసిద్ధికి మెట్లవంటివి. అధికారి తారతమ్యమునుబట్టి సాధనలలో తారతమ్య ముంటుంది. నిర్గుణపరబ్రహ్మమును ఉపాసించడం బాలురకు, అపరిణతబుద్ధులకు సాధ్యంకాదు. నిర్గుణబ్రహ్మమునుగూర్చి వారికి ఉపదేశం ప్రారంభిస్తే చెవిటికి పట్టిన శంఖమౌతుంది. కాబట్టి సత్యం, జ్ఞానం, సహనం, దయ మొదలైన కళ్యాణగుణములకు మూర్తులైన విగ్రహములను ఈశ్వరబుద్ధితో ఉపాసించడమే అట్టివారికి మేలు. వారికే కొంచెం జ్ఞానం కలిగినపిమ్మట 'నాయనా! ఈవిగ్రహాలు ఈశ్వరుడికి చిహ్నములవంటివి కాని నిజంగా ఈశ్వరుడు కాదు సుమా! ఇవి మనసు నిలపడానికి సాధనాలు మాత్రమే' అని చెప్పవచ్చును. ఇంకా ఒక మెట్టెక్కిన తరువాత, ఈశ్వరుడు సర్వవ్యాపి అనీ విశ్వమయుడనీ, విశ్వాత్ముడనీ, విశ్వరూపుడనీ, విశ్వాతీతుడనీ, సర్వశక్తుడనీ, ఈదేవాలయాలన్నిటిలోనూ ఉండే దేవుళ్లంతా ఆపరమాత్మయొక్క అనంతకల్యాణగుణమూర్తులనీ, ఆతడే అందరికీ తల్లీ, తండ్రీ, భార్య, బిడ్డలూననీ, ఇటువంటిభావములు చెప్పవచ్చును ఇంకా చివరమెట్టుమీాద ఈశ్వరుడు నిర్గుణుడని బోధింపవచ్చును. బడిలో పిల్లలకు భూగోళశాస్త్రం చెప్పేటప్పుడు ముందు భూమి గుండ్రగా ఉన్నదని బోధిస్తాము. తరువాత ఉత్తరదక్షిణధృవముల చెంత గుండ్రంగా ఉండదని బోధిస్తాము. అలాగే ఈశ్వరుని గూర్చిన జ్ఞానమున్నూ.

రంగ—ఈశ్వరుడు పరిపూర్ణుడైతే ఆతని యీసృష్టిలో లోపము లెందు కుండాలి ?

ఆనం—కొంచెం శాంతంగా ఆలోచించిన మహనీయు లెవ్వరికీ సృష్టిలో సవరించదగిన లోపములు కన్పడలేదు. ఎందువల్ల నంటే సర్వజగత్తుకు సౌఖ్యసంధాయకమైన సవరణ లేమిన్నీ లేవు

రంగ—ఆలా సెలవిస్తే కాదు. ఈసృష్టిలో పాములు, తేళ్లు, ఎలుకలు, పందికొక్కులు దేనికి చెప్పండి స్వామి ?

ఆనం—మనుష్యులకు వానివలన ప్రయోజనం లేకపోవచ్చు. కాని ఈసృష్టియంతా కేవలం మనుష్యులసౌఖ్యంకోసమేనా ! ఆజంతువులన్నీ వాటికొఱకే పుట్టినవి కాని మనకొఱకు గాదు. సృష్టియొక్క పరమప్రయోజనమున కివి యన్నియు సాక్షులు కావా ?

రంగ—ఈశ్వరుడు మొదటిలోనే మనుష్యుణ్ణి సృష్టించక ఈ వికృతజంతువులనన్నీ సృజించడం దేనికి ?

ఆనం—ఈశ్వరుని దివ్యలీలను ఆక్షేపించడానికి మనమెవ్వరం ? అనంతమైనసృష్టిలో మనుజుడు తన నిజస్థితి గుర్తెరగడానికే యిలా సృష్టి అయింది అనుకొంటాను. సృష్టికి మనుష్యుడే పరముడు కాడు. మనకంటె మహనీయులైన ఋషులు, దివ్యజ్ఞానులగు మహాత్ములు, దేవతలు, కారణజన్ములగు అవతార పురుషులు లేరా ? నీవు, పాములు తేళ్లు ఈసృష్టిలో ఎందుకని ప్రశ్నించినట్లే, ఆమహానుభావులు, ఈమనుజకీటములన్నీ యెందుకని ప్రశ్నిస్తేనో ? కాని వారు దివ్యబోధధనులు

కనుక అలా ప్రశ్నించరు. పాములు, తేళ్లు, పులులు, నక్కలు, కుక్కలు, గాడిదలవంటి మనుష్యులు నే డెందఱు లేరు సృష్టిలో? ఈజంతుకోటి అంతా ఆమనుజకోటికి టీకలవంటివి.

రంగ—చిత్తము. స్వామీ! సర్వశక్తుడగు ఈశ్వరుడు తన దేవాలయములను మ్లేచ్ఛులు నాశనం చేస్తూ వుంటే ఎందుకు సహిస్తాడు ?

ఆనం—వెనుక మహమ్మదీయులు కాళికాలయం నాశనంచేసి నందుకు చింతిస్తున్న రామకృష్ణపరమహంసకు ఆతల్లియే చెప్పినదట. ఈశ్వరుడు, తనపిల్లలు కొందఱు తనకు గుళ్లు కట్టి సంతోషిస్తూ వుంటే, మఱికొందఱు వాటిని పడకొట్టి వినోదిస్తూవుంటే తాను ఊరకే చూస్తూ వుంటాడు. ఎలెక్ట్రిసిటీని కొందఱు దీపంవెలిగిస్తే కొందఱు దిగలాగి చల్లార్చుతారు. ఎలెక్ట్రిసిటీకి తన్ను వెలిగించినందుకు సంతోషమా, చల్లార్చినందుకు విచారమా? విద్యుచ్ఛక్తికి దీపములెట్టివో ఈశ్వరశక్తికి దేవాలయములట్టివి. దీపాలు వెలిగించక పోతే విద్యుచ్ఛక్తి నశించనట్లే గుళ్లుపోతే దేవుడూ నశించడు.

రంగ—కొందఱు ఈశ్వరుడు దయాసముద్రుడంటారు గదా, నోరులేని పసిపిల్లలు చచ్చిపోతూ వుంటే ఈశ్వరు డెందుకు చూస్తూ వూరకొంటాడు ?

ఆనం—ఈశ్వరుడు దయాసముద్రుడూ అవును. సత్యస్వరూపుడూ, ధర్మస్వరూపుడూ అవును. కాబట్టి ధర్మబద్ధము సత్యబద్ధము అయిన ఆదయ మన అల్పజ్ఞానమునకు కాఠిన్యంగా కన్పిస్తుంది. అటన్నీ గాక పసిబిడ్డలకు చావు కష్టమని నీవెలా

చెప్పగలవు ? ఈ యైహికజీవనముకంటె వాళ్లకు పరలోకమే ఎక్కువ సౌఖ్యప్రదమేమో! శిశుమరణంచేత మనకు కలిగే దుఃఖము, శిశువుకు మరణంచేత బాధకలిగినట్లు ధృవపరుస్తుందా ?

రంగ—పోనీండి. మనకైనా అటువంటి వియోగములు దుఃఖములు ఎందుకు కలిగించాలి ? తనకింత నిర్ఘృణత ఎందుకుండాలి ?

ఆనం—ఏమో! మనకేమి తెలుస్తుంది ? ఇదంతా మనమేలు కోసమేనేమో. ఈ అనంతవిశ్వంలో ఒకమూల వున్న ఈమట్టి ముద్దలో ప్రాకులాడే ఈమనుజజంతువులకు, ఈమనుజరాక్షసులకు, ఈమనుజకీటములకు సౌఖ్యం చేకూర్చడం, మేలు చేయడం తప్ప ఈశ్వరునకు వేతే పనిలేదా యేమి ? మనకెందు కంత అహంకారం ? సత్యదూరము, అధర్మం, అమంగళం అయినదేదీ సర్వేశ్వరుడు చేయడని నమ్మి, అట్టిభక్తి జ్ఞానములతో కర్మాచరణం చేయడమే మోక్షసాధకం.

రంగ—ఈశ్వరుడు అలౌకిక ప్రభావసంపన్నుడని నమ్ముతారా మీరు ?

ఆనం—ఎందుకు నమ్మగూడదు ! అత్యద్భుతమైన మన మనస్సును సృష్టించగలిగిన దేవున కసాధ్య మేమి వుంటుంది! దూరదృష్టి దూరశ్రవణం మొదలైన అద్భుతకార్యా లెన్నింటినో మానవబుద్ధి సాధించింది నేడు. ఆ అద్భుతాలన్నీ మనం కళ్లార చూస్తున్నాము. అట్టి మానవబుద్ధితోపాటు ఈసమస్త జగత్తును సృజించిన ఈశ్వరుడు అద్భుతప్రభావుడు కావడం

ఒకవింతా ? చచ్చినవాళ్లకు ప్రాణమివ్వడం, పతితులను ఉద్ధరించడం, తనకళా లేశమును యావత్ప్రపంచమునా నింపిన్నీ తాను పరిపూర్ణుడుగా ఉండడం, ఇవన్నీ ఆపరాత్పరునకు క్రీడామాత్రములు.

రంగ—తన అంశము కొంత పంచియిచ్చి కూడా ఈశ్వరుడు పూర్ణుడుగానే వుంటాడంటే గణితశాస్త్రజ్ఞులు నవ్వుతారు స్వామీ !

ఆనం—నిజమే. మానవగణితాని కది అసాధ్యమే. మన గణితాలనుమించిన యీశ్వరగణిత మొకటి వున్నదని మనం గ్రహించవలసి వుంటుంది. పూర్వం క్రీస్తుదైవం, అయిదు రొట్టెముక్కలతోను రెండు చేపలతోను అయిదు వేలమందికి సంతర్పణచేయగా, ఇంకా పదకొండుబుట్టల పదార్థం మిగిలిపోయింటట. ఎలా మిగిలిందో చెప్పగలరా, మీగణకు లెవరైనా ? మీగణితజ్ఞులకంటె లాయర్లు చాలా మెఱుగు. ఎందువల్లనంటే,—నూటికి నూటపది అని అర్థం చెప్పగలరు వారు. వేయి అనే సంఖ్యావాచకానికి, ఆయా ప్రాంతాలలో ఆచారాన్నిబట్టి వేయికంటె ఎక్కువసంఖ్య అని కూడా అర్థమవుతుందని కోర్టులలో తీర్పులు పుట్టివున్నవి గనుక, లాయర్లట్లా అర్థంచేసుకోగలరు. మనదేశంలో అనేకమంది యిల్లాండ్రకు కూడా తెలుసునే యీలెఖ్ఖ. పళ్లు కొనేటప్పుడు, పిడకలు కొనేటప్పుడు, నూరంటే,—నూటైదు, నూటపది అని కూడా వాళ్లకు అర్థం తెలుసు. ఈలాయర్లకు, పిడకలు కొనేవాళ్లకు వున్నమాత్రం తెలివి లేదంటారా, భగవంతుడికి ! పైగా మీగణితశాస్త్రం -4 ను, -4 తో గుణిస్తే +16 అవు

తుందని చెప్పుతుంది గదా! ఇది యెక్కడనైనా కద్దా? కొత్త అప్పులుచేసి పాత అప్పులు తీర్చినవాడు ఋణవిముక్తుడు కావలసి వస్తుందే యీలెక్కప్రకారం! పాపాన్ని పాపం చేత గుణిస్తే పుణ్యం కావడం కద్దా యెక్కడైనా? అప్పును అప్పుతో గుణిస్తే ఆదా అవుతుందా చెప్పండి! ఇటువంటి గణితాలన్నీ నిజమని నమ్ముతారుగాని, పూర్ణంలోనుంచి కొంత తీసివేసినప్పటికీ పూర్ణత్వహాని కలగదని నమ్మలేరు. ఇంతలో వుంది మనమానవగణితాలసారం! కాబట్టి, యీ మానవగణితములే కేవల సత్యములని నమ్మబోకు. వెనుకటికి, నీవంటివాడే, గణితశాస్త్రజ్ఞుడొకడు, మూడు రెండూ కలిపితే అయిదే అవుతుందిగాని యీశ్వరుడు కూడా దాని నాలుగా చేయలేడన్నాట్ట! చూచావా, యీ అవివేకం! పిడకలుకొనేవాళ్లు నూటిని నూటైదు చేయగలిగినప్పుడు, ఈశ్వరుడు అయిదు నాలు చేయలేడూ? కాబట్టి, ఆత్మప్రత్యయంలేని నేటి దురభిమానులకు ఈశ్వరమహిమ మెలా అర్థమవుతుంది? దీనికి తోడు వార్తాపత్రికలు కూడా తోడై మనలను క్రిందికి దిగలాగివేస్తున్నవి. భూకంపం వంటివి మహానగరాలను భూమిలో పూడ్చిపెట్టగా, సముద్రంలోనుంచి పొడుచుకొనివచ్చిన భూఖండం హిమాలయ పర్వతములైపోగా, మహామహిముడైన భగవంతు డేమి చేయలేడో ఆలోచించు. ఈభూకంపాదులన్నీ ఆయనఘుని సాధనలేశములు కావూ?

**రంగ**—అయితే, మనం యీశ్వరప్రభావమును నమ్ముకొని వుండవలసిందేనా?

ఆనం—అట్లా పనికిరాదు. మన ప్రయత్నం మనం చేస్తూ వుండవలసిందేగాని ఈశ్వరమహిమనే నమ్ముకొని గ్రుడ్లు మిటకరించుకొని కూర్చుండరాదు. నీ అవసరములకు, నా అక్కరలకు ఆదుకొని తన ప్రభావం చూపెట్టడానికి ఈశ్వరుడేమి గారడివాడా? ఆపరమాత్ముని దివ్యచిత్తములో ఏమి వుందో, అది యెప్పు డెలా సంకల్పిస్తుందో మనకు తెలియరాదు. కాబట్టి నీ ప్రయత్నమును విడనాడి ప్రయోజనం లేదు. నేల విడిచినసాము కద్దా! పురుషకారం చేస్తూనే, ఈశ్వరవిలాసమును మనసా నమ్మి వుండు.

రంగ—మానవులు కూడా అణిమాదిశక్తులు సంపాదించి కొన్ని కొన్ని మహిమలు చూపెట్టగలరేమో?

ఆనం—ఆహా. అట్టిమహిమ సంపాదింపవచ్చును, గాని వానివల్ల మనకు గలిగే ప్రయోజన మేమీ కనిపించదు. ఈయర్థమును తెలియజెప్పే యితిహాస మొకటి చెప్పారు శ్రీరామకృష్ణుల వారు. వెనుక నొక బుద్ధిమంతుడు సంసారం త్యజించి అడవులను కొండలను బట్టుక తిరిగి, పంద్రెండేండ్లు నానా అగచాట్లు పడి చివరకు జలస్తంభనం, ఏనుగులను చంపి మళ్లా బ్రతికించే మంత్రమహిమం సంపాదించి తిరిగివచ్చి తనవారికందరికి తన ప్రజ్ఞలు చూపెట్టాడట. అపుడు వారందఱు నవ్వి, "నాయనా! పన్నెండేళ్లు కష్టించి యిదా నీవు సాధించినవిద్య! నీవు ఏనుగుల్ని చంపి, మళ్లా బ్రతికించావనుకో నీమంత్రబలం చేత; దానివల్ల నీకుగాని మాకుగాని ఏమిటి ప్రయోజనం? అణాడబ్బులిస్తే పల్లెవాడు ఏరుదాటిస్తాడే, ఈభాగ్యానికి నీవు జలస్తంభనం నేర్చుకురావడ మెందుకు? ఆపల్లెవాడికి

వచ్చే అణాడబ్బులు చెడగొట్టడం తప్పితే దీనివల్ల ఏమిటి ప్రయోజనం? పన్నెండేళ్లు పాడుచేసుకొన్నావే నిష్కారణంగా ఇది యేమి బ్రహ్మవిద్య సాధించినట్లా!" అన్నారట. ఆమాటలకు సిగ్గుపడి, అంతటితో మంత్రాలు తంత్రాలు మాని, ఈశ్వరచింతనంచేసి, ఆత్మబోధం సాధించి, లోకారాధనం చేసాడట.

**రంగ**—తనకోఅ కేర్పడిన లోకంగదా యిది; దీన్ని మానవుడు ఆరాధించడ మెందుకు?

**ఆనం**—సమస్త జీవలోకంకోసం యేర్పడ్డ జగత్తు, తనకోస మేర్పడ్డదని మానవుడు తలచటం పొరపాటు. తన అల్పత్వం గుర్తించుకోలేక మానవుడు, నోరులేని పశుపక్షులను చేపలను తిన మరిగి, అవియన్నీ తనపొట్ట నింపటానికే పుట్టినవనుకొంటున్నాడు. అయహంకార మంతటితో ఆగక, బ్రాహ్మణులు యూధులు చైనీయులు గ్రీకులు రోమనులు ఆంగ్లో సాగ్జనులు,—వీరంతా, ఈశ్వరుడు, తక్కినజాతుల నన్నింటినీ తమకోసమే సృజించాడని తలపోయడం తటస్థించింది. వారిలో కూడా, మతీ మొనగాళ్లనిపించుకొన్న అలెగ్జాండరు నెపోలియన్లవంటివాళ్లు ఈవిశ్వమంతా తమదేనని గర్వించారు. నిజానికి, జ్ఞానియైనవాడు, విశ్వమంతట ఈశ్వరుణ్ణి, ఈశ్వరునందు సమస్త విశ్వాన్ని దర్శించుతాడు. విశ్వాత్ముడైన ఈశ్వరుడు విశ్వాతీతుడని కూడా గ్రహిస్తాడు. కృష్ణభగవానులు గీతలలో ఈవిషయాన్నే బోధించారు.

**రంగ**—అయితే మనుష్యులందరు సమానులేనంటారా మీరు?

**ఆనం**—సమానులంటే ఎందులో? శరీరంచేత, మనస్సుచేత, నీతిసంపదచేత కొన్ని భేదములు పుట్టుకలోను అన్యసందర్భములలోను వచ్చి తీరుతవి. పూర్వజన్మసంస్కారంచేత కలిగే ఆభేదములు తప్పవు. అవిగాక పురుషకారంచేత వచ్చే భేదములు కూడా వుంటవి. అందఱూ కవులు గాయకులు కావాలంటే కారు. అంతేకాని ఈశ్వరదృష్టిలో భేద మేముంటుంది? ఈశ్వరానుగ్రహానికి పాత్రులై బంధముక్తులు కావడానికి అర్హత అందఱికీ వుండనే వున్నది.

**రంగ**—అందఱికీ అర్హత, సమానావకాశాలు వుంటే యీజాతి భేదా లెందుకు?

**ఆనం**—తిన్నగా ఆలోచిస్తే ఈజాతిభేదాలు కూడా మానవ సమానత్వానికి విరోధములు కావు అని తేలుతుంది. బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులు, బ్రహ్మయొక్క ముఖబాహూరు పాదములనుండి పుట్టినట్లు చెప్పినప్పటికి, శరీరంలో ఒక అవయవంకంటె మరొకటి అధికమని చెప్పడానికి వీలులేదు గనుక ఈనాల్గుజాతులలో న్యూనాధిక్యతలు చెప్పడానికి వల్లకాదు. ఈజాతివ్యవస్థ ఏర్పడినప్పటినుంచి నేటివఱకు బ్రాహ్మణులు వాక్కుచేత, క్షత్రియులు బాహువీర్యంచేత శోభిస్తున్నారు. అట్లాగే వైశ్యులు కూడా,—బనియాలు, మార్వాడీలు, కోమట్లు, సేటులు, నాటుకోట్లు అని ఎన్ని భేదములున్నా—అందఱు తమధనబలంచేత, శరీరానికి తొడల మాదిరిగా, మందికి ఆధారభూతులుగా వుంటున్నారు. అధికసంఖ్యాకులైన శూద్రులు యావన్మందికి జీవనాధారులై, శరీరానికి పాదములవలె లోకయాత్రకు సాధనమవు

తున్నారు. ఏదేశంలోనైనా, సత్యస్వరూపుడైన ఈశ్వరుణ్ణి తెలుసుకోదలచినవారు, ఐహికసౌఖ్యములు భోగములు విడనాడవలసివుంటుంది. వారే బ్రాహ్మణులు. అట్లే శిష్టరక్షణ దుష్టశిక్షణాలు చేసే వీరులే నిజమైన క్షత్రియులు. కృషి వాణిజ్యములచేత న్యాయ్యంగా అర్థార్జనంచేసి దేశాన్ని ఐశ్వర్యవంతంగా చేసేవారే వైశ్యులనిపించుకొంటారు. ఈమూడుతరగతులవారిసాహాయ్యంతో సలహాతో ఆయా కార్యములయందు ప్రవర్తింపచేయబడే సామాన్యజనులే శూద్రులనిపించుకొంటారు. కాబట్టి ఏదేశంలోనైనా సహజంగా కనపడే యీజాతివిభాగంలో దోషమేమీ లేదు. కాకపోతే, మనవాళ్లు ఆయీజాతులప్రధానగుణములు సాంకర్యం చెందకుండా కాపాడేనిమిత్తం చేసినప్రయత్నాల వల్ల న్యూనాధిక్యతలనేదోషం వచ్చి పడింది. అంతేకాని మందికి ఉపయోగించడంలో ఒకరియెక్కువ ఒకరితక్కువ యేమీలేదు. శరీరంలో పాదములుచేసే పనికంటె ముఖంచేసే పని కాని, తొడలుచేసే పనికాని అధికమనడానికి వీలులేదు. పరస్పర సహకారంతో ఈనాలుగవయవములు తమపని తాము నిర్వర్తించితే ఈసంఘమనే శరీరం ఆరోగ్యంగా వుంటుంది. ఇందులో ఎవరు భీష్మించుకొన్నా తక్కినవారి ఆట కట్టుతుంది. అప్పుడు శరీరంతోపాటు భీష్మించిన భాగం కూడా నశిస్తుంది. శూద్రుడు పోషణభారం వహించడం వల్లనే బ్రాహ్మణునకు బుద్ధిబలము తద్వ్యవసాయానికి తీరిక లభిస్తున్నది. క్షత్రియుడికి బాహుబలం కూడా శూద్రుడే సంపాదించి పెట్టుతున్నాడు. వైశ్యుని వ్యాపారానికి

శూద్రుడే ద్రవ్యమును ఉత్పత్తిచేసి యిస్తున్నాడు. అలాగే శూద్రుడు ఉత్పత్తిచేసిన పదార్థాన్ని వైశ్యుడందరికి అందుబాటులోకి తీసుకవచ్చి యిస్తూ, మిగిలినదానితో వ్యాపారంచేసి ధనము సంపాదిస్తాడు. క్షత్రియుడు శూద్రుని సేద్యమును వైశ్యుని వ్యాపారమును రక్షించి అందఱికి ధన మాన ప్రాణరక్షణ చేస్తున్నాడు. ఈకాయకష్టమేమీ లేక పోవటంచేతనే బ్రాహ్మణుడు పరలోకవిచారమున కవసర మైన తీరిక, విషయవైముఖ్యం సంపాదించుకొని, తాను కను గొన్న జ్ఞానధనమును అందఱికి పంచిపెట్టి అందఱికీ మన శ్శాంతిని ఈశ్వరభక్తిని కలిగిస్తున్నాడు. ఇట్లా ఆయా వృత్తులలో వారువారు సంపాదించిన అనుభవమును కౌశల్య మును రక్షించడానికి శాశ్వతమైన యేర్పాటుచేస్తే సంఘా నికి శ్రేయం కలుగుతుందని పూర్వులు అభిప్రాయపడ్డారు. కొంతకాల మీయేర్పాటు సవ్యంగానే నడిచింది. ఇంతలో విదేశీయులు మనమీద దండెత్తి రావడం మనదేశాన్ని జయించడం జరిగింది. అన్యమతాచారములతో మనకు సంపర్కం కలిగింది. మనలనైతే జయించారుకాని శత్రువులు మన మతాన్ని జయించలేదు. అందువల్ల మనం వారిలో కలసిపోలేదు. వారున్నూ మనలో కలసిపోక విడిగానే వుంటున్నారు. ఈభిన్న నాగరకతల సంఘర్షణంవల్లను, మన జాతివ్యవస్థలో వున్న రహస్యమెఱిగి రక్షించే ప్రభువు లేకపోవడంవల్లను మనవ్యవస్థ తారుమారై పోయింది. ఆయావర్ణముల ప్రత్యేకగుణములు సంఘమునకు ఉపయోగ పడడం మానేసి ఆత్మకే ఉపయోగపడడం ఆరంభమై

క్రమంగా వర్ణవ్యవస్థగడ్డకట్టుకుపోయి నిర్జీవమై వూరుకొంది. సరియైన రక్షచేసి ప్రవర్తింపజేసే ప్రభువుంటే ఈవైపరీత్యం కలిగేది కాదు. ఈవ్యవస్థ యిప్పుడంటే యిలా గడ్డకట్టుకుపోయిందికాని పూర్వం దాశకన్యకుపుట్టిన వ్యాసుడు, నీచ క్షేత్రసంజాతులైన వశిష్టపరాశరాదులు, జారిణీసుతుడైన సత్యకాముడు బ్రాహ్మణులకు పరమపూజ్యులు కాలేదా? స్వామ్యరక్షణంకంటె, విధ్యుక్తధర్మరక్షణమే యెక్కువగా చూచుకొన్నారు మనపూర్వులు. వివాహం కేవల కామ నిర్వాహణార్థం కాకుండా ధర్మసాధనంగా చేసారు. ధర్మార్థ కామాలకు పరస్పర విరోధం మాన్పి మూడింటినీ మోక్ష సాధనంగా చేసారు. నేడు మనం ధనంకొఱకు చేసే సేవా వృత్తి కూడా పూర్వులకు ధర్మాచరణబుద్ధితో చేసారు. ఇటువంటి మహాశయములుగల మనధర్మం ఇతరదేశధర్మాల కెందును తీసిపోదు సరికదా, ఏనాటికైనా ప్రపంచ మంతటి చేత పరమధర్మంగా శిరసావహించ బడుతుంది.

**రంగ**—మఱి యింతాకరానివాళ్లు, చూడరానివాళ్లు, చెప్పరానివాళ్ల సంగతేమంటారు ?

**ఆనం**—ఈనిషేధాలను పాటించేవాళ్లు ఈశ్వరునకు తాకరానివాళ్లు చెప్పరానివాళ్లూ అవుతారు, అంతే.

**రంగ**—అస్పృశ్యులు పూర్వజన్మాలలో చేసినపాపఫలమే నంటారే యిదంతా ?

**ఆనం**—కావచ్చును. కాని సవర్ణులీనిషేధాలను పాటించి తాము పాపకర్ములు కానక్కఱలేదు.

**రంగ**—మొద లీకర్మవాదమే మనల నలసులనుచేసి అధోగతి పాలుచేసింది. మన యీకర్మవిశ్వాస మన్యులకు అపహాస్య భాజనమై పోయింది. ఒకగుడ్డివా డున్నాడనుకోండి. వాణ్ణి, 'నీకర్మం, పూర్వ మెన్నడో పాపంచేశావు. దానిఫలం అనుభ విస్తున్నావు, పో' అనడం ఎంతఘోరమో ఆలోచించండి.

**ఆనం**—నిజమేకాని, గ్రుడ్డివానితో, 'నీకర్మం పో' మ్మని నువ్వెం దుకనాలి ? 'నాయనా ! నాకీగ్రుడ్డితనం ఎందుకు సంభవించిం' దని వాడు నిన్నడిగాడా ? అడిగితే నీకు తోచినయథార్థం చెప్పవలసిందే. 'అప్రియమని యథార్థం దాచవద్దు. ప్రియ మని అయథార్థం పలుకవద్దు' అన్నాడు మనువు. పూర్వ జన్మఫలం కాకపోతే వాని కాగ్రుడ్డితనం ఎందుకు రావాలి? బుద్ధిపూర్వకంగా గ్రుడ్డివాడవుతాడా ఎవడైనా ? పోనీ, ఏతండ్రియైనా గ్రుడ్డిసంతానం కావలెనని కోరుతాడా ? మనవశమైతే గ్రుడ్డితనం తప్పించుకోవాలనే చూస్తాం. కాని మనం కర్మవశులం కావడంచేత తప్పించుకోలేకపోతున్నాము. కర్మవశుల మైనంతమాత్రంచేత మనమేమైనా అస్వతంత్రు లమా అంటే, అస్వతంత్రులమూ కాము. సంచితకర్మాన్ని తొలగదోయడంచేత కాదుగాని ప్రారబ్ధవిషయంలో మనం స్వతంత్రులమే. సంచితకర్మానుసారం దరిద్రకుటుంబంలో పుట్టినా ప్రారబ్ధంచేత లక్షాధికారులం కావచ్చును. కాబట్టి కర్మవాదం మనకు నిష్క్రియత్వం బోధించడంలేదు. సంచిత విషయంలో మాత్రం స్వతంత్రం లేదని చెప్పుతూ వుంది. ఈకర్మవిపాకంతో జ్యోతిషాన్ని ముడిపెట్టి, ఈజన్మాంతం వఱకు మనకు కలుగబోయేఫలములు ముందే నిశ్చయించు

కొని, 'మనకర్మ మిక ఇంతే' అని నిష్క్రియత్వం వహించి వెఱ్ఱివైరాగ్యం అవలంబించడ మనేదోషం మనది కాని కర్మవాదానిది కాదు.

రంగ—మీరు చెప్పేది నిజమే కావచ్చునుగాని, ఈజగత్తంతా మిథ్య అనీ, మాయాకల్పితమనీ చెప్పేశుష్కవేదాంతం మనలను నాశనం చేస్తున్నది.

ఆనం—జగత్తు భ్రాంతికల్పితమని చెప్పే మతమొకటి ఉన్నమాట సత్యమే.-కాని, వారైనా,-ఈశ్వరపదార్థ మొక్కటే పరమసత్యమనీ, జగత్తుకు వ్యవహారసత్త వున్నప్పటికీ అది సాపేక్షమనీ, దానిని భ్రాంతికల్పితంగా తెలుసుకోవడమే పూర్ణజ్ఞానమనీ చెప్పుతున్నారు. చూడండి! మనం కలగంటున్నంతసేపూ సత్యంగానే వుంటుంది. మెలకువ కలిగిన తరువాత మాత్రం అది భ్రాంతి అని తెలుస్తుంది. మేలుకోకుండా వున్నంతసేపూ కల సత్యం గాదని యెవరంటారు? అలాగే, మనం అజ్ఞానులంగా వున్నంతసేపూ జగత్తు సత్యమే. కేవలసత్యమైన ఈశ్వరజ్ఞానం కలిగినతరువాత కూడా జగత్తు సత్యమని ఎట్లా అనగలం? అప్పుడు జగత్తును భ్రాంతికల్పితంగా గ్రహిస్తాం. ఈవాదాన్ని బొత్తిగా తోసివేయడానికీ వీలులేదు. మీతత్త్వజ్ఞులు నేటికి గూడా జగత్తత్త్వం గ్రహించలేక అది జడమనీ మనస్సనీ తలపట్లు పట్టుకొంటున్నారు. శాస్త్రపరిశోధకులు తఱచిన కొలది, ఎలెక్ట్రాను, ప్రోటాను సిద్ధాంతములు బయటబడి జడవాదులకు దిగ్భ్రమ కలిగిస్తున్నవి. కాబట్టి, జగత్తే సత్యమని ఎలా నమ్మగలం?

రంగ—మీరింతకు, ద్వైతులా, అద్వైతులా?

ఆనం—నేనైతే అద్వైతినే గాని, త్రిమతములవారు కూడా పూర్ణసత్యముయొక్క ఒక అంశమును మాత్రమే పట్టుకొన్నారని నా అనుభవం. శరీరవిస్మృతికలిగే పరవశస్థితిలో మనమంతా అద్వైతులంగానే తలుస్తాము. విషాదావస్థలో మాత్రం ద్వైతులం. సామాన్యస్థితిలో విశిష్టాద్వైతులం. ఈమూడుమతములలో ఏది యెక్కువది అనే కొట్లాటతో వేదాంతులకేగాని మనకు బనిలేదు. మూడు సమభుజములు గల త్రికోణములో, ఏభుజం ఆత్రికోణ పూర్ణస్వరూపాన్ని బోధిస్తుంది అంటే అది తేలేవాదం కాదు. సత్యస్వరూపం పూర్ణంగా గ్రహించడానికి మూడుమతములు అవసరమే. భక్తిజ్ఞానకర్మమార్గములలో ఏది యెక్కువంటే ఎలా నిర్ణయిస్తాము?

రంగ—అయితే భక్తిజ్ఞానకర్మమార్గములలో పరస్పరవిరోధం లేదనే అంటారా?

ఆనం—ఆహా! లేదనే అంటాను. ఎందువల్లనంటే, మోక్షసిద్ధికి ఈమూడుమార్గములు కూడా అవసరమే. ఈమూంటిలో ప్రధానమైనది భక్తి. కర్మజ్ఞానములు రెంటికి అది ఆధారం. భక్తిలేనివానికి జ్ఞాన మెక్కడనుంచి వస్తుంది? జ్ఞానదాతయైన గురువుమీద భక్తిలేకపోతే కుఱ్ఱవానికి చదువురాదు. గురువు తన్ను సన్మార్గమునకు తీసుకపోతున్నాడనే విశ్వాసముంటేనే ప్రయోజనంకాని, తన్ను వంచిస్తున్నాడని అనుకొంటే ప్రయోజనముండదు. గురువును విశ్వసించినట్లే తోడిమాన

వులను విశ్వసించాలి. ఆత్మవిశ్వాసం కూడా వుండాలి. అట్టి విశ్వాసం కలవాడే భక్తుడు. జ్ఞానసౌధ మెక్కాలంటే భక్తి అనే నిచ్చెనవల్లనే ఎక్కవలసి వుంటుంది. అట్లాగే కర్మాచరణం చేసేటప్పుడు కూడా దానిప్రయోజనమును గూర్చి విశ్వాస ముండి తీరాలి. ఆకర్మ మట్లా జ్ఞానసహితమైతేనేకాని మోక్షసాధకం గాదు. కాబట్టి భక్తిపూర్వకమైన జ్ఞానంతో చేసే కర్మవల్లనే మోక్షం లభిస్తుందని చెప్పారు కృష్ణపరమాత్మ. కాబట్టి భక్తిజ్ఞానకర్మలు మూడూ మూడుమెట్లు. ఈశ్వరప్రీతికరమైన ప్రతికర్మా భక్తిజ్ఞానసహితమై వుంటుంది. కాబట్టి జ్ఞానరహితమైన హింసాత్మకకర్మలవల్ల, భక్తిశూన్యమైన ప్రార్థనాదులవల్ల మోక్షం దొరకదు. ఎంతభక్తి వున్నా, జ్ఞానమెంతవున్నా, ఆభక్తి జ్ఞానములతో కూడిన కర్మాచరణం లేకపోయిన మోక్షం దొరకదు. కాబట్టి భక్తిక్షేత్రంలో జ్ఞానజలం నింపి కర్మబీజం నాటితే మోక్షసస్యం లభిస్తుంది. శరీరధారణంతో అవసరమున్నంతవఱకు కర్మాచరణ మవసరమే అవుతుంది. జనకుడు శ్రీకృష్ణుడు మొదలైన విదేహముక్తులు కూడా లోకసంగ్రహార్థం కర్మాచరణం చేయనే చేసారు.

రంగ—చిత్తం. మధుమాంససేవనుగూర్చి కూడా తమ అభిప్రాయం సెలవియ్యాలి.

ఆనం—మధుమాంససేవ కూడదనే నా అభిప్రాయం.

రంగ—మనది ఉష్ణదేశం కావడంచేత, మనం శాకాభక్షకులం కావడంచేత పరులకు లొంగిపోయినామని అభిప్రాయపడుతున్నారే గొప్పగొప్ప చరిత్రకారులు.

ఆనం—(నవ్వి)గొప్పగొప్పచరిత్రకారులంటే నాకునవ్వొవస్తున్నది. పరాధీనత అనేపాపం మనఒక్కదేశంలోనే బ్రద్దలయిందా? మధుమాంససేవనంచేసే దేశాలన్నీ ఎప్పుడో ఒకప్పుడు పరాధీనం కాకుండా వున్నవా ? ఇంతకు, మన యీపరాధీనత ఎంతకాలంనుంచి? మనకంటె కూడా దీర్ఘకాలం పరాధీనతలో పడివున్న దేశాలమాట యేమిచెప్పుతారు ? మనదేశంమీద యిన్ని దండయాత్రలు జరిగినప్పటికీ, మన సంప్రదాయాలు ఆచారాలు చెక్కుచెదరినవేమో చూడు. మనదేశమును జయించిన శత్రువులు మన యీపురాతన నాగరికత నేమైనా లోపింపజేయగలిగారేమో ఆలోచించండి. తాము అడిగిడిన చోటసల్లా దానిపూర్వస్వరూపం నాశనంచేసే ముసల్మానులు మన వర్ణవ్యవస్థయొక్క పునాదుల నేమైనా కదలించగలిగారా ? ముసల్మానులను ముప్పతిప్పలబెట్టి మూడుచెఱువుల నీళ్లు త్రాగించిన మన మహారాష్ట్రులు, సిక్కులు అంతా మధుమాంససేవకులే నంటారా యేమి చరిత్రకారులు ! పోనీ, ఉష్ణదేశమన్న సంగతి విచారిద్దామా అంటే, మహారాష్ట్రులందఱు, నిప్పులుచెరిగే యీడక్కనుభూమిలో పుట్టినవాళ్లే కదా!

రంగ—అదృష్ట మట్లా కలసివచ్చిందేకాని మహారాష్ట్రులప్రజ్ఞ యేమీ లేదంటారు కొందరు.

ఆనం—ఓహో! మహారాష్ట్రులది అదృష్టమున్నూ, తక్కిన వారిది ప్రజ్ఞయునా! ప్రజ్ఞఅంటే యేమిటి? అదృష్టదేవతను తమకు అభిముఖురాలిని చేసి చెట్టపట్టడమే ప్రజ్ఞ. అటువంటి అదృష్టం ముసల్మానులను ఒక్కసారి కూడా వరించక, వర

సగా నూరుసంవత్సరాలు మహారాష్ట్రులచేతిలో వారు ఓడి పోవడమేమి? నిజానికి, శరీరదార్ఢ్యంలో మనసిక్కులను పఠానులను, ఘూర్కాలను, మాష్లాలను మించినవా రెవ రైనా వున్నారా ప్రపంచంలో? మన బెంగాలీలు, గుజరా తీలు, మదరాసీలు సామాన్యంగా ఆంగ్లేయులకంటె దార్ఢ్యం తక్కువగానే వుండేమాట నిజమైనప్పటికీ, దానికి కూడా కారణం మనది ఉష్ణదేశం కావడంవల్ల కాదు. ఎందువల్ల నంటే, ప్రపంచంలో జంతువులన్నిటికంటె దృఢమైన ఏనుగు, సింహము, బెంగాలుపులి, గంగానది, మొసళ్లు, హిమవ త్పర్వతంమీద గద్దలు, తాచుపాములు మనదేశంలోనే వున్నవి. కాబట్టి ఉష్ణదేశం వీర్యవత్తకు విరోధం కాదని తేలుతూ వుంది. అన్ని జంతువులకంటె ఎక్కువ బరువు మోయగల ఏనుగు ఆకు అలం తినేదేకాని మాంసం తినదు గదా. కాబట్టి శాకాభక్షణం కూడా వీర్యవత్తకు విరోధకం కాదని స్పష్టమవుతూ వుంది.

**రంగ**—అవునుగాని, దుర్బలస్థితిలో మాంససారం కలిసిన మందులు, రసాయనములు ఇస్తూవుంటాము. దీని కేమంటారు?

**ఆనం**—మనం పరిశీలనచేసి చూస్తే అటువంటిస్థితిలో పుష్టికలి గించే ఓషధులు కూడా వుండకపోవంటాను. ఇంకొకప్పుడు, మరి ఒకరి రక్తంతీసి రోగి శరీరంలో యెక్కిస్తే ప్రాణం నిలు స్తుంది. ఇవన్నీ అసాధారణసందర్భములు. అంతేకాని మనం నిత్యముతినే శాకాహారముకు వీటికీ ముడిపెట్టగూడదు. విశేషసందర్భములలో ప్రాణరక్షణంకొఱకు కోడిగ్రుడ్లనో,

మాంససారమునో సామాన్యజనులు తెలిసి తెలియక పుచ్చు కోవడం చూచి, శాకాహారమును నిందించగూడదు.

**రంగ**—పోనీ, యింకొక్క సంగతి ఆలోచించండి. ప్రపంచమంతా శాకాహారులే అయితే అందరికీ సరిపోయేశాకము యెక్కడ నుంచి వస్తవి? అందరూ శాకాహారులై చేపలను గూడా చంపటం మానివేసారనుకోండి. అప్పుడు జలచరములు విప రీతంగా పెరిగిపోయి సముద్రాల్లో ఓడలను కూడా కదల కుండా చేస్తవి కదా!

**ఆనం**—మనం చంపే ప్రతిజంతువునూ తినడంలేదు. కర్షకుడు తనధాన్యాన్ని తినే యెలుకలను చంపుతాడేగాని తినడు. అట్లాగే యుద్ధంలో మనం చంపే శత్రువులను మనం తినడం లేదు. తేళ్లు మొదలైన విషకీటకాలను చంపడం తినటానికి కాదు. కాబట్టి మనం మాంసాశనుల మైనంత మాత్రంచేత లోకంలో హింస లేకుండా పోదు. కాకపోతే, శాకాహారం, అనవసరమైన హింసలేకుండా చేయడానికి భూతదయా పరులు విధించారు. అందరూ శాకాహారులైతే వచ్చే యిబ్బం దులు విచారించడం ఎట్లా వుందంటే,—అందఱూ పుణ్యాత్ము లైతే స్వర్గంలో చోటుంటుందా అని భయపడ్డట్లుంటుంది. అందరూ దాతలైతే ప్రతిగ్రహీత లెవరుంటారు అని భయ పడడంవల్ల ప్రయోజనం లేదు. అంతటిభాగ్యం పట్టినప్పుడు ప్రతిక్రియలు ఆలోచించుదాము.

**రంగ**—మాంసాహారులకంటె శాకాహారులు ఉత్తము లంటారా?

ఆనం—ఆహారవిషయంలోమాత్రం ఉత్తములే. అయితే, ఉత్తమత్వాధమత్వములు నిర్ణయించడానికి ఒక్క ఆహారమే కాదు, ఇంకా అనేకవిషయములు విచారించవలసి వుంటుంది. తక్కిన విషయాలలో మాంసాహారే శాకాహారికంటె అధికుడు కావచ్చు. కాని ఆయాధిక్యత మాంసాశనానికి ఆరోపించగూడదు. మాంసాహారి అయినప్పటికీ ఇతరసందర్భముల చేత ఉత్తముడైనాడని సంతోషించాలి.

రంగ—శాకాహారంకంటె మాంసాహారం ఎందుకు తక్కువ దంటారు? శాకాలకు మాత్రం ప్రాణం లేదా?

ఆనం—ఉన్నది. అయితే అది ప్రత్యక్షహింస, ఇది పరోక్షహింసా కావడంచేత అందులో వున్నంతబాధ యిందులో వుండదు. అట్లాగే మనుష్యమాంసం తినటంకంటె జంతుమాంసం తినడం తక్కువ రకపుహింస అవుతుంది. కాబట్టి జంతుహింసకంటె శాకాహింస తక్కువదని వప్పుకోవాలి. ఏది యెట్లావున్నా, ధర్మజీవనం అపేక్షించేవారు మాంసము గ్రుడ్లు చేపలు తినగూడదనటం న్యాయం.

రంగ—వారికి న్యాయమైనది అందరికీ న్యాయమే అవుతుంది.

ఆనం—నిజమే. తక్కినవారికి వారు మార్గదర్శకులుగా వుంటారు గనుక అట్లా అనవలసి వచ్చింది. 'లా' అందరూ తెలిసికోవలసిందే అయినప్పటికీ, లాయర్లకైనా తెలిసి వుండాలి అనుకోవడంవంటిదే యిదిన్నీ.

రంగ—సరే కానిండు. మరి మద్యంమాట యేమంటారు? ఎడపా దడపా కాస్త మద్యం పుచ్చుకొంటే ఏమిదోషం!

మద్యం పుచ్చుకోనడం తప్పే అయితే ఈశ్వరుడు ద్రాక్షలత నెందుకు సృష్టించుతాడు?'

ఆనం—ఎడపా దడపా కొంచెం మద్యం త్రాగితే తప్పా అనడం ఎలావుందంటే,—అప్పుడప్పుడు కాస్త దొంగతనం, కాస్త అబద్ధమాడటం, కాస్త వ్యభిచరించడం తప్పా అన్నట్లుగా వుంది. ఇవన్నీ వ్యసనములు. వాటిజోలికే పోకూడదు. ఇక, మద్యంకోసం కాకపోతే ద్రాక్షలత ఎందుకన్నారూ;—ప్రపంచంలో అనేకవిషవృక్షములు పెరిగి పండ్లు పండుతూ వున్నవి. అవన్నీ మనం తిని చావవలసిందేనా? కాబట్టి ద్రాక్షలత లున్నందుకు కమ్మని ద్రాక్షపండ్లు తినాలిగాని మధుపానంచేసి పశుతుల్యులం కావడ మెందుకు?

రంగ—మద్యపానము నాక్షేపించడమేగాని, మద్యం పుచ్చుకోనివారే ఆహారవిహారములలో కట్టుతప్పి ప్రవర్తిస్తారు.

ఆనం—కావచ్చును. అందువల్ల మద్యపానం మంచిదని తేలుతుందా? మద్యం పుచ్చుకోనంత మాత్రంచేత ఆపురుషుడు గుణపూర్ణుడని ఎవరంటారు? చక్కని ఆరోగ్యంతోకూడిన చారుచర్యకు మధుమాంససేవనం కూడదన్నాము అంతే.

రంగ—చక్కని ఆరోగ్యమంటే ఎటువంటిది?

ఆనం—శారీరకమానసికనైతికపుష్టి ఒక్కస్థాయికి మేళవించడమే ఆరోగ్యము. ఒకమేళములో మ్రోగించే వివిధవాద్యములు ఏకశ్రుతికి మేళవించకపోతే రక్తిగా వుండదు. అట్లే, ఆరోగ్యముకూడా ఈమూడింటిలో హెచ్చుతగ్గువస్తే చెడుతుంది. శరీరపుష్టి మాత్రం వుండి మనఃపుష్టి నీతిసంపద లేక

పోతే వాడు దుర్జనుడు మూర్ఖుడు అవుతాడు. లోకకంటకుడై జైలుకు యోగ్యుడవుతాడు. మనఃపుష్టి మాత్రం వుండి శరీరపుష్టి నీతిబలం లేకపోతే లోకవంచకుడై మొదటి వానితో పాటే అవుతాడు. కేవల నీతిసంపద మాత్రం వుండి శరీరం మనస్సు బలహీనమైతే వాడు పిచ్చి ఆసుపత్రికి అర్హుడవుతాడు. కాబట్టి ఈమూడు సమపాళంగా వుంటేనే పూర్ణారోగ్యం లభిస్తుంది.

**రంగ**—నీతి బలానికి కూడా అంత ప్రాధాన్యమిస్తా రెందుకు?

**ఆనం**—మనం పశువులం కాము గనుక. ఇంద్రియనిగ్రహం మనస్సంయమం మనపని గనుక. సత్కార్యాచరణం చేయాలి గనుక. ఈనీతిసంపదే లేకపోతే మనం కూడా పెద్దకోతుల మనిపించుకొంటామేగాని అంతకంటె మన ఆధిక్యత ఏమున్నది?

**రంగ**—పెద్దచేపలు చిన్నచేపలను మ్రింగుతున్నట్లు బలవంతులు బలహీనులను హింసించి బ్రదికే ప్రపంచంలో, బ్రతుకంతా యుద్ధరంగమైవుంటే మీరేమో, నీతి, నిగ్రహం అంటూ ధర్మాలు బోధిస్తా రేమిటి?

**ఆనం**—ఆదికాలమునాటి మాటలు చెప్తున్నావు నువ్వు. పశుత్వం వదలి అప్పుడప్పుడే మానవత్వం వస్తూవున్న ఆరోజుల్లో కూడా నువ్వు చెప్పినంత ఘోరం లేదు. క్రమంగా మానవజాతికి శరీరం మనస్సు వికసిస్తున్న కొద్దీ ఆరాక్షసకృత్యములు తగ్గుతున్నవి. మనశ్శరీరములతోపాటు నీతి కూడ వికసించినట్లయితే యీప్రపంచంలో శాంతిసౌఖ్యములు రాజ్యం చేసేవి. ఆలా వికసించకపోవడంవల్లనే విషవాయువులు

మొదలైన ఘోరమారణసాధనములు ఇంకా బయలుదేరుతున్నవి. అప్పటప్పటికి ఈశ్వరానుగ్రహం మానవకోటిపై ప్రసరించే చిహ్నములుకూడా తరచు కనుపడుతూనే వున్నవి. ప్రపంచంలో లోభం క్రౌర్యం చప్పగా నశించిపోయే శుభ ముహూర్తం ఎప్పుడో వస్తుందిగాని రాకపోదు. అప్పుడు దేహానికి మనస్సుకు నీతికి సమాన పుష్టి కలిగి లోకానికి పూర్ణారోగ్యం లభిస్తుంది. ఇప్పుడు నీతిబలం లోపించిన సందర్భాలు అధికంగా వుండడంవల్ల లోకానికి అనారోగ్యం కలిగింది. కాబట్టి లక్షలాదిజనులు చెమటలోడ్చి ఒక్కణ్ణి లక్షాధికారిని చేస్తున్నారు. వీర్యవంతములైన జాతులు నిర్వీర్యజాతులను పిండుకు తింటున్నారు. రైతులకు అధిక వడ్డీల కప్పులిచ్చి షాహుకార్లు జలగల్లాగ పీలుస్తున్నారు. చిత్రవర్ణశోభితమైన పురి విచ్చి కనులపండువుగా నాట్యమాడే నెమలిని చంపుకు తినడానికి కిరాతుడు పొంచి కూర్చున్నాడు. అయినప్పటికీ ఆదికాలపు క్రూరరాక్షసకృత్యములకంటె ఇవి కొంత మెరుగని ఒప్పుకోవాలి. మనకళ్ల యెదుట జరగే నేటి క్రూరకృత్యములను హర్షించక నిరసించే సజ్జనులసంఖ్య నానాటికి పెరుగుతూవుంది. మానవజాతికి నీతిబలం వృద్ధిచెంది ఆరోగ్యం కుదటబడే సూచనలు కనిపిస్తున్నవి.

రంగ—మానవజాతియొక్క యీపురోగమనానికి'లా'యున్నూ, లాయర్లున్నూ చాలవఱకు చేయూత ఇస్తున్నారు.

ఆనం—సెబాస్! జాత్యభిమానమంటే అలావుండాలి, క్రూరకర్ములకు, లోకవంచకులకు, పరహింసకులకు అండయై నిలిచే లాయర్లెక్కడ, ఈపురోగమనమెక్కడ! పూర్వకాలపు

ధర్మాల నాధారం చేసుకొని పుట్టిన 'లా' నేటి మహాదాశయాలకు, ఉన్నతనీతిధర్మాలకు అడ్డంపడకుండా వుంటే చేయూత యిచ్చినంతఫలం. లాయర్లు నేర్చిన 'లా' ఎటువంటిదసలు ? కంట్రాక్టులు తాకట్లు, ఆస్తిపాస్తులు, పెళ్లిళ్లు దత్తతలు, హత్యలు హంతకులు—ఇవియే గదా లాయర్లకు తెలిసిన ధర్మాలు. తరువులను అకుదొడిగించే ధర్మం, సముద్రంలో తరంగాలను వుబికించే ధర్మం, గ్రహరాశిని గతులు తప్పకుండా చేసేధర్మం, మహాత్ములను భక్తిసుస్థిరులను చేసేధర్మం, ఈలాయర్ల కేమైనా తెలియునా? నేటి ధర్మబలంకంటె ఎన్నోరెట్లు అధోగతిలో వున్న పూర్వధర్మాలను పురస్కరించుకొని గదా వీరి 'లా' ప్రవర్తించేది. అట్టి లాయర్లు లోకపురోగమనానికి ఎలా సహాయపడతారు. లాయర్లు స్వభావంచేత సజ్జనులే కావచ్చును గనుక అన్యవిధంగా సహాయపడుదురేమోకాని నిజవృత్తిచేత మాత్రం సహాయభూతులు కాజాలరు.

**రంగ**—నీతినియమాలకు, పరలోకానికి ప్రాధాన్యమిచ్చే మన పూర్వస్మృతులన్నీ దోషభూయిష్ఠములు కావుటండీ.

**ఆనం**—ఎందువల్ల?

**రంగ**—బాల్యవివాహములు, నిర్బంధవైధవ్యములు, అందరికీ నిర్బంధంగా వివాహవిధి,—వీటి నన్నిటిని ఎలా సమర్థించుతారు?

**ఆనం**—మానవనిర్మితమైన దేదీ లోపరహితం కాదుగాని, మన వివాహవిధులు అనుకూల దాంపత్యానికి దోహదములు

కావడమేకాక, ప్రతిస్త్రీకి వివాహసౌఖ్యం లభింపజేస్తున్నవి. ఇతరత్ర లక్షలాదిస్త్రీలు నిర్బంధకన్యాత్వమైనా అనుభవించాలి. చాటుగానో బహిరంగంగానో జారత్వమైనా అవలంబించవలసివస్తున్నది. అంతకంటె మనపద్ధతే మెరుగు. ఒకసారి వివాహసౌఖ్యమనుభవించి విధవయైనస్త్రీవైదొలగి, కన్యలకు చోటివ్వడం మంచిదని మనవాళ్లు తలచారు. విధవాత్వమును నింద్యంగా ఎంచడం, విధవలకు కఠిననియమాలు ఏర్పరచడం సమర్థనీయములు కావేమోకాని నిర్బంధవైధవ్యంమట్టుకు దోషం కాదనుకొంటాను. పురుషునకుకూడా నిర్బంధవిధురత్వం విధించవలసిందంటే నాకాక్షేపణ లేదు. ఒక్కపురుషుడు ఒక్కస్త్రీ కలసి అనుభవించిన దాంపత్యం ఎంత మధురం, ఎంత ఉదారం! గార్హస్థ్యధర్మాచరణం స్త్రీపురుషులకు ఉన్నతిని సమకూర్చే జ్ఞానసాధన కావడంచేత అందఱికీ ఆ అవకాశం విధిగా లభింపచేయవలసిందే. అయితే ఇష్టంలేని వధూవరులకు ముళ్లుపెట్టడం మాత్రం నే నంగీకరించను. నిర్బంధవైధవ్యం ప్రజావృద్ధి విపరీతం కాకుండా హద్దులలో వుంచుతుంది కూడాను నిర్బంధం నిర్బంధం అనే పేరేగాని, మనదేశంలో కోట్లకొలది జనులను మద్యమాంసములు ముట్టుకోకుండా ఎవరు నిర్బంధిస్తున్నారు. అటువంటి దేశంలో, ఇటీవల కొందఱు బ్రాహ్మణులు, ఇతరులు కూడా మధుమాంససేవనం మహాత్కార్యంగా ఎంచి అందుకు పాల్పడి, దేశాన్ని ఆఱువేలసంవత్సరాలు వెనక్కి తీసుకొనిపోజూడడం మాత్రం విషాదకారణం

రంగ—జన్మపరంపరలనుగూర్చి కూడా మీఅభిప్రాయం సెల వీయండి.

ఆనం—దేహికి యీజన్మమే మొదలు, ఈజన్మంతోనే అంతము అని బుద్ధిమంతు లెవ్వరూ అనరు. ప్రతిక్షణపతనశీలమైన యీ ఒక్కశరీరమే మోక్షాన్ని సాధింపజాలదని నమ్మ వచ్చును. తరతరములదాక పట్టుకువదలని జాతీయఋణముల వలె దేహియొక్క పాపఋణం కూడా ఒక్కజన్మతో వదలి పోదు. కాబట్టి దేహి మోక్షంపొందాలంటే జన్మాంతరము లుండి తీరవలెనని మనవాళ్లు విశ్వసించారు.

రంగ—మృత్యువుతోనే సర్వబంధములు తీరుతున్నట్లు చెప్తు తారే, ఆమృత్యుస్వరూప మెటువంటిదో తెలుసుకోవలెనని వుంది తమవలన.

ఆనం—మృతుడైనవా డెవడైనా తిరిగి వచ్చి చెప్పితే తప్ప మృత్యుస్వరూపం తెలుసుకోవడం పడదు. అయినా, నాఊహ కందినముక్కలు చెప్తుతాను. సముద్రతీరమునుంచి బయలు దేరిన రైలు పర్వతప్రాంతములలో సొరంగములగుండా చుట్టు తిరిగి మళ్లా రేవుకు చేరుకోవలె ననుకో. ఆరైలులో ఒకపల్లెటూరివాడు, ఎన్నడు రైలు మొగమెఱుగనివాడు ప్రయాణంచేస్తాడు. చల్లనిగాలిలో వెలుతురులో నడచి నడచి రైలు తటాలున సొరంగంలో ప్రవేశించేటప్పటికి, ఊపిరాడని ఆయంధకారంలో భయాతిరేకంచేత ఆగ్రా మీణుడు దిగిపోవాలని ప్రయత్నించి, వీలులేక గడగడ లాడి మూర్ఛపోతాడు. మళ్లా వెలుతురులోకి వచ్చేటప్పటికి

స్మృతి తెలిసి, తాను మూర్ఛపోయినసంగతి మఱచిపోయి, మళ్లా సంతోషంతో ప్రయాణసౌఖ్యం అనుభవిస్తాడు. మొన్నటియుద్ధంలో ఫిరంగిగుండ్లప్రబలఘోషలకు మూర్ఛ పోయి తెలిసినవాళ్లకు ఇట్లాగే పూర్వస్మృతి ఉండేది గాదట. ఈవిధంగా సొరంగం వచ్చినప్పుడల్లా విస్మృతి, అందులో నుంచి బయటపడినప్పుడల్లా తెలివీ వస్తూ వుంటుంది వాడికి. ఆగ్రామీణుడే జీవి. ఆరైలుప్రయాణమే అనంతమునుండి బయలుదేరి అనంతమును చేరబోయే జీవియొక్క యాత్ర. ఆసొరంగములే మృత్యువు. తిరిగీ వెలుతురులోకి రావడమే జన్మము. ఆరైలు సొరంగములో ఆగిపోతుందనుకోవడ మెట్టిదో మృత్యువుతో జీవయాత్ర అంతమొందుతుందను కోవడ మట్టిది. రైలు సులభంగా పురోగమనం చేయడానికి సొరంగములు యేర్పడ్డట్లే దేహి కూడా మృత్యువుద్వారా పనికిమాలిన పూర్వదేహం వదలి, పురోగమనానికి తగిన యింకొకదేహం ధరిస్తూ వుంటాడు.

రంగ—జీవికి శరీరం మనస్సుకంటె ఇతరమైన ఆత్మ ఒకటి, అనశ్వరమైనది వున్నదనడానికి దాఖలా యేమిటి ?

ఆనం—ముందు ఈశరీరమే ఆత్మ అనుకొందామా అంటే, ఈశరీరమునకు కాళ్లో చేతులో యుద్ధంలో తెగిపోయిన వనుకో. అప్పటికీ ఆశరీరి ఫలానిరాముడో లక్ష్మణుడో అని ఇతరులు గుర్తిస్తున్నారు. తన్నుతాను గుర్తించుకొంటున్నాడు ఆరాముడనే అని, ఆలక్ష్మణుడనే అని. కాబట్టి 'నేను' అని చెప్పుకొనేది ఈశరీరంకంటె భిన్నమై వుండాలి. అట్లాగే ఒళ్లుతెలియని నిద్రపోయి లేస్తాడు రాముడు, లేకపోతే

మూర్ఛపోయిలేస్తాడు అప్పుడు మనస్సేమీ పనిచేయదు కదా. కల గూడా ఉండదప్పుడు. 'అబ్బ! గాఢనిద్రపోయి లేచా' నంటాడు రాముడు. ఇతరులు కూడా, 'రాముడు గాఢంగా నిద్రపోతున్నా' డనీ, 'నిద్రపోయి లేచా' డనీ అంటారు. కాబట్టి మనోవికారశూన్యమైన ఆనిద్రపోయి లేచిన రాముడు మనస్సుకంటె కూడా భిన్నుడై వుండాలి. 'నేను గాఢనిద్రపోయి లేచాను' అనే ఆ 'నే' నెవరు ?

**రంగ**—దేహాంతరములందు ప్రవేశించిన జీవుని ఎట్లా గుర్తించటం ? పూర్వదేహముయొక్క సూక్ష్మరూపంతో అవతరిస్తాడా యింకొకదేహంలో ?

**ఆనం**—ఇది కొంచెము చిక్కయిన ప్రశ్న. ఎందుచేతనంటే— జీవుడు ఈశరీరంయొక్క సూక్ష్మరూపంతో తిరిగి అవతరించేటట్టయితే, ఈశరీరానికి వుండే బోదకాలో, బోసినోరో— సూక్ష్మరూపంతో జీవాత్మను కూడా ఆశ్రయించి వుంటుందనవలసి వస్తుంది. అది చాలా అసంగతం. ఏమంటారు? దేహం జీవునకు పాత్రవంటిది. ఈపాత్రయొక్కరూపంతో జీవునకు సంబంధంలేదు. వాయువిమానంయొక్క ఆకారానికి దాన్ని నడిపేచోదకుని రూపానికి ఏమి సంబంధముంటుంది? పైగా, అనేకశరీరములు దాలుస్తూ వుంటుందాయె నాత్మ; వానిలో ఏశరీరధర్మమును ధరిస్తుందో ఆలోచించండి. కాబట్టి ఆత్మ పదార్థము గుర్తింపదగ్గది కాదు. కాకపోతే, పూర్వజన్మమందలి కర్మవాసనలు మాత్రం అంటిపెట్టుకు వుంటవి ఉత్తర జన్మలలో. ఆవాసనలచేత, 'ఇది పూర్వజన్మమందు ఫలాని జీవునిది' అని గుర్తించటం సాధ్యంకాదు. ఇలా జననమర

ణాత్మకమైన సంసారచక్రమందు జీవుడు తిరిగి తిరిగి, చివరకు వాసనారహితుడై పరమాత్మను పొంది తన ప్రత్యేకతను పోగొట్టుకొంటాడు. అని మన శ్రుతులు చెప్పుతున్నవి.

**రంగ**—శ్రుతిప్రమాణంకంటె అంతఃకరణప్రమాణం శ్రేష్ఠమను కొంటాను.

**ఆనం**—కాదు. ఎందువల్లనంటే, భక్తిజ్ఞానకర్మలచే పరిణతమైతే తప్ప అంతఃకరణను నమ్మడానికి వీలుండదు. వేదాధ్యయనా దులచేతనే కాని జగత్తత్త్వము బోధపడదు. అధ్యయనంచేత కలిగిన జ్ఞానంతో భక్తిపూర్వకంగా ధ్యానధారణమననాదు లచే అంతఃకరణను ప్రబోధించి, తదనుగుణంగా నడుచు కోవాలి. అప్పుడు అంతఃకరణప్రమాణమును విశ్వసించి, విరోధము కలిగినచోట్ల శ్రుతిప్రమాణమును విడనాడ వచ్చును. వేదాధ్యయనాదులు అంతఃకరణప్రబోధమనే ఒడ్డు చేర్చడానికి ఏర్పడ్డ యానపాత్రలవంటివి. ఒడ్డెక్కినపిమ్మట యానపాత్రలతో పని తీరిపోతుంది. అధ్యయన సహాయం లేకుండానే, ఆత్మసంస్కారం పొందకుండానే నేను అంతః కరణను నమ్ముతానంటే, దేనినో నమ్ముకొని యేటిలోపడినట్లు అవుతుంది. బోధం లేనివానికి కర్మస్వాతంత్ర్యము ఉండదు. విమానం నడిపే యోగ్యత సంపాదించకుండానే ఆకాశంలో ఎట్లా ఎగిరిపోతావు? కాబట్టి శాబ్దప్రమాణాదులచేత చిత్త సంస్కారమును పొందనైనా పొందాలి, పురాకృతపుణ్యాం చేత అట్టి సంస్కారం జన్మతః లభించియైనా వుండాలి, ఏదీ లేక, నామనసు వచ్చినట్లు నేను చేస్తాను అంటే ప్రయోజనం లేదు.

రంగ—చిత్తం. మనవాళ్లు ఈశ్వర ప్రార్థనలు భజనలు చేస్తారు కదా, ఎందుకు చెప్పండి ? సర్వసముద్రైన యీశ్వరుడు తన్ను ప్రార్థించినవారికి మేలూ, ప్రార్థించనివారికి కీడూ చేసే లంచ గొండి అన్నమాట ?

ఆనం—ఈశ్వరున కట్టి పక్షపాత మేమీ లేదు. మనతిరస్కార పురస్కారము లాయనను అంటవు.

రంగ—అయితే యీప్రార్థనలన్నీ వ్యర్థమే గదా!

ఆనం—అన్ని ప్రార్థనలు వ్యర్థం కావు. కొన్నిటికి ప్రయోజన ముంటుంది. కొన్నిటికి ప్రయోజనం లేకపోగా, అవి చెలుపు కూడా చేస్తవి. ప్రార్థనలు మూడువిధాలుగా వుంటవి. శత్రుసంహారంకోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తాము. అవి కీడుకు కారణమవుతవి. ఈశ్వరుడు ఆప్రార్థనలు వినిపించుకోనడు సరి గదా, ఆప్రార్థనలు చేసినవారిని శిక్షిస్తాడు కూడాను. పాపక్షయంకోసం, ఆయురారోగ్యైశ్వర్యాదిఫలములకోసం చేసే ప్రార్థనలు రెండోరకం. ఇవి నిరపాయములు. పిల్లలు తండ్రిని ప్రార్థించటం వంటివి. అయోగ్యుల కీప్రార్థనలు యోగ్యతకల్గించవు. యోగ్యుల కీప్రార్థనాభావంచేత అయోగ్యతరాదు. అంతమాత్రంచేత వీటిని నిరర్థకములని త్రోసి వేయడానికి వల్లకాదు. మన పురుషకారంకంటె అధికమైన ఒకశక్తిని నమ్ముకొనివుంటే ఉత్సాహం ఆత్మవిశ్వాసం ఇనుమడించడమే కాకుండా, దుఃఖములు తటస్థించినప్పుడు అటువంటిప్రార్థనలు తాపనివారకములై మనస్సుకు శాంతినిస్తవి. నిర్వికారత ఆత్మప్రత్యయం కలసి మనయత్నములను సఫలం

చేస్తవి. హృదయంతాపసంతప్తమై యున్నప్పుడు, వాయెత్తి ఈశ్వరుని వేడుకొంటూ కన్నీరోడ్చుటచే మనసు కలకదేలుతుంది. ఈశ్వరుడు మన మొఱాలించి మనకు అండగా వుంటాడనే విశ్వాసము పతయాళువైన భగ్నజీవితమును గూడా నిలబెట్టుతుంది. ఆత్మబోధంకొఱకు విశ్వశ్రేయం కొఱకు చేసేప్రార్థనలు మూడవరకపువి. వీనిలో స్వార్థచింత యేమీ వుండదు 'న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవం, కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తి నాశనం.' అనే ప్రార్థన యెంత ఉదారమో గంభీరమో ఆలోచించు. 'అసతో మాసద్గమయ, తమసో మాజ్యోతిర్గమయ, మృత్యోర్మామృతంగమయ.' అనే ప్రార్థనలో ఆత్మబోధ ఫలాపేక్షతప్ప తుచ్ఛమైన యితర కామములు లేవు. 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం, న్యాయ్యేన మార్గేన మహీం మహీశాః' అనే ప్రార్థనలవంటివి సమస్తలోకముల సౌఖ్యమును కోరేవి. దయామయుడును కర్మఫలప్రదాతయు నైన దైవము ఇటువంటి ప్రార్థనములకు చెవియొగ్గునని విశ్వసించవచ్చును.

**రంగ**—'నీవుతప్ప నాకు వేఱేదిక్కు లే'దని శరణుజొచ్చినట్లయితే యెంతటి పాపినైనా ఈశ్వరుడు క్షమించి రక్షిస్తాడని సమస్త మతగ్రంథములు చెప్పుతున్నవి గదా, ఇది నిజమే అయితే ఈశ్వరుడు స్తోత్రప్రియుడనీ, పక్షపాతి అనీ చెప్పవలసి వస్తుందే.

**ఆనం**—అవసరం లేదు. చేసినపాపములకు మనసార తపించి, ఈశ్వరుని మరుగుచొచ్చి, సన్మార్గమున సంచరించడానికి

ఎప్పుడు నిశ్చయించావో, అప్పటితో నీపాపగ్రంథం పరిసమాప్తిమై, పుణ్యగ్రంథం ఆరంభించినదన్నమాట. ఆ ప్రకారం సత్కర్మాచరణం చేస్తూ వుంటే ఎప్పటికైనా పాపపరిహారమై ఈశ్వరుని పొందడానికి సాధ్యమౌతుంది. అంతే కాని నన్ను రక్షింపుమని చెంపలు వాయించుకొని కాళ్లబడినంతమాత్రాన మోక్షం చేతజిక్కుతుందని యెంచగూడదు.

రంగ—పుణ్యమార్గమంటే యెటువంటిది ?

ఆనం—జయాపజయములు, మానావమానములు, గణించక అనాసక్తితో కర్మాచరణం చేయాలి. చేసేప్రతికార్యము ఈశ్వరార్పణబుద్ధితో చేయాలి. కర్మాచరణమే నీవంతుగాని కర్మఫలవిచారం నీపనికాదు. నీవుచేసే ప్రతిపనీ విశ్వశ్రేయస్కరంగా వుండాలి. ఎట్లా నీధర్మం నీవు నిర్వహిస్తూ, మరణం తారసిల్లితే, నిర్భయంగా, తల్లిఒడి చేరబోయే శిశువులాగ, మరణమును వరించు. ఈవిధంగా సంచరించి, రెండుమార్గములచే ముక్తిపొందవచ్చును. నీమనస్సును క్రమక్రమంగా విస్తరింపజేసి విశ్వవ్యాప్తంజేసి, విశ్వాత్ముడైన పరమాత్మను పొందడ మొకమార్గం. నీమనస్సుయొక్క వ్యాప్తిని క్రమక్రమంగా తగ్గించుకొని నీప్రత్యేకతను నశింపజేసి పరమాత్మను పొందడం రెండవమార్గం.

రంగ—మనం అబుద్ధిపూర్వకంగా చేసేపాపములసంగతి యేమిటండి ?

ఆనం—తెలియకచేసేతప్పులు లెక్కలోకిరావనే అంగీకరిస్తున్నవి సర్వమతములు.

రంగ—అగ్నిలో ఆజ్యాదులు హోమంచేయడం వృథా అని తోస్తుంది.

ఆనం—మనం ప్రతిపనికి లాభనష్టపరిగణనం చేస్తే కుదరదు. నక్షత్రములు చూడు! నిత్యం ఎంతకాంతిని ఒలుకబోసుకొంటున్నవో! అవి ఏమిలాభం కోరి అలా చేస్తున్నవి? ఊరికే లాభాలు లెక్కచూడటం ఉత్తమమానవలక్షణం కాదు. ఇంతకు, నాలుగు నేతిబొట్లు నిప్పులో పోయడంచేత ఏమంత కొంపలు మునిగిపోతున్నవి? అందులో ఈశ్వర ద్రోహం లోకాపరాధం ఏమున్నది?

రంగ—మీకు గీతలంటేను, కృష్ణుడంటేను అంత అభిమాన మెందుకు?

ఆనం—అవును గీతాచార్యులైన శ్రీకృష్ణపరబ్రహ్మముకంటె మనకు మార్గదర్శకులైన గురు వెవరు దొరుకుతారు? మోక్షమునకు గీతలు రాచబాట చూపిస్తున్నవి. గీతోపదేశములు పంచదారతో పొలిపిన చేదుమాత్రలు కావు అమృతము నింపిన ధర్మఘుటికలవి. చూపులకు కష్టంగా కనిపించినా, జ్ఞానులైనవారికి సంభావ్యములైన ధర్మములనే గీతలు ఉపదేశిస్తున్నవి.

రంగ—నామనసులోమాట చెప్తున్నాను. తమరు క్షమించాలి. కృష్ణునిచర్యలు నీతిరహితమని మాత్రం తోస్తవి. మఱి తమరేమి సెలవిస్తారో!

ఆనం—ఆచర్య లేవో చెపితే సమాధానం చెప్తాను.

**రంగ**—కృష్ణుడు వెన్నలు దొంగిలాడు గదా, దొంగ భగవంతు డవుతాడా ?

**ఆనం**—వెన్నలే కాదు, మనహృదయములే దొంగిలిస్తున్నాడు భగవంతుడు. పైగా, గోపికలంతా, వెన్నలు తామెంత భద్రంగాదాచుకున్నా, దొంగ కృష్ణమ్మ తమ్ము ఏమరించి అపహరించుకపోతూ వుంటే ఎంతో సరదా పడేవారు. భక్తుడికి భగవంతునిపట్ల దాపరికం పనికిరాదని బోధించుతవి ఆలీలలు. అదిన్నీగాక,ఆలీలాకిశోరుడికి, తనదేమిటి, పరులదేమిటి? విశ్వమున కంతటికీ శిశువైన ముద్దుకృష్ణమ్మకు దొంగతనమేమిటి ? భక్తుడు స్వయంగా అర్పించవలసిన పదార్థాన్ని, భగవంతుడు తానై అపహరించుకు పోతూ వుంటే, మన చరితార్థతకు సంతోషించాలా ? ఆభక్తసులభుణ్ణి దొంగ అని నిందించాలా? ఇంకొకటేమిటంటే, నీది నాది అనేభేదం పెద్దవాళ్లకేగాని శిశువులీలలో నీదేమిటి నాదేమిటి ?

**రంగ**—పదారువేలు పైన ఎనమండుగురు భార్యలమాట ఏమి చెప్తారు ?

**ఆనం**—(నవ్వి) పదహారువేలతో సరిపెట్టినందుకు సంతోషించు. పదారుకోట్లున్నా తప్పులేదు. భగవంతుణ్ణి తండ్రిగా భావించడం అనేకమతములలో వుండనే వున్నది. భగవంతుడు మన కందరకు తండ్రియే కాకుండా, ముద్దుకృష్ణమ్మరూపంతో మనవ్రింట శిశువై యాడుకొని వెన్నలు తినిపోతాడు. వాత్సల్యభావంకంటె కూడా స్త్రీలకు భర్తృభావం అధికమైనది. దానినే మాధుర్యమంటారు. భగవంతుడు మనకు

తండ్రి అనుకొంటే నిజంగా మనలనుగన్న తండ్రీ కాడు. తనయు డనుకొంటే నిజంగా మనముగన్న తనయుడూ కాడు. భర్త అనుకొంటే నిజంగా మనలను పెండ్లాడిన భర్తా కాడు. ఈభావాలకు దేహసంబంధ మారోపించగూడదు.

రంగ—రాధ మగనాలి కదా, ఆమెతో కృష్ణునిసంబంధ మెటు వంటిది ?

ఆనం—ఎవరితోనైనా దేహసంబంధమని ఎంచగూడదంటినే. రాధ జీవాత్మ; ప్రపంచ మామెభర్త; కృష్ణుడు భగవంతుడు. భక్తురాలైనరాధ ప్రపంచబంధమును త్రెంచుకొని భగవంతుణ్ణి పొందుతుంది.

రంగ—సైంధవవధకొఱకు చక్రముతో సూర్యుణ్ణి మాటుపఱచడ మేమిటి ?

ఆనం—ధర్మపక్షము నెదుర్కొన్నవాళ్లు, మోహాంధులై, తమ అవివేకంవల్లనే నశిస్తారని దానికర్థం. పాండవులది ధర్మపక్షం. దైవం వారిపట్ల నున్నాడు. దైవద్రోహియైన సైంధవుడు యథార్థజ్ఞానం లేక నశించిపోయినాడు.

రంగ—ఘోరమైన ఆభారతయుద్ధానికి కారణం కృష్ణుడే గాదా?

ఆనం—కృష్ణుడు సంధికొఱకు ఎంతో ప్రయత్నంచేసాడు. తుదకు అయిదూళ్లైనా యిమ్మన్నాడు పాండవు లైదుగురికి. దుర్యోధనుడు సూదిమొనమోపినంతైనా భూమి యివ్వనని మొండికెత్తటంచేత, కృష్ణుడు పాండవులను యుద్ధంచేయండని

చెప్పవలసివచ్చింది. యుద్ధంచేయక ఊరుకొంటే ధర్మహాని కలిగి అధర్మం పెచ్చుపెరిగి పోతుంది. న్యాయ్యమైన విషయంలో ఎదుటిపక్షంవాళ్లు అటువంటి అధర్మానికి దిగినప్పుడు నీళ్లయిం టుకు నీవేమి సలహాయిస్తావో ఆలోచించు.

రంగ—కృష్ణుడు, తనబిడ్డలు తగవులాడుకొని నశిస్తూ వుంటే చూస్తూ ఊరుకోవడ మెందుకు?

ఆనం—తనవాళ్లేమిటి, పరులేమిటి? అధర్మవర్తనులు తన వాళ్లైనా నశించవలసిందే. ధర్మాత్ముడైనరాజు, తానుచేసిన నేరములకు గూడా, ధర్మాధికారులను శిక్షవిధింపండని కోరి అనుభవిస్తాడు.

రంగ—దయాపరుడైన అర్జునుడు తనవారిని చంపుకోలేక వెను దీస్తే కృష్ణుడు ఆతనికి దుర్బోధచేసి క్రూరకృత్యము చేయిం చడ మెందుకు?

ఆనం—అర్జునుడికి ఎవరిమీాద జాలి? అతని కీవిషాద మెందుకు కలగాలి? దుర్యోధనుడికి సాహాయ్యంగావచ్చిన నిరపరాధు లైన పదకొండు అక్షౌహిణీలను చంపటానికి అతనికేమీా జాలిలేదు. ఎటువచ్చీ, తనజ్ఞాతులను గురువులను చంపవలసి వచ్చిందని కదా అతని కావిషాదం. ఆయుద్ధానికి కారణ భూతులైన దుర్యోధనాదులమీాద, దుర్యోధనుడి అకార్యా లకు హర్షిస్తూవచ్చిన భీష్మద్రోణాదులమీాద కనికరం పుట్టటం అనుచితం. వంశనిర్మూలనంచేస్తే పితృదేవతలకు పిండప్రదానం చేసే దిక్కుండదే అనే ఆలోచనేగాని ఆపితృదేవతలకు మిక్కిలి ప్రీతిపాత్రమైన ధర్మంకొఱకు అధర్ములను సంహ

రించటము దోషం కాజాలదని ఊహించలేకపోయినాడు. వీళ్లంతా చస్తే వీళ్ల భార్యలకు దిక్కేమిటూ అని జాలిపడ్డాడే గాని, బ్రదికిఉన్న తన పెండ్లానికి పరాభవదుఃఖము పోగొట్టక పోతినే యని ఆలోచించలేదు. తాను క్షత్రియుడై పుట్టి శస్త్రజీవనుడై యుండి, నిరాయుధుడనుగా శత్రువులయెదుటికి పోయి నాప్రాణమిస్తాను అని అహింసాధర్మపన్నములు మొదలుపెటితే నగుబాటేకాని తన కదియేమి శోభిస్తుంది. కాబట్టి శ్రీకృష్ణుడు ఈ అనుచితవిషాదాన్ని నిరసించి "లేవవోయి అర్జునా! శత్రుసంహారం చెయ్యి, స్వధర్మం నిర్వహించు" అని నచ్చజెప్పి యుద్ధం చేయించాడు. గీతోపదేశం కన్న ఉత్కృష్టమైంది ప్రపంచకంలో మఱొకటి లేదు. ఇంతకూ, ఇదంతా వాగ్వ్యయమేకాని యీమాటలు పుణ్యమిస్తవా పురుషార్థమిస్తవా? అందుకనే మనపెద్దలు మాటలతో మోక్షము రాదయ్యా అని చెప్పి మౌన మవలంబించమన్నారు.

రంగ—మౌనం మాత్రం మోక్షమిస్తుందా అండి.

ఆనం—మౌనంఅంటే మూగతనంకూడా మౌనమే అవుతుంది. మఱి మూగతనం మోక్షమిస్తుందంటామూ? వాచాలత ఉండిన్నీ అవలంబించిందే మౌన మౌతుందిగాని మూగవాడు మౌనంధరించక యేంచేస్తాడు. శక్తికలవాడు చేసేదే సైరణకాని శక్తిహీనుడు సైరించక చేసేదేముంది? నీకు సంశయనివారణం చేద్దామని ఇంతదూరం చెప్పాను. మాటలు నిష్ప్రయోజనములని గ్రహించిన తర్వాత తాల్చిన మౌనమే నిజంగా మోక్షసాధకం అవుతుంది.

**రంగ**—ఆమౌనవ్రతం నాకెవ రుపదేశిస్తారు ?

**ఆనం**—మాగురుపాదులు బ్రహ్మానందయోగీశ్వరులు ఇంకా ఇచట నెలరోజులదాకా ఉంటారు.

**రంగ**—వారిదర్శనంచేసి ఇంకా మిగిలి ఉన్న స్వల్పసంశయాలు కూడా తీర్చుకోవాలి. ఇకనుంచి మధుమాంససేవనము వర్జించ టానికి నిశ్చయించుకున్నాను. వాటిని మాయింటిచాయ లకు కూడా రానియ్యను.

**ఆనం**—మంచిదేకాని నీభార్యను ఇతరులను బలవంతంచేసి మాత్రం మానిపించకు. అట్లా చెయ్యటం న్యాయం కాదు. బలవత్సంస్కారం కీడుచేస్తుంది. నీవు నిర్బంధంచేస్తే వాళ్లు వంచనచేస్తారు. లేదా తిరగబడతారు. కాబట్టి సామంచేత ఒప్పించుగాని నిర్బంధించకు.

**రంగ**—మధుమాంసములు మాయింట్లో నేను నిషేధించటం తప్పా ?

**ఆనం**—కాదుగాని ముందు నీభార్యను ఒప్పించు. మధుమాంస సేవనవల్ల కలిగేదోషములు ఆమెకు బోధించు. మానటంలో ఉన్న విశేషం కూడా చెప్పు. పిమ్మట ఆమెకెలా ఇష్టమో అలా చెయ్యమను. శ్రీకృష్ణులవారు కూడా కర్తవ్యోపదేశం చేశారేకాని అర్జునుణ్ణి ఆజ్ఞాపించలేదు. బుద్ధిపూర్వకంగా చేసినకార్యంలోనే విశేషం ఉంది.

రంగ—చిత్తము. తమ ఉపదేశ ప్రకారమే చేస్తాను. ఇక నొక్క సందేహం కూడా తీర్చండి. మోక్షసాధకుడు దాంపత్యధర్మం అనుష్ఠించవచ్చునేమో సెలవివ్వండి.

ఆనం—మోక్షానికి సన్యాసి యెంత అర్హుడో గృహస్థు అంత అర్హుడే. కాని, దాంపత్యం ధర్మప్రజార్థమే కాని కామ నిర్వహణానికి కాదని మాత్రం తెలుసుకోవాలి.

రంగ—నాకిప్పటికే యిద్దరు సంతానం. కనుక ఆతొందరేమీ లేదు. నిశ్చింతగా ఆత్మసాధన చేసుకోవచ్చు.

ఆనం—మరి నేను సెలవుతీసుకుంటాను.

రంగ—(ప్రణామంచేసి) నేడు మీదర్శనంవల్ల నేను ధన్యుడ నైనాను. ఇన్నాళ్లు పశుప్రాయంగా కాలం గడుపుతున్న నాకు ధర్మోపదేష్టలై మీరు పుణ్యంగట్టుకున్నారు.

ఆనం—"నారాయణ! నారాయణ!" (అని ఆశీర్వదించి) నీఅభీష్ట మీడేరుగాక! నే నీనెలరోజులు పూజ్యపాదులతో కూడా 'ఆవడి'లోనే ఉంటాను. కనుక మళ్లా కలుసుకుంటూ ఉందాం.

(దండము గ్రహించి నిష్క్రమించును.)

రంగ—(లేచి, ఆనందస్వామి వెళ్లటం చూస్తూ తనలో) ఈయన మహానుభావుడే. ఏమిశాంతి! ఏమిజ్ఞానము! ఎంత ప్రసన్నత! నాసంశయములన్ని ఎంత చక్కగా నివారించాడు! బ్రహ్మా నందస్వాములవారిదర్శనం కూడా చెయ్యాలి. ఆనందస్వామి

వాక్కులో ఉన్నశక్తి తెలియజేసాడు. మానప్రభావం బ్రహ్మానందస్వామివల్ల తెలుసుకుంటాను. ఆమౌనీంద్రుని వలనగాని సంశయనివారణం పూర్తికాదు. ఆయన నన్ను చరితార్థుణ్ణి చేస్తారు. ఈమధుమాంససేవనకు ఈవిషయాసక్తికి ఇక స్వస్తిచెప్పి శాకాంబుభక్షకుడనై నిర్మలమైన ప్రశాంత జీవనం అలవాటు చేసుకుంటాను. అమ్మ కూడా ఎంతో సంతోషిస్తుంది.—కాని, సుభద్రో, అది ఒకపట్టున దారికిరాదు. కానీ;-అన్నిటికీ ఆస్వామిదే భారం.

(తెర)

# ఇందు వచ్చు పాత్రలు

| | |
|---|---|
| 1. రంగరాజు | బారిస్టరు |
| 2. సుభద్ర | ఆయనభార్య |
| 3. నాగమ్మ | ఆయనతల్లి |
| 4. మంగమ్మ | ఆయనకూతురు |
| 5. సూరయ్య | ఆయనకుమారుడు |
| 6. ఆనందస్వామి | సన్యాసి |
| 7. బ్రహ్మానందయోగి | సన్యాసి |
| 8. తిమ్మరాజు | రంగరాజు దాయాదియైనభూస్వామి |
| 9. పిచ్చయ్య | కారాగృహోద్యోగి |

# భావబంధనము

---

## అంకము. 1.

[మద్రాసులో నొకతోటలో పెద్దబంగాళాముందు వసారా. వసారా ముందు పరామరికలేక వాడిపోవుచున్న పూలమొక్కలు, ఆకుపసందు మొక్కలు నున్నవి. వసారాలో పొడుగుపాటి బల్లముందు పడకకుర్చీలో రంగరాజనే బారిష్టరు, 35 ఏండ్లవాడు సుఖాసీనుడై వివేకానందుని 'రాజ యోగము' పఠించుచుండెను. ధోవతి, సిల్కుషర్టు ధరించియున్నాడు. ఆయన భార్య సుభద్ర, 25 ఏండ్ల వయసు. కోలమొగము, మెఱసిపోయే కన్నులు, నిండైన పెదవులు, నిగనిగలాడే చక్కనిశరీరం. ఆశరీరమునకు శోభగూర్చే కరాచీ పట్టుచీరె ధరించి, చేత టెన్నిసురాకెటు పుచ్చుకొని లోపలినుండి వచ్చి, రాకెటు బల్లపైనిడి, రంగరాజు ప్రక్కకుర్చీలో కూర్చుండును. సాయంత్రం నాల్గుగంటలవేళ.]

**సుభద్ర**—అదుగో! అప్పుడే ప్రారంభించారే చదువు! నిక్షేపం లాగ టీత్రాగి అయిదు నిముషాలైన కాలేదు గదా, ఇంత లోనే గ్రంథపఠనాయాసమా! కొంచెమునేపు కులాసగా కూర్చుండగూడదా? నిన్న క్లబ్బులో తిమ్మరాజు బావగారు చెప్పినంతయు చేయుచున్నారు మీరు!

**రంగరాజు**—(కొంచెము తలయెత్తి) ఏమిచెప్పినాడు తిమ్మరాజు?

**సుభ**—ఏమిచెప్పెనా, క్రిందటివారం ఆనందస్వామిని సందర్శించిన మొదలు దినదినము ఆత్మవిచారణలు చేయడం,

క్రమంగా మీరు స్వామివారి మాఘమతములో కలసి పోవడం, ఏడాదిక్రితం రామకృష్ణవివేకానందుల గ్రంథములు చదవడంతో సడలనారంభించిన మీనాస్తికత యిప్పటికి పూర్తిగా వదలిపోవడం,–అన్నీ చెప్పారు.

రంగ—అబ్బా! తిమ్మరాజెంత గొప్ప ఊహచేసెను! ఇంతటి బుద్ధిశాలి అనుకోలేదు సుమా! సరే: మతిహీనులు, వాచాటులు నగు తిమ్మరాజువంటి పటాలపు టుద్యోగులమాటల కేమిగాని, చిరతరములైన నాదృఢవిశ్వాసములను స్వామి పటాపంచలుచేసెనని నేను స్వామిని సందర్శించిననాడే నీతో చెప్పితిని గదా! నీకిందు ఒరులుచెప్పవలసిన దేమున్నది?

సుభ—మీమాటల కేమిగాని, నిజమునకు తిమ్మరాజులో మీరనుకున్నంత చెడ్డతన మేమిన్నీ లేదు. అతడు ప్రజ్ఞాశాలికాకపోయినా,మంచివీరుడని మాత్రము పేరుచెందినవాడు.ఆయన శౌర్యము ప్రభుత్వప్రశంసకు కూడ పాత్రమవుతూన్నది. యుద్ధానుభవముల నాయన యెంతయో రసవంతముగ వర్ణించి చెప్పగలడు సుమండీ.

రంగ—వినెడివారున్నచో ఎన్నిచిత్రకథలైనను చెప్పవచ్చును. అత డెన్నడును మెసపటోమియా దాటి వెళ్లినపాపమున పోకపోయినను, యూరపులోను, గాలిపోలిలో గూడ ప్రతాపము జూపితినని యెఱుగనివారిచెంత విఱ్ఱవీగుచు, చిత్రవిచిత్రకథలు చెప్పుటలో మొనగాడు. నీవింకనూ వినలేదేమో. ఆస్ట్రేలియనులు, ఘూర్ఖాలు చనక్ దుర్గము ముట్టడించి నప్పుడు తాను గూడ నందుంటిననియు, కెమలుపాషా

పరిరక్షితమగు నాదుర్గమును తాము చేజిక్కించుకున్నతఱి, బ్రిటిషునావికాదళము తమ్ము గాంచి తురుష్కులని పొరపడి తమపై దాడిసల్పి తమప్రయత్నమంతయు వ్యర్థమొనరించి రనియు ఒకకథ చెప్పును.

**సుభ**—ఈవృత్తాంతము నేను గూడ నెచటనో చదివిన జ్ఞాపకము సుమండీ. ఇది యసత్యమేనా ?

**రంగ**—ఆవృత్తాంత మసత్యమన లేదు నేను. తిమ్మరాజుమాత్రము గాలిపోలీకి కాడుగదా, గాలిపోలీకి నూరామడలదూరము లోనికి గూడ పోలేదు.

**సుభ**—ఈమాటల కేమిలెండు. తిమ్మరాజు బావగారికీ మీకు చిన్నతనమునుంచి పడేదికాదట. మీరిద్దరు నెప్పుడు దెబ్బ లాడుకొనేవారట, ఎప్పటి కప్పుడు బావగారిదే పైచేయట. అత్తగారు చెప్పగా విన్నాను.

**రంగ**—దెబ్బలాటకు మాత్రము మావాడు ఘనుడే. వానికి వచ్చినవిద్యయే అది. చదువు సంధ్యలు మాత్రము సర్వ శూన్యము. పొరపాటున మానవుడై జన్మించెనేకాని ఆహారవిహారములయందు వాడు పశువే—తినుటయు త్రాగుటయు తప్ప రెండవగొడవలేని యీయెద్దుమొద్దునకు పాపము మీపెదతల్లికూతురు కామమ్మవంటి సంస్కారవతిని, మృదుస్వభావను కట్టిపెట్టినారు.

**సుభ**—మాకామమ్మకు భర్తవలె నింత తిని, యింత త్రాగి హరించుకొనే శక్తి యేదీ ?

రంగ—తిన చేతగాకగాని, లేనిచో కాముమ్మ గూడ వట్టి తిండి పోతే యనియా నీయభిప్రాయము ?

సుభ—రామ రామ. నేనట్లంటినా? అది దంభస్వభావమాత్రము కాదు. దానిని చిన్నతనమునుండియు నేనెఱుగుదును. అశక్త విరక్తి సుగుణముగా నెంచి మనము సంతసింప నక్కఱ లేదనియే నేను చెప్పినది. నిగ్రహమునకు, అశక్తతకు మనము భేదము గమనింపవలెను. మితాహారులలో చాలమంది అశక్తులే యని నాయుద్దేశ్యము.

రంగ—మితాహారులలో చాలమంది అశక్తులు కావచ్చును గాని, నానా అగచాట్లుపడి తిమ్మరాజువలె పొట్టనింపుకొను తిండిపోతుతనములో విశేషమేమియు లేదు గదా!

సుభ—ఇంతకు, చిన్ననాటివైరములు చావవు లెండు. ఆయన మీాలాయర్లవలె సూక్ష్మమతి కాకపోవచ్చునుగాని, కులోచిత మగు శస్త్రజీవనము నవలంబించుటలో దోషమేమి ?

రంగ—సూక్ష్మమతిదాక నెందుకు, మొదలు మతి యొకటున్నచో గదా!

సుభ—ఈ బుద్ధిజీవిక నేడు వచ్చినదిగాని మనపూర్వులందఱు శస్త్రజీవులే లెండు.

రంగ—కాబోలు, మతికౌశల్య మున్నవారలకు యుద్ధకౌశల్య ముండగూడదా యేమిటి ఆవృత్తి నవలంబించినచో నేనును తిమ్మరాజుపాటి యుద్ధముచేయలేకపోను. పైగా నేటియుద్ధ ములో బాహుబల మక్కఱలేదు. మరఫిరంగులు మాంసపు

కండలను లక్ష్యముసేయవు. కావున యుద్ధములో గూడ బుద్ధిపాటవమే పనిసేయును. ప్రాణిహననముకంటె న్యాయ వాదమే నాస్వభావమున కనురూపమని యెంచి నే నీవృత్తి చేపట్టితిని.

**సుభ**—ఒకటి ప్రత్యక్షహింస, రెండవది పరోక్షహింస. అంతియే భేదముగాని రెండునూ హింసలే యని తిమ్మరాజుగారి యుద్దేశము.

**రంగ**—లాయర్లు పరోక్షహింస మాత్ర మెట్లు చేయుదురు ?

**సుభ**—ఒకనిసొమ్ము హరించి కూటికి గుడ్డకు మాడ్చుట హింస యేనట !

**రంగ**—ఆహాహా, తిమ్మరాజు వితండవాదములను, విపరీత సిద్ధాంతములను చెవియొగ్గి వినువారితెలివి కెంతని సంత సింపను !

**సుభ**—వానిని వినుటకు చెవులు కోసికొనును మాకామమ్మ !

**రంగ**—కామమ్మవంటి గుణవతులగుభార్యల కదియే లక్షణము. భర్తయెడల నామె చూపుచున్న యీగౌరవము ప్రశంస నీయము.

**సుభ**—అట్టి గౌరవమునే మీరు కూడ కోరుదురు కాబోలు !

**రంగ**—కోరనని చెప్పనుగాని, అట్టిగౌరవమున కర్హత సంపా దించుకొనుటకు అర్హుడను కాబోలునను భ్రాంతిచేనైన సంతోషింతును.

సుభ—మృత్యుముఖమునుంచి మీారు తప్పించిన హంతకుని నిజముగా నిర్దోషియని సంతోషించినట్లు.

రంగ—కావచ్చును.

సుభ—చిత్రము సుమండీ. ఒకరిద్దఱు హంతకులను మరణశిక్షకు తప్పించినగాని పెద్దప్లీడరనే పేరు రాదు.

రంగ—చిత్ర మేమున్నది? కొన్ని వేలమంది గొంతులుకోసిన కాని సేనాపతికి మాత్రము పేరువచ్చునా!

సుభ—(నవ్వుచూ) నిజమే. ప్రతివృత్తికి నేదియో అపహాస్యత యుండనే యున్నది. నటులను చూడండి. వారు స్వస్వ రూపము నెంత మాటుపఱచిన నంత పేరు గాంతురు. కావున మన మేవృత్తిని వ్రేలు చూపి ఆక్షేపింపగూడదు. అరసి చూచిన అన్నివృత్తులకు ఆక్షేపణలుండును. కనుక మన మీావివాద మింక చాలించి విషయాంతరమునకు వత్తము. రేపు క్లబ్బులో బిలియర్డ్సు పందెము గాబోలు. మీారు చూడ వచ్చెదరా?

రంగ—రేపు నేను ఆవడి వెళ్లి బ్రహ్మానందయోగిదర్శనము చేయవలెను.

సుభ—దినదినము నావడిలో ఆనందస్వామితో ప్రసంగించుచునే యుంటిరిగదా, అది చాలక మరల బ్రహ్మానందయోగిని దర్శింపవలసి వచ్చినదా? ఈసంగతి తిమ్మరాజుగారితో తెలిపిన నెంతయో వినోదింతురు.

రంగ—నావ్యవహారము లన్నియు నాతనికి చెప్పుచుండుట తప్ప నీకు వేరుపని లేదా యేమిటి?

సుభ—ఇది యేమంత చెప్పగూడని తప్పుపనియా?

రంగ—అతగాడికి నావ్యవహారములు తెలియవలసినపని లేదు.

సుభ—మఱి మీరు బ్రహ్మానందయోగిని దర్శించుట యెందులకో చెప్పండి.

రంగ—ఆత్మజ్ఞానవిషయము చర్చించుటకు.

సుభ—స్వామివారు మౌనవ్రతులట, ఎవరితోను చర్చింపరటగా ?

రంగ—నీతో నెవరు చెప్పిరి?

సుభ—తిమ్మరాజుగారే.

రంగ—నీతిమ్మరాజు నీట గలసిపోను. క్లబ్బులో నుబుసుపోకకు నీకు మఱియెవ్వరు దొరకరా యేమి?

సుభ—వారితో మాట్లాడుట దోషమా?

రంగ—దోషమని కాదు. అతని కల్లబొల్లికథలనిన నాకు తలనొప్పి. ఇంతకు స్వామి నాత డెపుడు దర్శించెనో?

సుభ—ఆయన చూడలేదండీ. ఎవరో చెప్పగా విన్నారట. ఆమాటలమాట ఆనందస్వామికి వీరు గురువులట! వీరు చాలా మితభాషులట! అట్టి మౌనవ్రతులతో మీ రెట్లు సంభాషింతురా యని.

రంగ—సంభాషింప నక్కఱయే లేదు. ఆనందస్వాములవారు చెప్పినారు. వారిసన్నిధానమాహాత్మ్యమే సమస్తసంశయములు నివారించునట. అవసరమైనచో తాను చెంతనే యుండును గనుక సంశయములు తీర్పింతుమని చెప్పినారు.

**సుభ**—ఈప్రగల్భముల కేమి లెండి! చూచెదముగా! మీరు ఆవడి వెళ్లుట యెప్పుడు? మరల రాక యెప్పుడు?

**రంగ**—సాయంత్రము నాల్గు గంటలవేళ వెళ్లి రాత్రి పదిగంటలకు తిరిగి వచ్చెదను.

**సుభ**—అయితే బిలియర్డ్సు పందెముల కుండనే యుండరు

**రంగ**—ఉండను.

**సుభ**—అవును. మీవైఖరియే మారుచున్నది లెండు. మీరు మధుమాంసములు, ఆటపాటలు, మాని ఎన్నినాళ్లైనదో చెప్పండి. చక్కగా రెండుపూటల నింత మాంసము తిని, నోరూర మధుపానముచేసి, అర్ధరాత్రిదాక ఆటలతో కాలక్షేపముచేయుమనిషి సంవత్సరమైన కాలేదు. ఎంత మారిపోయినారు? ఎంతసేపు ఆత్మవిచారణలతో, ఆకాశ హర్మ్యములతోడనే సరిపోవుచుండెను. మీరిట్లు మారి పోవుదురని యేడాదిక్రిత మెవరనుకున్నారు?

**రంగ**—నిజమే కాని, ఈమార్పు విచారింపదగినదిగాదు. నాలో నిపు డాత్మశక్తి నిండి నిట్టవోడుచుచున్నది.

**సుభ**—మీపుణ్యమాయె, దానిని మాత్రము వెలివిరియనీకండి.

**రంగ**—ఈ హాస్యముల కేమిగాని సుభద్రా! నీవీజోలి యించుకయు బట్టించుకొనవు గదా.

**సుభ**—నిజము. నాకీ చావుపుట్టువుల విచారణచేత తలనొప్పి వచ్చును. ఐహికచింతలకే కాలము చాలకున్నప్పుడు పర చింతలచే నిష్కారణము కాలహరణము చేయుట దోషము

కాదా! ఈ అస్తినాస్తివాదము లోనఱ్చుటకంటె మనము బ్రతికినన్నాళ్లు సుఖసంపాదన మెట్లా యనువిచారణము మేలుగాదా!

**రంగ**—ఇంతకు నీశ్వరు డున్నాడని నమ్ముదువా, నమ్మవా?

**సుభ**—నమ్ముదునుగాని, ఆయీశ్వరుని గుణరూపవిచారములతో నాకు పనిలేదు. మనబుద్ధికందని యీవిషయమున వివరించినకొలది భేదభావములు పెఱిగి మూఢవిశ్వాసములు బలసి, యీబ్రదుకు దుఃఖభాజనమైపోవుటతప్ప ఫలములేదు. ఈజ్ఞానముగూడ నొకమత్తువంటిది. మత్తుమందు లన్నిటివలె నీజ్ఞానమత్తుగూడ ధనమును, శక్తిని, జీవితమును హరించును. ఈశుష్కవాదములు, వ్యర్థప్రలాపములు, విపరీతభావనలు, ముదిరినచో నది జ్ఞానసన్నిపాతముగా పరిణమించును. అయినను, నాకీ గొడవయేల? నాకు టెన్నిసువేళ యైనది. మీరు కూడ రండు—పోదము. చాలదినములయినది టెన్నిసాడి!

**రంగ**—ఈగ్రంథము పూర్తిచేసిగాని నేను కదలజాలను నీవు వెళ్లిరమ్ము.

**సుభ**—సరిపోయె, ఇకనేమి? మీరీ ఆకాశసౌధనిర్మాతలవలలో పూర్తిగా చిక్కితిరి.

**రంగ**—ఆమహాయోగితో ప్రసంగింపనేగుటకు ముందు ఈగ్రంథము చదివి విషయమున ప్రవేశించుట మంచిదని ఆనందస్వామి చెప్పినారు. గ్రంథము మనోహరముగ నున్నది. నాలుగుముక్కలచట నచట వినిపింతును, విందువా? ఎంత? పదినిముసములుకూడ పట్టదు.

**సుభ**—మీ గ్రంథమునకు మీకు నొకనమస్కారము. నన్ను పోనిండు. ఇంతకన్న నాకు టెన్నిసుమీదనే యెక్కువ మక్కువ. అదిగో! కారు సిద్ధముగా నున్నది. సెలవు మఱి (వెళ్లును).

**రంగ**—(తనలో) సుభద్ర కచ్చముగా తండ్రి పోలికయే వచ్చినది. ఐహికలోలమగు దీనిమనస్సుకు పరచింతనము, తత్త్వవిచారములు గిట్టవు. దానికడుపు చల్లగా సుభద్రనాలుక కబద్ధములురావు. మనసులో మాట నిశ్చయముగా మొగమునెదుట చెప్పివేయును. అపరూపమగు నీసుగుణమునకుతోడు దీనికించుక పరతత్త్వవిచారము పట్టుపడిన బాగుండును. అప్పు డీతిమ్మరాజువెఱ్ఱిమొఱ్ఱికథలపై నాస్థ తగ్గిపోవును. ఏమో! ఎవరు చూచిరి? ఏడాదిక్రితము నేనుమాత్రము సుభద్రతో పాటుగాదా! ఇంకొకయేడు తిరిగివచ్చులోపల నదిమాత్రము నావలె మాఱిపోగూడదా? సరి, పుస్తకము పూర్తికాకముందే చీకటిపడినదే (అని గదిలో దీపపువెలుగున చదువుచుండును).

(తెర పడును.)



## అంకము. 2.

[మఱునాఁడు సాయంత్రము 5 గంటలవేళ ఆవడిలో, సత్రపుఆవరణలో, ఆనందస్వామి, రంగరాజు ప్రసంగించుచుందురు.]

రంగ—అగుచో, నాసంశయములు వారి నడుగవలదందురా?

ఆనం—మీరడుగ నక్కఱయే లేదు. మనమనస్సులో బాధించు సంశయములన్నియు స్వామి కెఱుకయే. స్వామి కనుగ్రహము పొడమినచో వారి ఆత్మజ్యోతి మన మనఃకుహరముల యందలి సంశయాంధకారమును పటాపంచలొనర్చి శాంతి ప్రవాహములో నోలలాడించును.

రంగ—అది సాధ్యమా యని ?

ఆనం—స్వామి సన్నిధానమున నొకముహూర్తము కూరుచున్నపిమ్మట నంతయు నీకే తెలియగలదు. నిశ్శబ్దమగు నెడారిలో, నీరవమగు నిశీథమున మృతుడైన ప్రియమిత్రముచెంత, నిదురించుచున్న శిశువుచెంత నున్నప్పుడు మనయాత్మల నెట్టిప్రశాంతి నెలకొనునో ఆలోచింపుము. అట్టిచో బ్రహ్మానందస్వామివంటి నియతాత్మునిమౌనముద్ర ఎంతకైన చాలదా? లోని కరుగుదము రమ్ము. అచట నొక ముహూర్తము కూరుచున్నపిదప నీసంశయములు తొలగకున్నచో, నన్నే ప్రశ్నింతువుగాని రమ్ము.

రంగ—నాకులగోత్రనామములు స్వామి కెఱుక పఱుతునా ?

**ఆనం**—(నవ్వుచు) ఏమియు వలదు. లోని కెందఱో వచ్చుచు పోవుచు నుందురు. స్వామి కాజోలియే పట్టదు. ఇచట నట్టి యాచారలాంఛనము లెవ్వియు లేవు. మనయిష్టము వెంట పోవచ్చును రావచ్చును.

**రంగ**—మఱి ప్రభువులు మున్నగు పెద్దలు వచ్చినపుడో ?

**ఆనం**—స్వామి కందఱు నొక్కటియే. పెద్ద పిన్న, కలవాడు లేనివాడు, ఉత్తమకులుడు హీనకులుడు, స్త్రీలు పురుషులు, అందఱు వారికి సమానులే. అట్టిభేదమును పాటింపనివారే స్వామిని దర్శింపవత్తురు.

**రంగ**—స్వామి మహానుభావులు. వారి కందఱు నొక్కటియే కావచ్చునుగాని వచ్చెడివారి కెట్లులైన నించుక కష్టము దోపక మానదు. మానవమాత్రు లందఱు తమతమ కుచితమైనగౌరవము నభిలషించుట సాజము. మనము బ్రాహ్మణ క్షత్రియులయెడ నెల్లవారియెడ చూపుగౌరవముకూడ, నది మనఃపూర్వకము గాకున్నను, వారివారి కది మనస్సులో నెలకొని పరిపాటియై పోవును. పిమ్మట నట్టి గౌరవము లోపించినచో వారి కెంతయో కష్టమనిపించును.

**ఆనం**—వారి నిగ్రహానుగ్రహములతో స్వామికి నిమిత్తము లేదని తెలిసినమీదట నాకోపమంతయు చల్లారును. రండు. మనము లోనికేగుదము.

(ఉభయులు చావడిలోనికి వెళ్లుదురు. చావడిలో నొక వైపున ప్రశాంతవదనుడు, సమాధిస్థుడు నగుబ్రహ్మానంద యోగి కూర్చుండియుండును. ఏబదియేండ్ల వయస్సుండును

వారికి. పదిపండ్రెండుగురు వారిని చుట్టు నిశ్శబ్దముగా కూర్చున్నారు. నెమ్మదిగా వెళ్లి లోపల కూర్చున్న యీ క్రొత్తవారి నెవ్వరును వారెవరును పరికించినట్లు లేదు. సమాధిలోనున్న స్వామి దర్శనమాత్రముననే రంగ రాజులో భక్తిభావ ముప్పతిల్లెను.)

రంగ—(తనలో) బ్రహ్మజ్ఞానిలక్షణములన్నియు వీరియందు పొడకట్టుచున్నవి. నాసాగ్రస్థితమై కాన్పించుచున్నను అనంతమున లీనమగుచున్న ఆనిశ్చలదృష్టి యెక్కడ! జాగ్రదవస్థ యెక్కడ! పరమజ్ఞానమునకు, అతిలోకమైన విశ్వాసమునకు, అపారమైన కరుణకు నిలయమైన దివ్యమంద హాసరోచులు స్వామి యధరముపై తాండవించుచున్నవి. నన్ను చూపుచేగాని చిఱునవ్వుచేగాని పల్కరించి సంభావింపకున్ననూ, నన్ను చులుకచేసినట్లు లేదు. ఎదురువచ్చి గాఢాలింగనము చేసినదానికన్న ఈమౌనసంభావనమే నాకు పరమహర్షదాయకముగా నున్నది. ఏమి చిత్రమో నాకిచట నేమియు క్రొత్త యనిపించుటలేదు సరిగదా! యిన్నాళ్లిచటి కేలరానైతినా యనిపించుచున్నది. ఇక చిత్తము నవహితమొనర్చెదనుగాక.

(ఇట్లు పదునైదునిముసములు కూర్చున్నమీదట సంశయ నివారణార్థము వాదమునకు సిద్ధపడివచ్చిన యాతని వైఖరి మార్పుచెంది, అచట నందఱవలెనే శాంతిలో నోలలాడుచున్నట్లుండెను.)

రంగ—(తనలో) ఓహో! ఈమౌనమున నెంతటి ప్రభావమున్నది! స్వామినుండి బహిర్గతమగు శక్తి యేదియో

నాలోనికి, యిచటివా రందఱిలోనికి కిరణములవలె ప్రవే శించుచున్నది. కావుననే యిచట యింత నిశ్శబ్దత, ఇంత ప్రశాంతి. నేను వచ్చునపుడు అతిముఖ్యములని యెంచు కున్న నాసంశయములన్నియు నిపుడు నిస్సారములై తోచి, ఇచటి ప్రశాంతికి భంగము లగుదుమనుభీతిచే పటాపంచలై పోయినవి. నాసందేహములన్నియు భాస్కరోదయముచే మాయమయిన మంచుబొట్లయి పోయినవి. ఈవిషయ మంతయు ఆనందస్వామికి తెలుపుదును. (ప్రకాశముగా ఆనందస్వామితో) నాకు సంశయనివారణమైనది. ఇదియేమి ప్రభావమో కాని మీరు తీర్పజాలని నాసందియముల నిచటి 'పావనగంభీరప్రశాంతి తీర్చినది. (ఆనందస్వామి మాఱు వలుకడు. అచటివా రెవ్వరు నీమాటలు వినిపించు కొన్నట్లు లేదు).

**రంగ**—(తనలో) ఈనిశ్శబ్దతలో నెంతటి మహిమయైన నున్నది. నేను కూడ నాప్రలాపముల నిక చాలింతును. నాలోని ప్రతిస్నాయువును అనంతముతో మేళవించిన తంత్రులవలె స్పందించుచున్నది. ఆనందస్వామి చెప్పినమాటయే నిజము. ఈశ్వరు డుండియే తీరవలయును. (అంతట వివశుడై లేచి సమాధివదలుచున్న బ్రహ్మానందయోగి పాదములకు ప్రణ మిల్లును. బ్రహ్మానందయోగి అంతకంతకు పెఱిగి చావడి యంతయునిండుచున్నట్లాతనికి తోచును. బ్రహ్మానందయోగి, హస్తము సాచి, శిరముపై కమండలూదకము చల్లినట్లు తాను పవిత్రుడైనట్లు తలచును. అంతట శాంత్యానందపార

పశ్చ్యమున లేచి, ఆనందస్వామికి సన్న చేసి వెలుపలకి వెళ్లును. ఆనందస్వామి యాతనివెంట వెళ్లును.)

**రంగ**—నాకింక సంశయ లేశమైనను లేదు. బ్రహ్మానందభాస్కరుని జ్ఞానకాంతిచే సంశయాంధకారము విరిసిపోయినది. నన్ను తమ శిష్యపరమాణువుగా గ్రహించి యాశీర్వదింపుడు (ప్రణమిల్లును).

**ఆనం**—(లేవదీసి) వత్సా! ఇతోప్యధికైశ్వర్యము సుఖముగల్గి వర్ధిల్లుము.

**రంగ**—నాకు జ్ఞాననేత్రమును ప్రసాదించిన తమయనుగ్రహ ఋణము నేనెట్లు తీర్చుకొందును. స్వామీ! నాకింక నిష్టదేవతను పేర్కొని మంత్రోపదేశము చేయుడు.

**ఆనం**—(శ్రీకృష్ణవిగ్రహ మొకటి తీసియిచ్చి) వత్సా! యీ కృష్ణపరబ్రహ్మము నారాధింపుము. నీకు కీడొనర్చినవారెవ్వరైన సరే, తప్పిద మొప్పుకొని, పశ్చాత్తాపముజెంది, నీక్షమ నర్థింతురేని, అట్టివారిని సైరించి త్రికరణయా నిర్దోషులుగా నెంచుట నీకు ధర్మము. ఇదియే నేనుచేయు పరమోపదేశము.

**రంగ**—ధన్యుడను స్వామీ! ధన్యుడను. (మరల ప్రణమిల్లి) మీయుపదేశము సర్వథా అనుసరింతును. ఎట్టి ఘోరాపరాధమైన సహింపవలసినదే కదా ?

**ఆనం**—ఆహా! నీకు ప్రాణహాని తలపెట్టినవానినిగూడ క్షమింపవలసినదే.

రంగ—నేనింక నీ నూత్న జీవితమార్గమును అనుసరింప సన్నద్ధుడ నగుదును. నాకు మార్గోపదేశ మొనర్చి సెలవిండు.

ఆనం—మధుమాంససేవనము పూర్తిగా వర్జింపుము అనుదినము శ్రీకృష్ణపూజానంతరము భగవద్గీతాపారాయణము సల్పుము. ఆరుమాసము లిట్లు ఆచరించినమీాద కామక్రోధలోభదూరుడవై కాశీప్రయాగాదిపుణ్యక్షేత్రములు సేవింపుము. నాతీర్థాటనము ముగించుకొని మరల నొకసంవత్సరములో నీకు మదరాసులో దర్శనమిత్తును. అప్పటికి నీవీజ్ఞానమార్గమును చాలవఱకు గడచిపోవుదువు.

రంగ—తమతీర్థయాత్రలో నేయేప్రదేశములు దర్శింతురో?

ఆనం—అమరనాథ, పశుపతినాథ, మానససరోవరములను, లాసాయును దర్శింతును.

రంగ—టిబెట్టులో దర్శనీయములగు విశేషము లేమియున్నవి స్వామీ?

ఆనం—ఎన్నియో యున్నవి. టిబెట్టన సామాన్యదేశము గాదు. భౌతికముగా, ఆధ్యాత్మికముగా గూడ నాదేశము వన్నె కెక్కినది. నేటికి నెందఱో మహర్షులకు నిలయమగు నాపుణ్యభూమి నజ్ఞులు నిందింతురు. కాని మహాత్ముల కది దివ్యతీర్థము. దానిని సేవించుటకు కొంత సంస్కార మవసరము. హిమాలయపర్వతకందరాభాగములనైన గడచినవారికిగాని టిబెట్టు నిజస్వరూపము సాక్షాత్కరింపదు. అనధికారుల కచట వట్టి రాళ్లుతిప్పలు మాత్రమే కానుపించును.

రంగ—అగుచో, నన్నిపుడు టిబెట్టు దర్శింపవలదందురా?

ఆనం—ముందు భారతపుణ్యభూమిని దర్శింపుము. మఱి యైదేండ్లకు టిబెట్టును దర్శించు నధికారము నీకు లభింపగలదు.

రంగ—చిత్తము. తమయాజ్ఞ శిరసావహింతును. స్వామీ! మఱియొక మనవి. మధుమాంససేవనము వర్జింపుమనిగాని, నాతో తీర్థములు సేవింపుమనిగాని నాభార్యను నేను నిర్బంధింపవచ్చునా ?

ఆనం—వలదు. కాలక్రమమున, నూత్నమార్గావలంబనముచే నీకలవడిన శాంతదయాసౌశీల్యము లామె కనుభూతమైన కొలది తనయంత తానే దారికి రాగలదు. మతప్రచారమునకు తదాచరణముకంటె నుత్తమమార్గము లేదు. బలవంతముగా మధుమాంసములు మాన్పించి, తీర్థములవెంట త్రిప్పి ప్రయోజనములేదు. నిర్బంధముగా త్రావించిన ఆముదమువలె నది వెళ్లిపోవునేగాని వంట బట్టదు.

రంగ—చిత్తము. మధుమాంసములు మాత్రము నాయింటికి రానీయను. ఆమెను మాన్పించుటకు కాదుసుడీ! నేను వర్జించితిని. గనుక ఇంక నాకు సెలవొసంగుడు. జ్ఞానోదయముచే గలిగిన శక్తి యొకవంక, విఘ్నభీతిచే కలుగు నధైర్య మొకవంక నన్నలజడి పెట్టుచున్నవి. జ్ఞానప్రాప్తిచే నొకవంక నానందము జనించుచుండ, నాభార్యయుపేక్ష, అనాదరము లొకవంక విచారము గూర్చుచున్నవి. తమరు మరల దర్శనమిచ్చులోపల నామెనునామతమునకు త్రిప్పుకొనగల్గునట్లు నన్నాశీర్వదింపుడు ?

ఆనం—వత్సా! నీకింక నాసంశయము వలదు. అనన్యలబ్ధమగు బ్రహ్మానందయోగీంద్రుని యాశీర్వాదభాగ్యము లభించిన నీవు కృతార్థుడవగుటకు సంశయమా? నీకు శాంతి విజయములు లభించుగాత (రంగరాజు నిష్క్రమించును. ఆనందస్వామి సత్రపుచావడిలోని కేగును.)

(తెర పడును.)

---

## అంకము. 3.

---

[పిమ్మట నాలుమాసములకు రంగరాజు బంగళా వసారాలో గది. రంగరాజు కుర్చీలో కూర్చుండి, రైల్వేపటము, గైడు పరికించుచుండును. మొగమున నసంతృప్తియు, క్రోధమును వ్రేల సుభద్ర ప్రవేశించును.]

**సుభద్ర**—నాకోసము కబురంపితిరట ?

**రంగ**—అవును సుభద్రా! కూర్చో. మనము రెణ్ణెలలపాటు తీర్థయాత్రలు చేసిరావలెనని యున్నది.

**సుభ**—నన్ను వదలిపెట్టండి; నాకంత కుతూహలం లేదు.

**రంగ**—నీవుకూడ నెట్లైన రావలయునని నాకోరిక, పైన నీయిష్టము; నిన్ను బలవంతముచేయను.

**సుభ**—నాకు రావలెననిలేదు.

**రంగ**—ఎందువలన ?

**సుభ**—ఎందువల్లనో మీరే యెఱుగుదురు. తీర్థములు, అటువంటివాని మీద నాకు నమ్మకము, భక్తి లేవు. ఉన్నట్లు నటింౘడం నాచేతకాదు. పిల్లలు, నేను ఇంట్లో ఉంటాము. అత్తగారు, మీరు వెళ్లిరండి.

**రంగ**—నిన్నువదలి వెళ్లడం నాకెంతైన కష్టముగా నున్నది. కాని, నీకిష్టము లేనపుడు నేనేమి చేయగలను? నాలో

ఈయాఱుమాసములనుండి కలిగినమార్పు నీలో అణు మాత్రమైనా పారలౌకికచింత కలిగింపలేదు కదా!

**సుభ**—కలిగింపకపోగా, నాప్రాతనమ్మకములు మఱింత బల పడినవి. మీలోనిమార్పువలన నాపూర్వపుటుత్సాహము, సంతోషము పోయినవి. అయినా, నాసంతోషము, ఉత్సాహము ఎవరికి కావలెను?

**రంగ**—అదియేమి! నీసంతోషము నాకక్కఱలేదా? ఆహార విహారములందువలెనే నీయందు గూడ నిగ్రహ మవ లంబించితినేకాని, నీయెడల నాప్రేమమాత్ర మించుకయు లోపించలేదు. తొంటికంటె స్వచ్ఛతరముగ నిన్ను ప్రేమింపు చున్నాను నీకొఱకు నాప్రాణములైన తృణప్రాయముగా అర్పింపగలను. తొల్లిటిది విషయలోలత; నేటిది కాకలుతీఱిన పవిత్రప్రేమ.

**సుభ**—కాకలుదీఱుటలో ఆవిరియై హరించిపోవుటయు గద్దు.

**రంగ**—నాప్రేమమాత్ర మట్టిదికాదు. ప్రేయసీ! ఎందులకు నీ కీవ్యాకులభావము?

**సుభ**—నామనస్సు పూర్వపువినోదములను, రసాంతరమును గోరుచున్నది.

**రంగ**—ఎందులకాకోరిక నీకు? మాఅమ్మను చూడుము. ఆమె యెట్లు సరిపెట్టుకొనిపోవుచున్నదో.

**సుభ**—ఆమె విరాగశీల. ఆమెవలె కూరాకులుదిని, మంచినీళ్లు త్రాగి నేను ఉండలేను. పుట్టినింటగూడ నామె యీశాకా

హారమున కలవాటుపడినదే గనుక ఈమార్పు ఆమెకు క్రొత్తచేయలేదు. నాపుట్టినింట నట్లుకాదు. మానాన్నగారు గూడ మీవలె బారిస్టరుకావడంచేత మాకు నిత్యము మధుమాంససేవన మలవాటైనది. పెండ్లినాటికి నా అలవాట్లు మీరెఱిగిఉండికూడా అభ్యంతరం చెప్పలేదు. తరువాతనైనా మనం చాలాకాలం మధుమాంసములు సేవిస్తూ, రోజూ క్లబ్బుకువెళ్లి పేకాట ఆడుకుంటూ, స్నేహితులతో కులాసగా కాలక్షేపం చేసాము. ఇప్పుడేమున్నది? అదియంతా మాఱిపోయింది. ఆమధుమాంససేవనం, ఆవిందులు, ఆయాటలు అన్నియుపోయి మీరు బ్రాహ్మణాచారంలో పడిపోయినారు. నిత్యము దేవతార్చనలు, జపాలు, పారాయణాలు, పురాణాలతో సరిపోవుచున్నది. మీతో వైరాగ్య ప్రసంగములుచేసే ఆమూఢులందఱూ, తమకు పరలోకం ఎదురైవస్తున్నట్లు మాటలు చెప్పడమేకాని,నిజానికి వాళ్లేమీ బుద్ధిహీనులు గారు. సంపదలు బంధకారణమని మనకు చెప్పి, తమసంసారములు బాగుచేసుకొంటున్న యీవంచకులమాటలు నమ్మే మనమే బుద్ధిహీనులం. ఆపూర్వపు సౌఖ్యాలకోసం నామనస్సు అఱ్ఱులు చాస్తున్నది.

**రంగ**—సుభద్రా! నేనెన్నడైన నిన్ను క్లబ్బుకు పోవలదంటినా? మాంసాహారము మానుమని నిర్బంధించితినా? చెప్పుము. నాయాత్మోన్నతి కవసరం గనుక మనయింట మాంసాశనము మాన్పించితిని. నీవు మీబంధువులయిండ్లకు వెళ్లినపుడు నీయిష్టమువచ్చినట్లు తినవచ్చును గాదా!

**సుభ**—'మాంసమునకు మొగము వాచితినమ్మా'యని ప్రతి దినము నింటింటికి వెళ్లి నేను విందు లారగింపవలెనా?నాయింటికి వచ్చినపుడు వారికి చప్పిడికూరలు నన్నము పెట్టి, వారియిండ్ల నేమొగముపెట్టుకొని మద్యమాంసములు సేవింతును? మీరు రాకుండ నేనొక్కతెను క్లబ్బుకుమాత్ర మెట్లు వెళ్లుదును? 'చాదస్తపు శాస్త్రులుగారిభార్య వచ్చిన' దని అచటివారందఱు వేళాకోళమాడిన నేనోర్వగలనా? పోనిండు. ఏది యెట్లైనను (కొంచెము తలవంచి) నాకు భార్యయని పేరేగాని సంసార సౌఖ్యమైన నున్నదా?

**రంగ**—సుభద్రా! గృహస్థధర్మము వంశము నిలుపుటకేగాని కామోపభోగముల నోలలాడుటకుగాదు. మనకు రెండు నలుసులు జనించుటచే ఆప్రయోజనము తీఱినది. ఇప్పటిలో నంత సంతానవాంఛ అవసరములేదు గావున నేను రెండు మూడేండ్లు బ్రహ్మచర్యవ్రతము సలుప నెంచితిని వ్రత సమాప్తియగువఱకు మనము ఇంద్రియోపభోగములమాట తలపెట్టరాదు.

**సుభ**—'బలవానింద్రియగ్రామః' అనిరికదా పెద్దలు.

**రంగ**—నిజమేకాని మనస్సునకు లొంగవనిరా?

**సుభ**—మీమనస్సునకు లొంగవచ్చును. నామనస్సునకు లొంగకపోవచ్చును. అదియునుగాక, గృహస్థధర్మమునుగూర్చి మీరుచెప్పినదే సిద్ధాంతమని నమ్మకమేమి?

**రంగ**—నాయాత్మ అట్లు బోధించుచున్నది. వేదములట్లే చెప్పుచున్నవి. నాగురువు ఆనందస్వామియు నట్లే చెప్పిరి.

**సుభ**—మనయాత్మ మనము కోరినట్లెల్ల చెప్పును. వేదములు బూజుపట్టినవి. ఆకృతయుగధర్మము లిపు డెవరికి గావలెను ? ఇక ఆనందస్వామి చెప్పెనంటిరా, అతఁడు సన్యాసి. గృహస్థ ధర్మమునుగూర్చి ఉపదేశించుట కాయన కనుభవముచాలదు. నిక్షేపమువంటి సంసారమున కాయనయే ఇన్నితిప్పలు తెచ్చి పెట్టినది.

**రంగ**—అపచారమపచార, మట్లనకుము. నాకు తరణోపాయము చూపిన మహానుభావు డాయన.

**సుభ**—నన్ను ముంచినవాడును.

**రంగ**—అనగా, నీయభిప్రాయ మేమో స్పష్టముగా జెప్పుము.

**సుభ**—నాకు మునుపటివలె భోగానుభవము కావలెను. రుచి యైన భోజనము, మధురమైన పానము కావలెను. కాల హారణమున కాటపాటలు మొదలైన వినోదములు, మిత్రు లతో కాలక్షేపము, సాయంసమయవిహారములు గావలెను. నేను వయోవతియైన భార్యనుగాని, పరలోకమున కునికి పాట్లు పడగోరు మూడుకాళ్ల ముత్తయిదువనుగాను.

**రంగ**—నామతమునకు విరుద్ధములగు నీకోర్కెలు నేనెట్లు చెల్లింపగలను ? ఎప్పటికైన నీవును నాదారికి వచ్చెడిదానవే.

**సుభ**—మఱి యిరువదేండ్లపై మాట యది. ఈలోపల నాకు మీావైరాగ్య మక్కఱలేదు.

**రంగ**—వలదు సుమీ! ఇరువదినెలలుగూడ నక్కఱలేదు. వెఱ్ఱిదానా! ఇరువదిమాసముల క్రింద నేనెటులుంటినో, ఇపు డెటులైతినో యోజించుకొనుము. నేనింక నీపద్ధతినుండి వెనుకకు రాజాలను.

**సుభ**—నాకొఱకైన రాజాలరా?

**రంగ**—విశ్వమంతయు నాకు బాధా క్రాంతమైనను వెనుకకు రాను.

**సుభ**—ఇప్పుడేకదా అంటిరి! 'నీకొఱకు ప్రాణములు తృణ ప్రాయముగా నర్పింతు' నని.

**రంగ**—నిజమే. ప్రాణమిచ్చుట కెపుడైన సిద్ధమే. కాని ఆత్మ హానియొనర్చి పరలోకహాని చేసికొనజాలను.

**సుభ**—ప్రేయసికొఱకు ఆత్మహానికైనను పరలోకహానికైనను సిద్ధపడునదియే నిజమైనప్రేమ.

**రంగ**—అది కేవల కామపరాయణులగు ఆత్మజ్ఞానహీనుల్యుల విషయము.

**సుభ**—పుట్టెడు ఆత్మజ్ఞానముకంటె స్వచ్ఛందమగు నొక్క ప్రేమాగ్నికణము మేలు.

**రంగ**—పోనిమ్ము. మన మీవిషయమున వాదించి ఫలములేదు. ప్రకృతాంశమునకు వత్తము. నీవు ముమ్మాటికి తీర్థయాత్రకు రానట్లేనా?

**సుభ**—ముమ్మాటికి రాను.

రంగ—దేశాటనమనిన నీపూర్వపు టుబలాటమంతయు నేమైనది ?

**సుభ**—పూర్వపు మీకులాసా, మీభోగాసక్తి, మీఉత్సాహం, మీచతురత్వం ఎక్కడికి పోయినవో, నాయుబలాటము నక్కడికే పోయినది. నాకిపు డేయుబలాటమును లేదు. నాబిడ్డలను కనుపెట్టికొని యింటిలోనే పడియుందును.

రంగ—ఇంటనున్నచో మాత్రము నీవు కోరెడియానందము లభ్యమగునా ?

**సుభ**—కాకున్నమానె. మీశాస్త్రులు, వేదాంతులు చెప్పెడి మెట్టవేదాంతపు గొడవనైనా తప్పును. స్వర్గముకోస మిచట ధనము వెచ్చించి టిక్కెట్లుకొనుట నేను చూడజాలను. చిత్త సంస్కారం, ఇంద్రియజయం అనేరోత ప్రసంగాలు వింటూ నల్గురిలో నేను నగుబాటు కాలేను. ఇంతకు నాకు వాగ్వ్యయమేకాని నామాటలు మీకు చెవిదూరవు. పోనీ, నామాటలు మీకు కోపంపుట్టించినను సంతోషింతును. అదియును లేదు. అది యేమిపాపమో! వట్టిహృదయశూన్యత వచ్చి పడినది. నేనెంత మొత్తుకొన్నను అరణ్యరోదనమేకాని ఫలము లేదు. తీయనై, తేటనై, హృదయహారియైన చెలమనీటివంటి మనిషి, వడపోసి, సీసాలోపట్టి, మూతిమూసిన నీరసపు నిలువనీటివంటివారై పోతిరి. నాకింక సెలవిండు.

**రంగ**—మంచిది, నీయిష్టము. మావెంట రానందులకు పిమ్మట విచారింతువు. ఆలోచించుకొనుము.

**సుభ**—విచారింపను లెండు. (నిష్క్రమించును.)

**రంగ**—మరే! దీనికింకను మనసు మారలేదు. అయినను చూచెదగాక. ఎంతకటికచీకటియైనను తెల్లవారకపోదు. నేనిక ప్రయాణపు మజిలీలు చూచుకొందును. (కాగితముపై యాత్రాస్థలములు, రైలువేళలు వ్రాసికొనును.)

(తెరపడును.)

---

## అంకము. 4.

---

[పిమ్మట రెండుమాసములకు. మద్రాసులో రంగరాజు బంగాళా. సాయంత్రం మూడుగంటలవేళ. రంగరాజు తీర్థాటనము ముగించివచ్చెను. వసారాలో సుభద్రతో కూర్చుండి టేనీరు త్రాగుచున్నాడు. రంగరాజు చాల నుత్సాహముగా నున్నాడు. సుభద్ర అనుత్సాహముగా, విచారపరీతయై యున్నది.]

రంగ—దైవానుగ్రహమువలన తిరిగి సుఖముగా నిన్ను, పిల్లలను చూడుకొనగలిగితిని. స్పెషలురైలులో ఈరెండు నెలలు ఎంతకులాసాగా గడచినవి! ఎన్ని దివ్యక్షేత్రములు, తీర్థములు సేవించితిమి! తుంగభద్ర, పండరిపురము, నాసిక, పూనా, ద్వారక, మధుర, బృందావనం, ఢిల్లీ, ఆగ్రా, హరిద్వారం, కాశి, గయ, ప్రయాగ, కలకత్తా, కామాఖ్య, పూరి, సింహాచలం, భద్రాచలం, తిరుపతి, శ్రీరంగం, మధుర, రామేశ్వరం అన్నియు సేవించితిమి. నీవురాని కొఱతతప్ప అన్యచింతలేదు. నీవైనను ఇపుడు విచారించుచుంటివి రానైతినని. (సుభద్ర కంట నీరుపెట్టును.) అదియేమి! సుభద్రా! దుఃఖించుచున్నావు. బొత్తిగా చిక్కిపోతివి సుమా! ముఖమున విచారభావము నెలకొన్నది. వలదు. కంట నీరుపెట్టకుము. నీమనసులో వ్యాకుల మెద్దియో నాతో చెప్పుము. (లేచి, సుభద్ర వీపుపై నల్లన తట్టుచు, బుజ్జగించును. సుభద్ర వెక్కి వెక్కి యేడ్చుచు నేదియో చెప్ప

బోవును) అడుగో! తిమ్మరాజు సిద్ధమైనాడే! సరిపోయె. నీతో నించుక యేకాంతముగా కష్టసుఖములు ముచ్చటించుకొనకుండ నీదౌర్భాగ్య మెచ్చటనుండియో వచ్చిపడినాడు. తీర, వచ్చినవానిని మర్యాదచేయక తప్పదు.

**సుభ**—(లేచి) నేను లోపలికి వెళ్లుదును. ఆతని మొగము చూచిన నాకసహ్యము.

**రంగ**—నిన్నాతడు చూచెను. నీవిపుడు లేచివెళ్లుట బాగుండదు.

**సుభ**—బాగుండకపోయినను సరే (లోపలికి వెళ్లును.)

**రంగ**—(తనలో) దీనివైఖరి వింతగా నున్నదే! తిమ్మరాజన్నచో నెంతో ప్రీతిగా నుండుమనిషి కింతరోత యేల కలిగెనో! కానిమ్ము; ఎటులైన వీనివైపు, వీనికట్టుకథలపై మోజుతగ్గుట మంచిదే. (ప్రకాశము) ఓహో! తిమ్మరాజా! రమ్ము, కూర్చుండుము, కొంచెము టీపుచ్చుకొందువుగాని.

(తిమ్మరాజు 32 ఏండ్లవాడు. సన్ననిధోవతి ధరించి, కుచ్చుతలపాగచుట్టి నల్ల ఆల్పాకాకోటుతొడిగి, బంగారుగొలుసు కన్పించునట్లు వాచీనిధరించిన తిమ్మరాజు 'మిలిటరీమీసముతో' అందముగా నున్నాడు. సుభద్రకూర్చుండివెళ్లిన కుర్చీలో కూర్చున్నాడు.)

**తిమ్మరాజు**—నేనిప్పుడే టీపుచ్చుకొనివచ్చితిని. అయినను మరల పుచ్చుకొందును. ఏదీ! (టీకప్పు తీసికొని త్రాగుచు) ఇన్నాళ్లనుంచి ఎక్కడెక్కడ తిరిగివచ్చితివి?

**రంగ**—తీర్థయాత్ర స్పెషలులో బయలుదేరి కాశీగయా ప్రయాగమధురాబృందావనాది ఉత్తరదేశక్షేత్రములను,

తుంగభద్ర, పండరిపురం మొదలైన మధ్యదేశతీర్థములను, కాంచీ శ్రీరంగ రామేశ్వరాదిదక్షిణయాత్రలను సేవించుకొని వచ్చితిమి.

తిమ్మ—అబ్బో! చాలయాత్రలు సేవించితివే! అవునుకాని తుంగభద్రను సేవించితినంటివే, అచట వట్టియేరుగాక ఏమి విశేష మున్నది?

రంగ—ముఖ్యముగా సేవించదగినది నదియే యైనను అచట చూడదగిన విశేషము లింక నెన్నియో యున్నవి. అచటనే మంత్రశాల, దానిచేరువనే రాఘువేంద్రస్వామిమఠము నున్నవి. వెనుక సర్: థామస్ మన్రో ఆమఠపు ఈనాములు శేరీలో కలుపబోగా, ఆదిమఠాధిపతి ఆయనకు కలలో ప్రత్యక్షమై మాన్పించెనట. (తిమ్మరాజు నవ్వును.) నవ్వేద వేమి! ఇది నిజము కాగూడదా?

తిమ్మ—నిజమే కావచ్చును. కాని, మఠాధిపతి స్వయముగావచ్చి తనయీనాములను స్వయముగా రక్షించుకోవలసినయవస్థ పట్టెగదా యని నవ్వితిని. అవును. రాచబిడ్డలు శాకాహారులై, జపమాలగ్రహించి, తీర్థసేవనము చేయుచుండ నాస్వామి కీయవస్థపట్టుటయు వింతకాదు.

రంగ—శాకాహారము దోషమా యేమి?

తిమ్మ—కాదు. బ్రాహ్మణులు మొదలగు శాంతజీవనులకు మంచిదే కాని, ఆయుధజీవనులగు క్షత్రియులకు మాత్రం శాకాహారము తగదు. మనకు నెత్తురుకూడే ఉచితము ఆకలములు దిను నీరసహృదయు లొక్కనాటికి శత్రుమారణకర్మమునకు

జాలరు. చావుపేరు వినగనే వారికి భీతి. చంపబోయిన చేయి వణకు, చావబోయిన గుండెదడ, శత్రువులదాక నెందులకు? అట్టివారికి ఎలుకను జూచినను భయమే. గోవును జూచినను భయమే.

**రంగ**—అదియేమిమాట! శాకాహారులలో మాత్రం మహా శూరులు లేరా? చిన్నాజియప్ప, మాధవరావుపేష్వా, త్ర్యంబకరావు మానా మొదలగు మహారాష్ట్రబ్రాహ్మణవీరులను వినలేదా?

**తిమ్మ**—వారు యుద్ధతంత్రము, వ్యూహనిర్మాణము నెఱిగిన సేనాపతులేకాని, నడుముకట్టి రణరంగమున నిలిచి ఖడ్గాఖడ్గి, ముష్టాముష్టి పోరినవీరులు మాత్రంకారు. నే నొక్కమాట చెప్పెద, వినుము. పెద్దపులివంటిది కూడా ఆకలములు మేసి పెరిగినచో గోవును జూచి తోక ముడుచును. గ్రద్దకు వరియన్నము పెట్టిచూడుము. అది పామునుజూచి పారిపోవునో లేదో! క్షత్రియులకు మధుమాంససేవనము విధించిన మన స్మృతికర్తలు వెఱ్ఱివాండ్రుకారు. శాకాహారమునకు శౌర్యమునకు షష్టాష్టకము. భూమిలో యుద్ధము లున్నన్నినాళ్లు వీరులకు మాంసాశనము తప్పదు.

**రంగ**—అగుచో యుద్ధమునకే స్వస్తిచెప్పరాదా?

**తిమ్మ**—స్వస్తిచెప్పుటకు నీయిష్టమేనా యేమి? ప్రపంచమున అన్ని దేశములలోను ఉన్న శాకాహారులందఱు గూడి ఎంత మొత్తుకొన్నను యుద్ధములు పోవు. అరణ్యములో లేళ్లు అహింస నుపదేశించినచో వినువారెవరు? సింహవ్యాఘ్ర

భల్లుకాది క్రూరమృగములు మాంసాశనము వర్జించినచో హింసరూపుమాయునుగాని, కుందేళ్లు, గోవులు, మేకలు నెన్ని అహింసాతీర్మానములుచేసినను ఫలముండదు. కావున ప్రపంచములో యుద్ధములు పోవలయునన్న ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీలవంటి వీరజాతులు మాన్పవలెనుగాని భారతదేశపు శాకాహారులు మాన్పలేరు.

**రంగ**—అహింసను మే ముపదేశించినగాని వారు గ్రహింపరు.

**తిమ్మ**—నిజమే. వినువారున్నచోగదా మీరుపదేశించి గురుపీఠ మెక్కుటకు? పోనిమ్ము. మీ ప్రజ్ఞచే ప్రపంచమున శాంతి నెలకొన్నచో నేనుగూడ శాకాహారినగుట కభ్యంతరము లేదు. అంతవఱకు క్షత్రియుడైనవానికెల్ల నడపదడప నింత మాంసపుముక్క, ఇంత మద్యపుచుక్క పుచ్చుకొనక తప్పదు.

**రంగ**—మఱి బ్రాహ్మణులమాటయో?

**తిమ్మ**—మనబ్రాహ్మణులు మాంసభక్షులు కావలెనని నేననను. మాంసము మానినచో క్షత్రియుడు, తినినచో బ్రాహ్మణుడు చెడిపోవుదురు. కావుననే మనధర్మశాస్త్రము లేజాతిధర్మము లాజాతికి విధించుచున్నవి.

**రంగ**—అట్లు దారికిరమ్ము. ధర్మశాస్త్రములు ఈయుగమున హిందువులందఱకు గోమాంసము నిషేధించుచున్నవి. మఱి, మెసపొటేమియాలో నీవు గోమాంసము తిన్నట్లు నీవే యొప్పుకొంటివిగదా! దాని నెట్లు సమర్థించెదవు?

**తిమ్మ**—నేను దానిని సమర్థించుటలేదు. అవసరముకొలది ఆపద్ధర్మముగా తినవలసివచ్చినవేగాని వేఱొకటికాదు. స్వదేశమునకురాగానే ప్రాయశ్చిత్తము చేసికొంటిని.

రంగ—ప్రాయశ్చిత్తముచే పాపములు నశించునుకాబోలు?

తిమ్మ—నిశ్చయముగా. దేవాలయములోనికి వెళ్లినంతమాత్ర మున నే పుణ్యము లభించునపుడు, ప్రాయశ్చిత్తముచే పాప ములుమాత్ర మేలపోవు? ప్రాయశ్చిత్తమనగా, పశ్చాత్తాప రూపమగు పాపక్షాళనసంస్కారమే కదా! ఏమందువు? నీవు శాకాహారివగుట అనాలోచితమని ఒప్పుకొందువా, లేదా?

రంగ—నీవాదము నాకు నచ్చలేదు. నేనుగాని, నాభార్యగాని యుద్ధము చేయబోవుటలేదుగాన మేము శాకాహారము మాననక్కఱలేదు.

తిమ్మ—ఆమాట నేనంగీకరింపను. నీవు యుద్ధము మానుకొన్నను, రేపు నీబిడ్డలు యుద్ధము చేయగోరుదురేమో! వాండ్రకు నీవు ఆకలములుపెట్టి పిఱికివాండ్రను, నీచులను జేయనేల? వాండ్రమాట యటులుండ, నీభార్యమాత్రము నీమతము నంగీకరించునా? ఆమెతండ్రి మాంసభక్షకులలో మహోపా ధ్యాయుడు. ఒక్కమనుష్యమాంసముతప్ప తక్కిన వన్నియు నాయనకు మంచినీళ్లప్రాయము. అట్టి తండ్రికడుపున బుట్టిన నీభార్య యీశాకాహారమతములో నెట్లుచేరును?

రంగ—మాయింట మాంసభోజనము నిషేధించితిని.

తిమ్మ—శాస్త్రవిహితమైన మాంసభోజనము నామెచే మాన్పించు టకు నీ కేమధికార ముున్నది?

రంగ—ఆమెను బాగుచేయు నధికారములేదా యేమి నాకు?

తిమ్మ—బాగుచేత నయముననా, భయముననా?

**రంగ**—నయముననే.

**తిమ్మ**—ఏదీ! ఆనయబోధ యెట్టిదో నాకుచేయుము, చూతము. నీయధీనములో నున్న వారిపట్ల నయము భయమే యగును.

**రంగ**—నీవంటి మొండికట్టెను బోధించుట నాకు గాదుకదా, బ్రహ్మకుగూడ శక్యముకాదు.

**తిమ్మ**—నీభార్యకు మాత్రము నాకున్నపట్టుదల లేదని యెట్లు చెప్పగలవు? ఆమెతండ్రిని నీవు త్రిప్పగలిగియుందువా?

**రంగ**—త్రిప్పలేను.

**తిమ్మ**—ఇకనేమి, తండ్రివంటిదే కూతురును; ఈమెనుమాత్ర మెట్లు త్రిప్పగలవు?

**రంగ**—ఈమె నాభార్య గనుక నాయందలిప్రీతిచే నన్ను న వర్తించును.

**తిమ్మ**—నీప్రీతి ఆమెకిష్టమైన యాహారమును తిననీయదుగాని, ఆమెప్రీతి నిన్ను నువర్తించు నేమి? ఎక్కడిమాట లివి! ఏదీ! చూతము; ఆమెకు స్వేచ్ఛనిచ్చి, నీయుపదేశమేమో ఏకరువు పెట్టుము. ఆపె మద్యమాంసములే కోరునో, లేదో అపుడు తెలియును. నిర్బంధముచేగాక ఆపె ఒక్కనాటికి తనపూర్వాభిరుచులు వదలుకొనదు.

**రంగ**—ఏమంటివి! పూర్వాభిరుచులా! సుభద్రకూడ ఆ మాటయే యన్నది నాతో! నీతోగూడ మొఱపెట్టుకొన్నదా యేమి, ఆమె?

**తిమ్మ**—ఆమెసొద నాభార్యతో వెళ్లబోసుకొనుచుండగా నేను వింటిని.

**రంగ**—ఇకనేమి ! ఇంటింట చాటుచున్నదన్న మాట.

**తిమ్మ**—చాలులెమ్ము. నీకేమి మతిపోయినదా ? నాభార్యకు జబ్బుగానుండుటచే చూడవచ్చి, ఏవో కష్టసుఖములు చెప్పు కొనుటలో ఈప్రసంగము వచ్చినదేకాని మతేమియు లేదు. నీనయబోధ కొంచెము గుఱితప్పి తగిలినట్లున్నది. ఏమందువు?

**రంగ**—నాసుభద్ర యిట్లొనర్చు ననుకొనలేదు నేను.

**తిమ్మ**—నీవంటిపాషండుల కుండెడిస్వభావమే యది. మీరేమి చేసినను మంచిదేకాని యెదుటివారిలోపములు మాత్రం మీరు సహింపరు. ఇంతకు, నీభార్య చేసినదానిలో నేమి తప్పున్నది ? స్నేహితురాలితో తనకష్టసుఖములు చెప్పు కొనుటకూడా దోషమేనా ? ఆమె కిష్టమైన ఆహారము తినుటకు నోచుకొనలేదు సరికదా, మనసులోమాట ఒకరితో చెప్పుకొనుటకుగూడ స్వతంత్రములేదా ? ఇంతకంటె హింస వేఱొకటికలదా ? ఇదియేనా, నీవు కోరుశాంతి !

**రంగ**—సుభద్ర నీభార్యతో నీవిషయములన్నియు చెప్పిన దెప్పుడు ?

**తిమ్మ**—మాయింటికి వచ్చినపుడెల్ల ఈప్రస్తావము వచ్చుచునే యుండేది.

**రంగ**—నే నూరలేనపుడు మీయింటికి మొత్త మెన్నిసారులు వచ్చినది ?

**తిమ్మ**—నీవు వెళ్లిన మొదటిరోజుల్లో పదిదినాలు వరసగా వచ్చేది. పినతండ్రి పెదతండ్రి బిడ్డలు చిన్నతనమునుండి అక్కచెల్లెండ్ర వలె నొక్కచోట పెరిగినవాళ్లు, ఒకరియింటి కొకరు వెళ్లుట తప్పా? అదిగాక, నాభార్య ప్రసవించుట, శిశువు పురిటి లోనే పోవుట, అది అప్పటినుంచి కాయలాపడుట నీవు మాత్ర మెఱుగనిదా?

**రంగ**—నేను దానికి కాదనలేదోయి! నాపరోక్షమున నాపై కొండెములు చెప్పినందుకే నామనస్సుకు కష్టముగా నున్నది.

**తిమ్మ**—ఆమె నీతో ప్రత్యక్షమున అన్నమాటలే నాభార్య తోనూ అన్నది. ఇందు కొండెములుచెప్పుట యేమున్నది?

**రంగ**—నిజమేకాని నీవు వినుచుండగా చెప్పుట తప్పుకాదా?

**తిమ్మ**—అదిగో! అచటనే పొరపడుచున్నావు. వాండ్రిరువురకు పరస్పరము దాపరికము లేదయ్యె. దానికి జబ్బుచేసినది మొదలు, నేను ఎప్పుడో సాయంత్రం క్లబ్బుకు వెళ్లితేతప్ప, తక్కినవేళల ఇంటిలోనే ఉండునాయె; ఇక నేను వినకుండ చెప్పుట యెట్లు?

**రంగ**—ఓహో! నీవింటనుండగనే వచ్చెడిదేమి, ప్రతిదినము?

**తిమ్మ**—భేష్! అదికూడా ఒకనేరముకాబోలు! 'తుదకబ్బెరా తురకమత'మని, స్త్రీస్వాతంత్ర్యానికిగూడ సున్నచుట్టుచున్న దే నీక్రొత్తమతము! ఇన్నాళ్లు స్త్రీలకు స్వతంత్రముకావలెనని వాదించేవాడవు, మరల వాళ్లను అంతఃపురములో బంధింతువాయేమి!

రంగ—ఏమో? స్త్రీస్వాతంత్ర్యమువిషయమై ఏమిచెప్పెడి వాడనో నాకిపుడు గురుతులేదు.

తిమ్మ—సరిసరి. ఈతీర్థాటనముతో నీకు మనస్స్వాస్థ్యం తప్పినట్లున్నది. వేళకు తిండితినకుండా ఊరూరు, గుట్టగుట్ట, గుడిగుడీ తిరుగుటచే మనస్సుకు శరీరానికిగూడ స్వస్థత తప్పినదన్నచో వింతలేదు. సరే. నీవు కొంచెము బడలికతీర్చుకొనుము. నేను వెళ్లివచ్చెదను.

రంగ—మంచిది.

(తిమ్మరాజు నిష్క్రమించును. రంగరాజు పరధ్యానముగా కూర్చుండగా నాగమ్మ ప్రవేశించును.)

నాగమ్మ—అబ్బాయి! ఆఫీసుగదిలోని కొకసారి వస్తావా? నీతో ఒకమాట చెప్పాలి. అచ్చట ఏకాంతంగా వుంటుంది.

(రంగరాజామెతోగూడ ఆఫీసుగదిలోనికి వెళ్లి తలుపువైచును.)

రంగ—ఏమిటమ్మా! కోడలివిషయమేనా?

నాగ—అవును, నీకెట్లు తెలిసినది?

రంగ—ఎట్లో తెలిసినదికాని, అదియేమో వెంటనే చెప్పవమ్మా!

నాగ—నాయనా! మఱియేమియులేదు. మనము వెళ్లిన క్రొత్తలో సుభద్ర ప్రతిదినము తిమ్మరాజుగారింటికి భోజనానికి వెళ్లేదట! మనదాది చెప్పింది. ఈవిడకోసం తిమ్మరాజు ప్రతిరోజు కోడిమాంసం, బాతుమాంసం తెప్పించి విందులు చేయించేవాడట. ఆరోజుల్లో ఆతడు కొన్న బ్రాందిబుడ్లకు

లెక్కలేదట. ఇరుగుపొరుగంతా ఏమేమో గుసగుసలు పోవు, చున్నారట.

రంగ—తిమ్మరాజింట్లో దీనికి విందులా! మఱి, ఇందాక తిమ్మరాజు వచ్చినపుడు నీకోడలు చీదరించుకుని లేచిపోయినదేమి చెప్పుమా! కపటముకాదుగదా? ఏమో, నాకుమాత్రం కపటంగా తోచలేదు. అవునుకాని, ఈసంగతి దాదికాక మఱి యెవ్వరైన చెప్పిరా నీతో?

నాగ—కుట్టిది మంగమ్మ కూడా చెప్పింది. ఒకరోజున తిమ్మరాజు, సుభద్ర కలిసి భోజనంచేస్తుండగా కూడా కుట్టిది చూచిందట. అంతట దీన్ని 'నీవు పోయి ఆడుకో'మ్మని చెప్పి పంపివేసారట. నాయనా! ఇట్లా అల్లరిపడడంకంటె, దాని కిష్టమైనపదార్థాలు ఇంట్లోనే తిననీయగూడదా?

రంగ—కూడదు. ఇట్టి విషయాలలో అటుల నెన్నడు సదుపాయములు చేయగూడదు. ఏదీ, నీకోడలి నొకసారి ఇట్లా పంపు. దానినే అడిగెద నీతిమ్మరాజింట విందులసంగతేమిటో. అది నాతో అబద్ధమాడదు.

నాగ—నేను చెప్పాననికాని, మంగమ్మ, దాది నాతో చెప్పారని కాని కోడలితో చెప్పకుమా! మేము మీకు తంపులు పెట్టామనుకొంటుంది. దానికి మొదలే కొండెములన్న చో నొడలు మంట.

రంగ—మంచిది. దానిని పంపుము.

నాగ—నీవు మాత్రము తొందరపడి దానిమీద కోపపడకుమా. మొదటినుండి చుట్టములయిండ్లకు తిరగడం, వాళ్ళయిండ్లలో

మధుమాంసములు తినడం, నీతోకూడా క్లబ్బుకువెళ్లి ఈ తిమ్మరాజుతో వాళ్లతో స్వేచ్ఛగా మాట్లాడడం, తినడం, తిరగడం, నీఅనుమతితో, నీయెదుటనే యిన్నాళ్లూ చనువు కొంలది సాగనిచ్చి, ఇప్పుడు దాన్ని కోతపెట్టి ఏమిప్రయోజనం ?

రంగ—క్లబ్బులో పదిమందియెదుట పురుషులతో కలసిమెలసి యుండుటవేఱు, ఆపనే చాటుగా పరపురుషుడితో చేయటం వేఱు.

నాగ—ఏమోతండ్రీ! నాకేమి తెలుస్తుంది? సీమలో గొప్ప గొప్పవాళ్లే యిలా తిరుగుతారు. ఇందులో ఏమీా దోషం లేదని చెప్పినవాడవు నీవే. ఇంతకు, చిన్నతనంనుంచి దాని తండ్రి ఆయాచారాలప్రకారం పెంచాడు. మనయింటికి వచ్చినతరువాత కూడా, మొన్న మొన్నటిదాక నీవు ఆలాగే సాగనిచ్చావు. ఇప్పు డొక్కసారిగా మానుకొమ్మంటే దాని తరమా ? అదిగాక, నువ్వు తిమ్మరాజూవలెనే మీాభార్య లిద్దఱు అన్నదమ్ములబిడ్డలు. కనుక వాళ్లయింటికి రాకపోకలు చెయ్యడం దానికి తప్పుగా తోచకపోవచ్చు. కనుక దాని మీాద కాకపడకు. అసలే దానిది సున్నితమైన స్వభావం. ఎటుపోయి ఎటువచ్చునో.

రంగ—అవునమ్మా! నీవు పోయి దానిని పంపించు.

(నాగమ్మ నిష్క్రమించి సుభద్రను పంపును. సుభద్ర ప్రవేశింపగనే రంగరాజు తలుపు గడియవేయును. సుభద్ర వివర్ణవదనయై, దిగులుతో కళ్ల నీళ్లపర్యంతమై ఉన్నది.)

రంగ—సుభద్రా! ఏమిటిది? నీవేమో, మేమూర లేనప్పుడు తఱచు తిమ్మరాజింటికి వెళ్లేదానవని చేసేదానవని వింటాను. ఆతడు నీవు మధుమాంసము లేమైన సేవించుచు వచ్చితిరా యేమి?

**సుభ**—(తలవాల్చి, కంటనీరిడుచు) అవును.

రంగ—ఏకాంతముగా నేనా?

**సుభ**—(గద్గదకంఠియై) అవును.

రంగ—(కళవళపాటుతో) సుభద్రా! అంతేనా, మఱియేమైన నున్నదా మీయిరువురకు? నాతో నిజముదాచక చెప్పుము. నాకు పిచ్చియెత్తుచున్నది. చప్పున చెప్పుము. (దారుణమనో వేదనచే కంపించిపోవుచుండును.)

**సుభ**—(గాద్గద్యముతో) మీతో ఏమనిచెప్పను? అబద్ధమాడుటకు నాకు నోరురాదు. ఆపాపిష్ఠఘుడియను నాబుద్ధి గడ్డి తిన్నది. (అంతలో నొడలు తెలిసినదానివలె) హా! దైవమా! నానోట నిది చెప్పించుటకే యిన్నాళ్లు నన్ను జీవముతో నుంచితివా?

రంగ—అయ్యో! మంగమ్మా! సూరయ్యా! అయ్యో! నాబిడ్డలారా! అయ్యో! కృష్ణయ్య తండ్రీ! (నేలబడి దొరలుచుండ సుభద్ర లేవదీయబోవును.) ఛీ! నీచురాలా! నన్ను ముట్టకుము. (లేచి) ఎంతకాలంనుంచి జరగుచున్నదిది?

**సుభ**—మీరు వెళ్లినకొత్తలోనే ఒకనాడు జరగినది. దానికి ఆది, అంతము ఆరోజే. ఆనాడు మేము సివమెత్తినట్లు తెగ

తింటిమి. ఆతడు నాచే తప్పత్రాగించి, నన్ను నేనెఱుగకున్న స్థితిలో నాకొంపతీసినాడు. ఇక నేమున్నది! సిగ్గున మ్రగ్గి పోవుచు కొంపచేరితిని. ఈపాడుజీవములు తుదిముట్టింతు ననుకొంటినిగాని మీరలిరువురు నూరలేరు. పిల్లలను దిక్కుమాలినపక్షులనుజేసి పోలీసువిచారణలకు పాలుపరచుటకు మనసొప్పినదికాదు. అదిగాక, మీరు తిరిగివచ్చి, నాపాపమే నన్ను చంపుకపోయినదని ఎఱుగక, మీ నూతనమతము చంపినదని అపోహపడుదురు. అది నాకిష్టముకాదు. జరగిన యథార్థము చెప్పి, మీపాదములబడినచో, ఆవల నేమి కావలసియున్నదో అటులు కాగలదని మనసు రాయిచేసి కొంటిని. మీరువచ్చి, టీత్రాగినపిమ్మట ఏకాంతము లభింపగనే చెప్పుద మనుకొనుచుండ నింతలో వాడు వచ్చి పడెను.

**రంగ**—అంతకుపూర్వ మిట్టిది యెన్నడు జరుగలేదని ప్రమాణముచేసి చెప్పగలవా?

**సుభ**—మీపాదసాక్షిగా లేదు, అయ్యో దైవమా! మీయను మాన మేమని?

**రంగ**—ఏమైనను కావచ్చును. ఇంతచేసినదానవు నీవెంతకైన తగుదువు. మంగమ్మ సూరయ్యలవిషయమై సంశయము తీర్చుకొనుట కడిగితిని. ఇదివఱ కెన్నడు నాతో నసత్యము చెప్పినదానవుకావని నీమాట నమ్ముచున్నాను.

**సుభ**—(గుండెలు పగులున ట్లేడ్చుచు) నే నసత్యమాడిన నాబిడ్డలతోడు. మీ రేప్రమాణముచేయుమన్న చేయు

దును. నేను పాపకర్మురాలనై పోతిని. నాకు మీచిత్తము వచ్చిన శిక్షవిధింపుడు. అంతియకాని, మీపాదములతోడు! వాండ్రు మీబిడ్డలు. వాండ్ర నెప్పటివలె ప్రీతితో చూచు కొనండి, మీయిష్టదైవము శ్రీకృష్ణభగవానునిపై ఆనపెట్టి మిమ్ము వేడుకొందును. (పాదములపై బడును)

రంగ—లెమ్ము. అభాగినీ! లెమ్ము. క్షత్రియాచారము జారిణి యైనభార్యకు మరణము విధించుచున్నది. కాని, నీవు శ్రీకృష్ణనామస్మరణము చేసితివికాన నది యూరకపోరాదు. మఱియు, చేసినతప్పు నొప్పుకొని, పశ్చాత్తాపము చెందినచో నెట్టిదోషమైనను సహింపుమని నాగురు డుపదేశించెను. ఆయుపదేశము ననుసరింతునని నేను ప్రమాణముచేసితిని. కాని, దైవము నాకిట్టిపరీక్ష తెచ్చిపెట్టునని యూహింపలే నైతిని. ఏమైనను గురునాజ్ఞ తప్పను. రేపు వేకువజామున, ఎవరు నిద్ర లేవకముందే నేను శ్రీకృష్ణదైవమునకు పూజగా వించి కర్పూరహారతి నిచ్చుసమయమున నీవు స్వామియెదుట, దోసిట ఆవుపాలు ధరించి నిలిచి, ఇకముం దెన్నడు నిట్టి పాపము చేయనని ప్రమాణముచేసి, ఆపాలు లోనికి పుచ్చు కొన్నచో నిన్ను ప్రాణములతో విడిచిపుచ్చెదను. నిన్నిక పత్నిగామాత్రము ఏలుకొనజాలను. (సుభద్ర ఏమో చెప్ప బోవును.) నీవింక మాఱు పలుకక ఇటనుండి లేచిపొమ్ము. పోవేమి? (సుభద్ర మరల నేమో చెప్పబోగా) పొమ్ము! ఉఁ. (సుభద్ర తలుపునైచి వెళ్లిపోవును. రంగరా జొక్కక్ష ణము నిశ్చేష్టుడై యుండును. మంగమ్మ, సూరయ్య 'నాన్నా! నాన్నా!' యని పిల్చుచు తటాలున లోనికి వత్తురు. మంగమ్మ

కొకచేతిలో బలపపురాతి టాజ్‌మహాలు, నొకచేత దంతపు యేనుగు నున్నది. సూరయ్య కొకచేత విప్పుకొనిన గాలి గుమ్మటము నొకచేత చక్కని విమానము నున్నవి.)

మంగమ్మ—నాన్నా! ఎంతచక్కనిబొమ్మలు తెచ్చావు నాకు! బొమ్మ ఇప్పుడే యిచ్చింది, చూచావా? ఎంతబాగుందో యేనుగు! టాజమా లిట్లాగే వుంటుందా నాన్నా!

సూరయ్య—నావిమానం మాత్తరం బావుండ లేదేం? నాన్నా, చూడు! ఈగుమ్మట మెట్లా వూదానో! పెద్దగుమ్మడికాయల్లే వుందికాదూ?

మంగ—అమ్మ యేడుస్తున్న దెందుకు నాన్నా?

రంగ—చూడు, తల్లీ! నీకు అమ్మంటే యిష్టమా, నేనంటే యిష్టమా?

మంగ—ఇద్దఱూ యిష్టమే నాన్నా?

రంగ—బాబూ! నీకుగా?

సూర—నాకు నువ్వంటేనే యిష్టం నాన్నా!

రంగ—ఎందుకని?

సూర—ఏమో! నీమీదనే యిష్టం నాన్నా!

రంగ—(సూరయ్య నెత్తుకొని ముద్దాడి) నాచిట్టితండ్రీ! నా బాబూ! చిరకాలం వర్ధిల్లు.

మంగ—నాన్నా! మఱి నన్నో!

రంగ—(కన్నీటితో) చిట్టితల్లీ! నిన్నూను.

మంగ—నువ్వుకూడా యేడుస్తున్నా వెందుకు నాన్నా ?

రంగ—ఏమీ లేదుకాని, మీరు పోయి ఆడుకోండి. (పిల్లలిరువురు నిష్క్రమింప నాగమ్మ ప్రవేశించును.)

నాగ—ఏమిరా, నాయనా! అట్లావున్నావు! ఏమిచెప్పింది నీతో సుభద్ర ?

రంగ—నన్నీరాత్రి యికనేమీ అడుగకు. నామనస్సు స్వస్థంగా లేదు. రేపటికి కుదటబడునేమో. ఈపూట నేను భోజనం కూడా చేయను. (నాగమ్మ నిష్క్రమించును. రంగరాజు గడియవైచికొని గీతాపారాయణ మొనర్చును.)

(తెర పడును.)

# అంకము. 5

[ఆ తెలవారుజామున మూడుగంటలవేళ. రంగరాజు ఇంట్లో పూజా గృహములోపల గడియవైచి యున్నది. శ్రీకృష్ణవిగ్రహముముందు దీపారాధన చేయబడినది. ఒకపళ్లెములో పాలు, అందు తులసిదళములు నున్నవి. ఒఱయూడ్చినబాకు స్వామివిగ్రహము చెంతనున్నది. రంగరాజు, సుభద్ర స్వామి కభిముఖులై కూర్చున్నారు. అప్పుడే పూజాపరిసమాప్తి యైనది.]

**రంగ**—కులాచారము ననుసరించి నిన్ను వెంటనే పొడిచివేయవలసినదేగాని, నాగురునియెదుట చేసినశపథముచొప్పున, పశ్చాత్తప్తవగు నీద్రోహమును క్షమింతును. ఇట్టి మహాద్రోహము క్షమింపవలసివచ్చునని నే నానా డూహింపలేదు. ఐనను నేను మాటతప్పను. అడుగో! శ్రీకృష్ణభగవానుడు. అదిగో! ఆచెంతనున్న క్షీరపాత్ర చేతబట్టి, నీవు తిమ్మరాజుతో చేసినద్రోహము స్వామియెదుట నంగీకరించి, ముందెన్నడు నట్టిపాపముచేయనని ప్రమాణముచేసెదవేని నీప్రాణములపై దెగక విడిచిపుచ్చెదను. ఇక నీతో సంసారము చేయుదుననుట కల్ల. ఏమి, ప్రమాణము చేయుదువా?

**సుభ**—నాకు ప్రాణములపై తీపిలేదు. ఆనాడు నేనే యీపాడు దేహమును తుదముట్టించుకొనియుందును. నేడు మీరు తుదముట్టించినను నాకు సంతోషమే. అట్లుకాక మీగురువు ఆజ్ఞచొప్పున నన్ను క్షమింతురేని పరిపూర్ణముగా క్షమింపుడు.

రంగ—పరిపూర్ణముగా ననగా?

సుభ—నాపాపమునకు మీరేళ్ళి ప్రాయశ్చిత్తము విధించినను సమ్మతమేకాని, ప్రాయశ్చిత్తానంతరం నేను పూర్ణముగా పాపవిముక్తనై మీకు సహధర్మిణిని కావలెనని కోరెదను. అంతియేకాని యీసగము సగము క్షమాపణములు నాకక్కఱ లేదు. నేను పూర్ణముగా పాపముక్తనైతినని మీకు దోచు వఱకు నన్ను క్షమింపకుడు. తోచినపిమ్మట మాత్రము నన్ను పూర్వమువలె ననుగ్రహించి మీపాదదాస్య మొసంగుడు. అంతియేకాని ఉభయభ్రష్టనై, నిరభిమానమగు నికృష్ట జీవము ధరించుట నాకభిమతము కాదు. మీకు గౌరవా వహామును కాదు.

రంగ—ఇంక నది యెంతమాత్రము పొసగదు. నీకట్టియాస కలలోగూడ వలదు. ఇంక నీ వెక్కడిభార్యవు! నే నెక్కడి భర్తను! నీవంటి పతితురాలితో నాకు సంబంధ మెట్లు! ఇట్టి కలుషచరిత్రవలన సంతానలాభ మెట్లు?

సుభ—మీరు తొందరపడి నావిన్నపము త్రోసిపుచ్చకుడు. మీరు లండనులో నున్నరోజులలో అసామాన్యకాంతతో నేమిచేసితిరో జ్ఞప్తికి తెచ్చుకొనుడు. ఆయపరాధమును మీరు నాతో చెప్పినప్పుడు నేనది మనఃపూర్వకముగా సహించి, ఇన్ని నాళ్లు మీతో కాపురము చేయుచున్నసంగతి స్మరింపుడు. అట్టిపాప మొనర్చిన మిమ్ము నిరాకరింపక మీవలన సంతాన వతినైతి నన్నమాట మఱవకుడు. తప్పు ఎవరికైనను వచ్చును. నేను తప్పునొప్పుకొని, పశ్చాత్తప్తనై అనుగ్రహింపుడని వేడుచున్నాను. మీకు నమ్మకము కలుగువఱకు వేచి

యుండును. ఎప్పటికైన నన్ను పరిగ్రహింతురని అభయ మిచ్చినచో, మీయానతిచొప్పున ఈప్రమాణముచేసెదను. కానిచో, నాకీ చెడుబ్రదు కెందులకు?

**రంగ**—పరమేశ్వరా! నాపాపమున కెంత చక్కనిశిక్ష విధించితి వోయి తండ్రీ! నాపాపము నన్నెంత చక్కగా కట్టి కుడుపు చున్నది! అమేయమగు నీవిలాసమునకు తలయొగ్గుచున్నాను. నాటి లండనుముచ్చట నేడు నీవిటుల జ్ఞప్తిచేయుదువని యూహింపనైతిని. అట్టిపాపమునకు మరల నెప్పటికి పాల్పడ కుండుటకే నేనింద్రియనిగ్రహ మవలంబించితిని. కామోప భోగముల కిదే స్వస్తిచెప్పుచున్నాను.

**సుభ**—అది యటులుండనిండు. నన్ను తిరిగి చేపట్టనిచో మీరు గురుర్వాజ్ఞపాలించినవా రెట్లగుదురు? ఎట్టిపాపమైన పూర్ణముగా క్షమించుటకు గదా మీరు వారితో ప్రతిజ్ఞ చేసితిరి?

**రంగ**—నాగురుర్వాజ్ఞనుగూర్చి వ్యాఖ్యానముచేయుటకు నీవె వ్వరు? సర్వమునకు ఆగురువే ప్రమాణము.

**సుభ**—నావ్యాఖ్యానమే ప్రమాణమని మీగురువులే యంగీక రింతురు. అడిగి చూడుడు. నాడు నేనయాచితముగా మీకిచ్చినదానినే నేడు నాకిండని వేడుచుంటినిగాని అధి కము కోరలేదు.

**రంగ**—ఇక నీవాయాశ ముమ్మాటికి వదలుకొనుము.

**సుభ**—అయినచో నన్ను చంపుకొనుడు. నాకీ పాడుబ్రదు కుపై తీపిలేదు. అర్థరహితమగు మాటవలె, బీజహీనమగు

పొట్టువలె నిస్సారమగు మీ౦క్షమార్పణము నాకు వలదు. గ్రహింతురా, ఎప్పటివలె నన్ను గ్రహింపుడు. లేదా, ఈతుచ్ఛజీవమును తుదముట్టింపుడు, నాకు మరణము విధించుచున్న క్షత్రియాచారము దోషసహితమేమో యని మీరు సంశయింప నక్కఱలేదు. ఆపూర్వాచారముకంటె నుత్కృష్టము, మహీయమునగు మీ౦క్షమను ప్రసాదింపు డని నేను వేడబోను. ఆక్షమ నర్థించుటచే నాకులభించు నికృష్టజీవనముకంటె, మీచేత చచ్చుటయే నేను కోరునది. కానిండు. చూచెదరేమి ? అదిగో బాకు !

**రంగ**—ఏమీ ! చావే యిష్టమా నీకు ? ప్రమాణముచేయవా?

**సుభ**—చేయను. మీపరతులపై చేయను.

**రంగ**—(క్రోధముతో) నన్ను స్త్రీహత్యాపాతకిని చేయక ప్రమాణ మొనర్పుము. ఇదిగో ! చేయిపట్టు, పాలుపోసె దను. ఊఁ.

**సుభ**—ఉహుఁ. వలదు. మీరు గుర్వాజ్ఞ ప్రత్యక్షరము పాలింప నిచో నేను ప్రమాణముచేసి ప్రయోజనములేదు.

**రంగ**—(ఆవేశముతో) వెంటనే చేయిపట్టు, నాకోడలు స్వాధీ నముతప్పుచున్నదిసుమా ! పట్టుము (ఆమె కుడిచేయి బల వంతముగా లాగి పాలుపోయుచున్నాడు.) ఊఁ. ప్రమా ణముచేయుము. నిన్ను చంపవలసినయవస్థ తేకుము నాకు.

**సుభ**—మీయిష్టము. నేను కోరినవర మీయనిచో నేను ప్రమాణముచేయను.

**రంగ**—ఆవరమిచ్చుట కల్ల. ముమ్మాటికి కల్ల.

**సుభ**—అట్లయిన నేను ప్రమాణముచేయుటయు కల్లయే. ముమ్మాటికి కల్లయే.

**రంగ**—(క్రోధపారవశ్యమున బాకుతీసికొని) వెంటనే ప్రమాణముచేసెదవా? పొడవనా?

**సుభ**—చేయను. ఆఱునూరైనను చేయను. చంపుకొనుడు. సిద్ధముగా నున్నాను. (చేతిలోనిపాలు పాఱవైచి అభిముఖియై నిలుచును.)

**రంగ**—(క్రోధముపట్టలేక) రాచపుట్టుకపుట్టి, జారిణివై, ఆగాడిద తిమ్మరాజుకు శరీరమిచ్చి, నాకు తలవంపులుతెచ్చి, నావంశము నటునిటు పదునాల్గుతరములు కళంకితముచేసి, సిగ్గులేక, చండివై అసాధ్యపుకోరికలు కోరెదవా? చంపుకొమ్మని శఠింతువా? ఇంత మొండితనమా? చావు ముండా! చావు. (గుండెలలో పొడుచును. సుభద్ర కిక్కురుమనక నేలపై కుప్పగూలును. రంగరాజు ఱిచ్చపాటున వెనుకకుతగ్గి, దుఃఖించును.) హాదైవమా! ఎంతపనిచేసితిని! సుభద్రా! సుభద్రా! (లేవదీయబోవును) ఏదీ! ప్రాణములేదు. కొయ్యవాఱినది. అక్కటా! స్త్రీహంతకుడనైతినా! పోయి, పోలీసువారితో నిజము చెప్పివైచెదను. ఇది చావనిన వెఱవలేదు. ఎన్నడు నసత్యమాడి యెఱుగదు. నేనును అసత్యమాడను. చావునకు వెఱవను. (తలుపుతెఱచికొని, రక్తసిక్తమగుకత్తితో పోలీసుస్టేషనుకు పఱుగెత్తును.)

(తెర పడును.)

## అంకము. 6.

[పిమ్మట రెండుదినములకు మద్రాసు పెనిటెన్షియరీలో నొకగది. నేరము విచారణజరుగుదినములలో రంగరాజచట కాపలాలో నున్నాడు. ఒకవార్డరు నాగమ్మ నాగదికి తీసుకొనివచ్చెను. తల్లికొడుకులు ఏకాంతముగా మాట్లాడుకొనుచుండ జైలు అధికారులు ఆవలికేగి, తెఱచియున్న తలుపుగుండా బంధితుని కనిపెట్టియున్నారు.]

నాగ—(దుఃఖించుచు) అయ్యో! తండ్రి ! ఎందుకు చేసితివోయి యిట్టిపని ?

రంగ—ఆనాడు సుభద్ర నడుగగా, మనమూర లేనపుడు తిమ్మరాజుతో వ్యభిచరించితినని ఒప్పుకున్నది. వెంటనే పొడిచి వేయవలెనన్నంత కోపముపచ్చినదిగాని, నాగురుడగు ఆనంద స్వామిఆజ్ఞ జ్ఞప్తికివచ్చి ఎట్లో కోపమాపుకొంటిని. శ్రీకృష్ణుని సన్నిధానమున పశ్చాత్తప్తయై, ఇక నెన్నడు నట్టిదోషము చేయనని ప్రమాణముచేసినచో క్షమించి విడువవలయునని నిశ్చయించితిని. ప్రమాణ మొనర్పనిచో పొడిచివేయవలెనని బాకు నూరి స్వామిచెంతనే పెట్టితిని. ఆతెలవారుజామున ప్రమాణముచేయుమని యడుగగా, తన్ను మును పటివలె భార్యగా నేలుకొందునని వాగ్దానముచేసినచో ప్రమాణము చేసెద నన్నది. నేనందుల కంగీకరింపలేదు. అంగీకరింపనిచో ప్రమాణము చేయనని నిరాకరించి, చేతిలోనిపాలు ఒలుకబోసి, చంపుకొమ్మని మొండిపట్టుపట్టినది.

నేనంత ఆగ్రహము పట్టలేక చెంతనున్న బాకుతో పొడిచి వేసితిని.

**నాగ**—ఎంతపనిచేసితివిరా నాయనా! నీదైవభక్తి, నీతీర్థాటనము చివర కిట్లు పరిణమించినవా? దానివలన తప్పు జరిగినదే చూడుము. మన ఆచారముగదా యని వెంటనే పొడిచి వేయుటయేనా? అది బుద్ధిపూర్వకముగా పాపముచేసినదో పొరపాటుపడినదో ఆలోచింప వలదుటోయితండ్రీ! ఆపాపిష్టి తిమ్మరాజు మాయలో పడిపోయి, యింటిలో మధుమాంసములు దొఱకక చవి చచ్చియున్నదిగాన వానివిందులకు, అనునయములకు మరగి కాలుజారినదేగాని కోడలువర్తన మటువంటిది కాదోయి తండ్రీ! తీరా, కాలుజారినపిమ్మట ఎంత పశ్చాత్తాపపడినదో, ఎంత బాధపడినదో. బిడ్డ మనము వచ్చుసరికి చిక్కి సగమైపోయినది. ఆతెలవారుజామున సందడి విని ఏమిమునిగినదో యని పరుగెత్తివచ్చునప్పటికే రక్త ప్రవాహములో చచ్చిపడియున్నది. ఇంత చిన్నతనములో యెంత దారుణపుచావు వచ్చినది దానికి!

**రంగ**—అమ్మా! నాకునూ అట్టి చావే సిద్ధముగానున్నది. కోర్టువారు ప్రాణమునకు ప్రాణము పుచ్చుకొందురుగాని విడువరు లెమ్ము.

**నాగ**—ఎట్లు! ఎట్లు! ఏమంటివి? ఈమాత్రమునకే మరణశిక్ష విధింతురా తండ్రీ! మనపెద్దలు పూర్వ మెంతమందినో ఉంపుడుకత్తెలనుగూడ, ఇట్టితప్పుచేసినపుడు పొడిచిచంపిరి కారా? వారికందఱకు శిక్షలువేసిరా? అందులో కట్టుకున్న

పెండ్ల మిట్టితప్పుచేసి, చేసితినని మొగమెదుట ఒప్పుకొన్న పుడు మగవాడైనవాడు సహింపగలడా? ఆక్రోధావేశ ములో ఒడలుతెలియక చేసినపనికి ఈకాలములో మాత్రము ద్వీపాంతరవాసశిక్షయేగాని మరణశిక్ష విధింతురా తండ్రీ?

రంగ—నీవుచెప్పినది నిజమే, నే నాసాయంత్రము, ఆమాట విన గనే కోపపరవశుడనై ఆక్షణమందే యీపనిచేసియున్నచో ద్వీపాంతరవాసశిక్షయే విధించెడివారు. కాని నేనట్లు చేయ లేదు. అప్పటికి ఊరకొని, ఆరాత్రియెల్ల నాలోచించి చంపు టకు నిశ్చయించుకొని బుద్ధిపూర్వకముగా చేసినపని గదా యిది! కాబట్టి మరణశిక్ష తప్పదు నాకు.

నాగ—అయ్యో తండ్రీ! నాకామాత్రము తెలియనీకపోతివి. ఏమో! తిమ్మరాజుతో స్వేచ్ఛగా విందులారగించితినని చెప్పు టచే నీవాగ్రహముచెంది చిడిముడిపడుచుంటి వనుకొంటిని గాని కోడలినేరము ఒప్పుకున్నదని ఎఱుగకపోతిని. ఎఱిగి నచో ఆరాత్రి నిద్రపోయియుందునా? ఈఘోరము జరుగ నిత్తునా? కానిమ్ము. అయినదేమో అయినది. చచ్చినకోడలిక నెట్లును తిరిగిరాదుగదా! నాయనా! నీవుకూడ నన్ను దిక్కు మాలినదానినిగా జేసిపోయెదవా? అది యీసాయంత్రమే తప్పునొప్పుకొన్నదని ఎవరికి తెలియును. ఆవేశమునే యీ సంగతి చెప్పినదని, కోపముపట్టలేక వెంటనే పొడిచితినని చెప్పకూడదా!

రంగ—అమ్మా! ఎంతమాటచెప్పితివి! స్త్రీహత్యాదోషమునకు తోడు అసత్యదోషము కూడ కట్టుకొమ్మందువా! అది యంతకాముకురాలు! దానికే చావనిన భీతిలేకపోయెనే!

నేనింత నిగ్రహము కలవాడను! చావునకు వెఱచి అసత్య మాడుదునా ? అటులెన్నటికి జరుగదు. సత్యమే చెప్పెదను. పూర్ణసత్యము చెప్పెదను. సత్యముతప్ప నితరము చెప్పను. ఇంతకు అసత్యమాడి, ఈయెడలోమికొని, నేను బ్రతికి కొనునదిమాత్ర మేమున్నది ? సర్వథా నాకు చావే శరణ్యము.

నాగ—నాయనా! నామాట వినుము. ప్రాణరక్షణార్థము ఈ మాత్ర మసత్యమాడుట తప్పుగాదు.

రంగ—అమ్మా! నీవంటి ధర్మశీల కిట్టి వెట్టి తగదు. సత్యము కంటె వేఱు దైవములేదు. ఆఱుమాఱైనను అత నాశన మైనను, సత్యహాని చేయజాలను.

నాగ—కనుగందులు బిడ్డల నేమిచేసిపోయెదవురా తండ్రీ! ఆకూనలకోసమైన బ్రతికియుండుమురా, నాయనా!

రంగ—అమ్మా, బిడ్డలకు నీవే యున్నావు. నేను సంపాదించిన యాస్తి బోలెడుండగా బిడ్డలకేమి లోపము ?

నాగ—నీయాస్తి ఎవరికి కావలెనోయి తండ్రీ ? నాతండ్రి పోయినపిమ్మట యీపాడుసొమ్ము నాకెందుకోయి ? అయినది కాగా నీయప్రతిష్ఠ నెట్లు మోయుదును ? కోడలు జారిణి, కొడుకున కురిశిక్ష! అయ్యో! దైవమా!

రంగ—అమ్మా! నిజమే. కష్టములు ఒంటరిగా రావు. విధివిలా సమునకు తలయొగ్గకుండ మనశక్యమా! సుభద్రను, నన్ను మఱచిపొమ్ము. బిడ్డలను జూచుకొని బ్రదుకుము. శోకింప కుము.

నాగ—నాయనా! నాకోసము నీవీమాత్ర మసత్యమాడక తప్పదు. నామాట కెదురాడకుము. నిన్ను ఉరితీసినచో గుండె పగిలి చత్తునుగాని, నేను జీవింతునటరా? తండ్రీ! ఇక ద్వీపాంతరవాసమంటివా? అది యింత ఘోరము కాదు. నాయనా! బ్రదికియుండిన సుఖములు బడయవచ్చు. నామాట వినుము.

రంగ—అమ్మా! నన్ను క్షమింపుము. అసత్యమాడుట నావలన గాదు. సత్యమే దైవము. సత్యమే యాత్మ. ఆత్మ నాశనమైనపిమ్మట మఱికొన్నినాళ్లీతుచ్ఛజీవము భరించి ఏమి ప్రయోజనము? అందుకనియే వెంటనే పోలీసుస్టేషనునకు పరువెత్తితిని. ఆలసించినచో యీపాడుబ్రతుకుపై తీపిచే మరల నేమి దుర్బుద్ధిపుట్టునో, నీయధీరోక్తులచే ధైర్యము సడలునో అని భీతిచెందియే వెంటనే ఉన్ననిజము చెప్పివైచితిని.

నాగ—నాయనా! నీవు పోలీసువారిచెంత నిజముచెప్పినను ప్రమాదములేదట. అది యసత్యమని మరల మార్చుకొనవచ్చునట. నామాట వినుము. నన్నధోగతిపాలు చేయకుము.

రంగ—అమ్మా! కక్కినకూడు మరల తినుమందువా? నేను బుద్ధిపూర్వకముగా చెప్పినసత్యమును, మరల నిప్పు డసత్యమని బొంకుదునా! ఎంతమాట! ఇదిగో! మఱి పదినిమిషములలో న్యాయాధిపతిచెంత నానేరమును అంగీకరింపబోవుచున్నాను. సత్యము నణుమాత్రము దాచిపెట్టను.

నాగ—అయ్యో! తండ్రీ! అట్టిపని మాత్రము చేయకుము కన్నతల్లిని వేడుకొనుచున్నాను. వినుము.

**రంగ**—అమ్మా! వలదు. నన్ను వారింపకుము.

(పిచ్చయ్య ప్రవేశించి)

రంగరాజుగారూ! న్యాయాధిపతులు దయచేసిరి.

**రంగ**—ఇదిగో! సిద్ధముగా నున్నాను. అమ్మా! నమస్కారము.
(పిచ్చయ్యతో నిష్క్రమించును.)

**నాగ**—నాకర్మము. దౌర్భాగ్యురాలను (దుఃఖింపుచుండ, వార్డరు నెమ్మదిగా వెలుపలికి గొంపోవును.)

(తెర పడును.)

---

# అంకము. 7

[తదుపరి ఆఱుమాసములకు. మదరాసు పెనిటెన్షియరీలో ఉదయం గం 5-30 లకు. శిక్ష విధింపబడినవాళ్లు ఉండేకొట్టులో నున్నాడు రంగ రాజు. పిచ్చయ్య ఆనందస్వామిని ప్రవేశపెట్టును.]

**ఆనం**—తుదకు నిన్నీ శోచ్యావస్థలో చూడవలసివచ్చె గదా! ఆఱుమాసముల క్రితం ఆఏడిలో నీవుపదేశం పొందినతదు పరి, మరల నీజాడయే తెలిసినదికాదు. నేను తీర్థాటనము ముగించుకొని, నిన్న మదరాసు వచ్చునప్పటి కీదుర్వార్త చెవినిబడినది. నేటిఉదయం ఆఱుగంటలుదాటినచో మఱి చూపులే యుండవనికూడ జెప్పిరి. అంతట నెట్లో అధికారు లనుపట్టుకొని, అనుజ్ఞపొందుసరి కీవేళయైనది. కుమారా! ఎంతటి యపరాధియైనను తప్పుయొప్పుకొని, పశ్చాత్తాపము జెంది క్షమింప వేడినచో సహింపుమనికదా నీకుపదేశించితిని? ఇట్టి ఘోరకృత్య మెట్లు చేసితివి?

**రంగ**—చిత్తము. శ్రీకృష్ణభగవానునిసమక్షమున దోషమంగీక రించి, మరల నెన్నడు నట్టిపాపముచేయనని ప్రమాణము చేయు మనగా నిరాకరించి, అసాధ్యపుకోరిక కోరినది. నేనేమి చేయుదును? పశ్చాత్తాపముచెంది, మరల నట్టిదోషము చేయనని చెప్పినగదా మీరు క్షమింపుమంటిరి? అది అట్టి ప్రమాణముజేయ నిరాకరించుటచే చంపివైచితిని. ఇందు నేను తమయాజ్ఞ మీఱిన దేమియున్నది?

ఆనం—ఎంత ప్రమాదము జరిగినదోయి! ఇందుకనియే పెద్దలు అనధికారికి అధికపదవి ఉపదేశించరాదనిరి. నీకవగాహనము గాని ధర్మము నుపదేశించుట నాదియే దోషము. కుమారా! తమపాపముల నొప్పుకొని, గడచినదానికి వగచి, 'ముందు సన్మార్గమున చరింతుమనువారిని క్షమించి, ఎప్పటివలె ఆదరింపుమని చెప్పితినే కాని, అట్లులొప్పుకొనక బాగుపడగోరని వారిని చంపుమంటినా? వంటచేసికొందగినకొఱవితో తల గోకికొంటివేమి? నిరోధింపదగిన మనః ప్రవృత్తులకు నిష్కారణము దాసుడవై పోతివేమి! తైలపూర్ణమైనదీపియ తెలియక గాలిలో పెట్టి చేసేత చల్లార్చుకొంటివి. కుమారా! ఎంత మందభాగ్యుడవోయి నీవు! పర్వతాగ్రములన్నియు వెదకి, నినుగానక, పర్వతపాదములెల్ల శోధించి నీజాడ తెలియక, సమతలములంతట పాఱజూచియు కనుగొననేరక, తుదకు లోయదెస నొక్కచూపు ప్రసరింపజేసి, అందుబడియున్న నీపాటుకన్నులార గాంచవలసివచ్చినదా! ఎంత ఘోరము! (కంట నీరు పెట్టుకొనును.)

రంగ—స్వామీ! నాకొఱకు విచారింపకుడు. నాకు ధైర్యము చెప్పవలసిన యీతరుణమున మీరుగూడ కంట నీరిడి, నన్ను ధీరుని గావింపకుడు. అది నిర్వికారయై, నిశ్చింతగా ప్రాణములువిడిచినది. నన్నుగూడ నట్లే మృత్యుముఖము చొఱనిండు. చిత్తస్వాస్థ్యముతప్పి, క్రోధపిశాచావిష్టమైన క్రూర జంతువుగాని, యీఘోరకృత్యము చేసినది మీశిష్యుడు కాడు.

**ఆనం**—మఱి కోర్టులో నట్లు చెప్పక, బుద్ధిపూర్వకముగా చంపితి నని చెప్పి యీఘోరమరణ మేల కొనితెచ్చుకొంటివి? తాత్కాలిక క్రోధావేశముచే చంపితినని యథార్థము చెప్పి నచో న్యాయాధిపతిగూడ యించుక దయదలచి, యీమరణ శిక్షబదులు ద్వీపాంతరవాసము విధించియుండునే! కోపవివ శుడై, యొడలెఱుంగక చంపెనని మీయమ్మగారు చెప్పిన సాక్ష్యమును నీవేల పూర్వపక్షముచేసితివి?

**రంగ**—చిత్తము. నేను యథార్థమే చెప్పితిని. ఆరాత్రియంతయు నే నాలోచించి, ప్రమాణము చేయనిచో చంపుటకే నిశ్చ యించి, బాకుగూడ సిద్ధముగా నుంచుకొంటిని.

**ఆనం**—అగుచో, నింతకుమున్ను, చిత్తస్వాస్థ్యముతప్పి, క్రోధ పిశాచావిష్టుడనై చంపితి నంటివేమి?

**రంగ**—అదియు నిజమే. పిచ్చివానికి మాత్రము ద్రోహవిచారణ ముండదా స్వామీ? అట్లే క్రోధావిష్టుడును ఆలోచించియే చేయును. నేను బారిస్టరును. కోర్టుతోపాటు ధర్మరక్షణ మున నాకు భాగస్వామ్యము కలదు. ఇది మరణశిక్షకు యోగ్యమైన నేరముగావున ఆశిక్ష విధించుటకు నేను దోడ్పడితిని. అదియునుగాక, ఇట్టి ఘోరపాప మొనర్చిన నే నింకను బ్రదికియుండి ఏమి బ్రామికొందును? సుభద్ర నన్ను దయ్యమై పట్టి, పీల్చి పిప్పిచేయునుగాని, నాకు క్షణమైన చిత్త శాంతి నిచ్చునా? అదియునుగాక, బిడ్డలను చేతులార మాతృహీనులనుచేసిన క్రూరుడను, నేనింక వారిద్ర మొగ మెట్లు చూడగలను? నాబిడ్డల నొకసారి తుదిచూపు చూచు టకు నాకన్నులు, తనివిదీఱ గాటపుగౌగిట నదుముకొనుటకు.

నాచేతులు నెంత తహతహ చెందుచున్న వో దైవమునకే యెఱుక. కాని పాపకర్ముడను, నా కాభాగ్యము లేదు. అందు కనియే నిన్న మాయమ్మ పిల్లలను తీసికొనివచ్చినపుడు చూడ నిరాకరించితిని. అయ్యో! నాబిడ్డలారా! ఈపాపకర్ములకడు పున నేల పుట్టితిరోయి తండ్రీ? దైవమా! మాపాపఫలము మాబిడ్డల జెందనీయక వారండ్రను పదికాలములపాటు రక్షింపుము. మేమనుభవించిన యీఘోరదుఃఖములు నాకూనల దరి జేరకుండును గాక! అయ్యో! కాటికి కాళ్లుచాచుకొని యున్న మాయమ్మ కెన్నితిప్పలు దెచ్చిపెట్టితిని. ఆమెను దలచుకొనిన నాకడుపు చెఱువగుచున్నది. నాచావునకేమి, నాకిపు డది వరమేగాని దుఃఖకారణముగాదు. ఈపాపిష్ఠజన్మమున కింతటనైన స్వస్తిచెప్పి క్రొత్తజన్మమున కడుసుద్రొక్క గలుగుట మహాభాగ్యము గాదా స్వామీ! అందులకే నేను న్యాయాధిపతిని గృపాదానము గూడ యాచింపనైతిని.

ఆనం—నీ వీవిషయమున నుపేక్షించుట తగదనియే నాయభిప్రాయము. నీవు విన్నప మంపుకొన్నచో ప్రాణములతో విడుచుట సంభవింపవచ్చును. బ్రదికియున్నచో జరగినదానికి వగచి, పాపప్రాయశ్చిత్త మొనర్చుకొని ఈజన్మముననే బాగుపడవచ్చును గదా!

రంగ—బాగుపడుటమాట యెటులున్నను ముందు నేను దయనీయుడను కాననుట నిర్వివాదము. రెండవది, ఈమొండి జీవములు నిలుపుకొని, కారాగృహమున సంవత్సరములతరబడి, బోనులోనిమృగమువలె పడియుండుట నాకే కాదు; ఎవ్వరికేని సహింపరానిదే. మృత్యువు దానియంత దుస్స

హాము కాదు సరిగదా, వీరకృత్యమని కూడ యెంచవచ్చును. అనంతములగు దివ్యలోకముల కది వివృతద్వారము. కారాగృహమున దీర్ఘవాసమును నిర్దోషులు సహింపగలరు. యుద్ధమున శత్రులచే జిక్కినవారు, ధర్మరక్షణార్థము, దేశస్వాతంత్ర్యముకొఱకు, స్త్రీస్వాతంత్ర్యముకొఱకు చెఱబడిన వారు నాబంధనమును సంతోషముతో ననుభవింతురు. అట్టి వారికి,

రాతిగోడలు గావు కారాగృహమ్ము
లినుపకటకటాలును బోను లనగరాదు
పాపరహితులౌ శాంతులపాలిటి కవి
బంధములు గావు; వరతపోవనులుగాని.

పాపమతుల కవియే నరకము లై యాతన గూర్చును. కావుననే నేను మృత్యువును వరించితిని. ఇప్పటికి దానినే వరించుచున్నాను. ఇక పశ్చాత్తాపమందురా, ఇంతదనుక జెందిన తాపము చాలును. న్యాయ్యమగు మృత్యువుకంటె నాపాపమునకు వేఱు ప్రాయశ్చిత్తము గూడ నక్కఱలేదు. మనువు గూడ పాపులకు రాజదండమే ప్రాయశ్చిత్త మనెను. ఆతని వాక్యము పరమప్రమాణము గదా స్వామీ!

**ఆనం**—నిస్సంశయముగా! 'పాపోహ'మని తపించి శరణుచెందిన వారిని దైవము కరుణించుట నిశ్చయమే.

(పిచ్చయ్య ప్రవేశించును.)

**పిచ్చయ్య**—మీసంభాషణకు విఘ్నమై వచ్చితిని, క్షమింపుడు. ఆఱుగంటల కాపని జరుగవలెనుగాన శిక్షితుని గొనిపోవు వేళయైనది.

**రంగ**—స్వామీ! తమరు గూడ దయచేసినచో తమసమక్షమున ప్రశాంతిమై ప్రాణములు విడువగలను.

**ఆనం**—కుమారా! నేను ప్రాణిహింస జరుగుచోటికి రాదగదు. నేను ప్రత్యక్షముగా నచట లేకున్నను, నాయాత్మ నిన్నను సరించియే యుండును.

**రంగ**—చిత్తము. ఈదాసునితో గూడ తుదిసారి యీశ్వర ప్రార్థన మొనర్ప వేడెదను.

(ఇరువురును ప్రార్థింతురు.)

ఓమ్. అసతో మాసద్గమయ, తమసో మాజ్యోతిర్గమయ
మృత్యోర్మామమృతం గమయ, ఆవిరావిర్మయేధి
రుద్రయత్తే దక్షిణం ముఖం, తేన మాం పాహి నిత్యం.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

**ఆనం**—నేనింతట వెళ్లివచ్చెదను. (కన్నీరోడుచుండ నిష్క్రమించును.)

**రంగ**—పిచ్చయ్యా! మనమింక న్యాలసింపనేల? పోదము పద.

**పిచ్చ**—రంగరాజుగారూ! మీవంటివృద్ధికాముల కింతచిన్నతనమున హతవిధి ఎట్టిదురంతము తెచ్చిపెట్టెను. మీపాటు నాకు....

రంగ—వలదు. పిచ్చయ్యా! నాకొఱకు విచారింపవలదు. నేడీ దురంతము చెందుచున్నది అందులకు దోషులవంటివాడు కాడు. ప్రమాదపతితుడైన యీజీవి వ్యర్థమగు పాంచ భౌతికశరీరమును మనస్సును ఇట విడిచి, మరల నూత్నమన శ్శరీరములు సంపాదించుటకు లోకాంతర ప్రయాణోన్ముఖు డగుచున్నాడని తెలిసికొనుము. చిరపరిచిత ప్రవాహగర్భ మున నిర్విచారముగా గుభాలునదుముకు నీతగానివలె మృత్యుముఖమున ప్రవేశింతునుగాని పిఱికిపందవలె భయ కంపితుడనై నీహృదయమునకు వేదనగూర్పను. స్వయంకృత పాపప్రమాదములచే కొనితెచ్చుకొన్న నాబంధములకు మృత్యువే మోక్షదాత్రి. ప్రాయశ్చిత్తయోగ్యత గూడ నతి క్రమించిన యీపాపిష్ఠజన్మ మింతట జాలించి, లోకాంతర మున భవాంతరముచే పవిత్ర మొనర్చుకొందును. రమ్ము. నాకొఱ కీయనుచితవిచారమేల? జాగగుచున్నది. దారి తీయుము (అశ్రుపూర్ణనయనుడైన పిచ్చయ్యకేలు గ్రహించి, ఉరికంబముచెంతకు, షికారుపోవుచున్నట్లు సుస్థిరుడై, నిర్వి చారముగ నడచిపోవును.)

(తెర పడును.)

సమాప్తము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1938.

# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 4 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 1 | 4 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రికృతము | ... | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | ... | 7 | 0 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 2 | 8 |
| డిటో ఆరణ్యపర్వము | ... | 2 | 8 |
| డిటో విరాటోద్యోగపర్వములు | ... | 2 | 8 |
| డిటో భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| డిటో కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | ... | 2 | 0 |
| డిటో శాంతిపర్వము | ... | 4 | 0 |
| డిటో అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| డిటో 7 సంపుటములు ఒకేపర్యాయము కొనినచో | | 20 | 0 |
| ఆంధ్రమహాభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | | 0 | 8 |
| ఆంధ్రవచనరామాయణము, 7 కాండలు, రెండుసంపుటములు | | 12 | 0 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీగురుజాడ శ్రీరామమూర్తి | ... | 3 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము, కే. వెంకటనారాయణరావు | | 1 | 8 |
| ఈసపునీతికథలు, ప్రథమభాగము, పంగూరి సుబ్బారావు | ... | 0 | 6 |
| డిటో రెండవభాగము | ... | 0 | 8 |
| ఋషులచరిత్ర, రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు | ... | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | ... | 0 | 8 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| త్రిలిజ్గకథలు | ... | 0 | 8 |
| తులసీదాసురామాయణము | ... | 7 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| తెనాలిరామలింగనికథలు | ... | 0 | 4 |
| దక్కనుపూర్వకథలు | ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రి | ... | 1 | 8 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెనుఁగువచనము | | 3 | 0 |
| దేశింగురాజుకథ (జంగముకథ) | ... | 0 | 6 |
| నలచరిత్ర, చిన్నసైజు పటములతో | ... | 0 | 6 |
| నవనాథభక్తులచరిత్ర, శ్రీబచ్చు రామన్న | ... | 2 | 0 |
| నలుగురుమంత్రులకథ | ... | 0 | 4 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | ... | 0 | 6 |
| పరిహాస్యావినోదకథలు | ... | 0 | 12 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 6 |
| పతివ్రతలచరిత్ర, మంగిపూడి వేంకటశర్మ | ... | 1 | 8 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| పురాణగాథలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | ... | 0 | 10 |
| ప్రహ్లాదచరిత్ర, చిన్నసైజు పటములతో | ... | 0 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు,(Ancient History) | ... | 1 | 12 |
| బాజీరాయనిచరిత్ర, రాచకొండ అన్నయ్యశాస్త్రి | ... | 0 | 14 |
| బేతాళునికథలు | ... | 0 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము | ... | 0 | 8 |
| భోజునికథలు | ... | 0 | 8 |
| భోజకాళిదాసకథలు, ప్రథమభాగము, ఉత్పల వేంకట నరసింహాచార్యులు | ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము, మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి | | 0 | 12 |
| మదనకామరాజుకథలు | ... | 0 | 14 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| మహాభక్తవిజయము, విస్తరింపఁబడినది. నూతనముద్రితము, చిత్రపటములతో సహా | ... | 6 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 3 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| వివేకానందవిజయము | ... | 1 | 12 |
| వీరాంగనలు, 22 వీరాంగనలచరిత్రలు గలవు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి | ... | 0 | 12 |
| వైద్యులకథలు, శివలమల్లు చెన్నాప్రగడసీతన్న అను ఇద్దరివైద్యుల అద్భుతచికిత్సలుగలవు | ... | 0 | 4 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 4 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| షేక్స్పియర్ నాటకకథలు, లాంబు వ్రాసినవానికి తెనుగు అ. ఉమాకాంతముగారివిరచితము | ... | 1 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రి | ... | 1 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 4 |
| సావిత్రిచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 4 |
| సాక్షి, ఒకటవభాగము, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిది | | 2 | 0 |
| ,, రెండవభాగము ,, | ... | 2 | 0 |
| ,, మూడవభాగము ,, | ... | 1 | 8 |
| ,, నాలవభాగము ,, | ... | 1 | 12 |
| ,, ఐదవభాగము ,, | ... | 1 | 0 |
| ,, ఆఱవభాగము ,, | ... | 1 | 0 |
| సాక్షి, 6 భాగములు ఒకటేసారి కొన్నచో | ... | 8 | 0 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము | ... | 0 | 8 |
| శార్ఙ్గధరచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 6 |
| హితోపదేశము, వచనము సులభశైలి | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, మదరాసు.

